


సంపుటి: 4 ఫిబ్రవరి 1981 సంచిక: 1

## ఈ నెల సమగ్ర నవల

ఐదేళ్ళ వయసులోనే కన్నవారికి దూరమైందా పాప. ఎవరి వల్ల దూరమైందో అతడితోనే తల్లిదండ్రుల్ని వెతుక్కుంటూ ఎన్నెన్నో ఊళ్ళు తిరిగింది. ఆ పసి వయసులోనే ఆమెకెన్నో అనుభవాలు ఎదురయ్యాయి. అవే ఆమెకు పాఠాలయ్యాయి. తోడుగా నీడలా నిలబడ్డ సహచరుడి సాంగత్యంలో ఆ అనుభవాల పాఠాలతో ఎదిగింది. వ్యక్తురాలయింది. ఆ దశలోనే అనుకోకుండా కన్నవారిని కలుసుకోగలిగింది.

పెళ్ళయింది. కానీ పాత వాసనలు, అలవాట్లు ఆమెని వదిలిపెట్టలేదు. ఫలితంగా తరువాతి పరిణామాలూ, వైవాహిక జీవితంలోని ఒడుదుడుకులూ ఆమెను ఎటు నడిపాయి?

కావాలని ఆరాటపడ్డ —

# పునర్మిలనం

లో కూడా ఆమెకు సుఖ శాంతులు ఎందువల్ల కరువయ్యాయి?
మారిన పరిస్థితుల్లో ఆమె తీసుకున్న నిర్ణయమేమిటి?
సవాలుగా నిలిచిన జీవితాన్ని 'సబల'గా ఎదుర్కోగలిగిందా?

## డాక్టర్ కొర్రపాటి గంగాధర రావు

తల్లిదండ్రులకి దూరమైన ఒక యువతి అనుభవాల దొంతరలని ఆసక్తికరంగా మలిచిన 'పునర్మిలనం' ఈనెల 'చతుర' సమగ్ర నవల.

ముఖ చిత్రం: దిలీప్ బెనర్జీ

రెండు, మూడు కవర్లు: - సూరజ్ ఎస్. శర్మ

---

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500004.



"కర్కశంగా, గరుకుగాఉండే
పళ్ళపొడులు మీ పళ్ళకు,
చిగుళ్ళకు
హానికలిగించవచ్చు..."

# కొల్గేట్ టూత్ పౌడర్‌తో మీ చిగుళ్ళను, చెడుశ్వాసను కూడా అరికట్టండి పళ్ళను కాపాడుకోండి.







కోల్గేట్ టూత్ పౌడర్ ఎంతో మెత్తగా ఉండే తెల్లని పౌడర్. అది అతి మృదువుగా మీ చిగుళ్ళను తోముతుంది. అంతేగాకుండా దానిలో ఉండే సున్నితమైన మెరుగునిచ్చే పదార్థం మీ పళ్ళ మీది పాచిపొరలను తొలగిస్తుంది. మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా చేస్తుంది. కోల్గేట్‌లోని పుష్కలమైన నురుగునిచ్చే చర్య పళ్ళ సందులలోనికి చొచ్చుకుపోయి చెడు వాసనను దంతక్షయకారకములైన సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది.

**మీ కుటుంబానికి కోల్గేట్ టూత్ పౌడర్‌తో అధునాతనమైన తీరులో దంతరక్షణ సమకూర్చండి. దానియొక్క చల్లని, పిప్పర్‌మెంట్ రుచిని వారంతా మెచ్చుకుంటారు.**

TP.G. 30 TL

# చమత్కార

## కళాసేవ

చౌరాస్తాలో ఒక ఎలక్ట్రిక్ స్థంభానికి ఓ అందమైన చిత్రం వేలాడగట్టబడి వుంది. చిత్రం చుట్టూ జనం గుమిగూడి వున్నారు. ఎవరి నోట విన్నా పొగడ్తే. "ఎంత అద్భుతంగా వుందీ చిత్రం–ఆ కళాకారుడి జన్మ ధన్యమైంది. ఓ... ఓ" ప్రశంసల వర్షం కురుస్తోంది.



ఇంతలో ఓ బక్క పల్చటి వ్యక్తి జనాన్ని నెట్టుకుంటూ వెళ్ళి చిత్రం దగ్గర నిలబడ్డాడు. జనంవైపు తిరిగి అన్నాడు–"సోదరులారా! ఈ చిత్రాన్ని వేసింది నేనే. ఈ చిత్రం మీ అందరికీ బాగా నచ్చిందని మీ ప్రశంసల ద్వారా తెలుసుకున్నాను. మీకు నా ధన్యవాదాలు"

జనం అందరూ ఆ చిత్ర కారుణ్ని మళ్ళీ అభినందించారు. ఈ సారి చిత్రకారుడి మొఖం పాలిపోయింది. కళావిహీనంగా మారిపోయింది.

చిత్రకారుడు రుద్ధమైన కంఠంతో అన్నాడు. "మీ రందరూ నా చిత్రాన్ని హృదయపూర్వకంగా మెచ్చుకున్నారు, అభినందించారు. కానీ ప్రస్తుతం నాకు కావలసింది ప్రశంసలు, అభినందనలు కాదు. పట్టెడు మెతుకులు. మూడురోజుల నుంచి నాకు తిండి దొరకలేదు ఎవరైనా ఈ చిత్రాన్ని కొనగలిగితే నాకెంతో సహాయకరంగా వుంటుంది. కళాసేవ చేసిన ఖ్యాతీ మీకు దక్కుతుంది. నా చిత్రాన్ని అభినందించిన ఇందరిలో ఎవరో ఒకరు తప్పకుండా ఈ చిత్రాన్ని కొంటారని ఆశిస్తున్నాను"

కొద్ది నిమిషాలు గడిచాయి. చౌరాస్తాలో ఆ చిత్ర కారుడు మాత్రమే ఉన్నాడు. ప్రశంసలు కురిపించిన మనుషులు ఎటు అదృశ్యమైపోయారో తెలియదు.

## లేబరవార్డు

మా మృత్యుంజయరావు అమాత్య శేఖరులవారి పి. ఎ. బాగా చదువుకున్నవాడు, తెలివైనవాడు. వాడి ద్వారా బోలెడు పనులు చేయించుకోవచ్చు. మా

# కత్తెర

పెద్దవాడికి ఉజ్జోగం, చిన్నాడికి సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ స్కీంలోను, నాకో కాంట్రాక్టు వగైరా వగైరా పనులన్నీ ఎంచక్కా చేయించుకోవచ్చు.

అలాంటి మా మృత్యుంజయరావు నేను వెళ్లేసరికి పిచ్చాడిలా జుట్టు పీక్కుంటూ కూర్చున్నాడు. దగ్గరకు వెళ్ళడానికే భయమేసింది. అయినా వెళ్ళి వాడి జుట్టు సరిచేసి అడిగాను "ఏమిట్రా ఇదీ" అని.

మా మృత్యుంజయుడు వలవలా ఏడుస్తున్నాడు గాని అసలు సంగతి చెప్పటం లేదు. ఒక గంట సేపు బుజ్జగించాకే చెప్పాడు. అసలు విషయం ఏమిటంటే నిన్న అమాత్య శేఖరులకు ఆస్పత్రులు ఎలా నడుస్తున్నాయో స్వయంగా పర్యవేక్షించాలన్న కోరిక చెలరేగి వెంటనే హుటాహుటిన బయలుదేరి నగరంలోని జనరల్ హాస్పిటల్‌కి వెళ్ళారు. సదరు పర్యవేక్షణా దాడిలో వార్డులన్నీ తిరిగి చూస్తున్న సమయాన 'లేబర్' వార్డ్ వచ్చింది. ఆరోజు ఖర్మకాద్దీ అక్కడ గర్భిణి స్త్రీలు ఎవరూ లేరు. మంత్రిగారి దాడికి ఒక గంట క్రితం వార్డులో వున్న నలుగురు బాలింతరాళ్ళను వాళ్ళు కన్న పసిబిడ్డల్తో సహా భద్రంగా డిస్చార్జ్ చేసారు. వార్డు ఇంకా క్లీన్ చేయలేదు. బెడ్లు, బెడ్‌షీట్లు అరాచకంగా పడివున్నాయి. రక్తం మరకలు కూడా కనిపిస్తున్నాయి. అది చూసి అమాత్య శేఖరులకు ఆవేశం ఆగింది కాదు. చుట్టూ వినయంగా చేతులు కట్టుకున్న డాక్టర్ల మీద విరుచుకు పడ్డారు.

"అసలు ఏటనుకుంటున్నారు మీరు ? లేబర్ అంటే మీ కంత సులకనగా వుందేటి తాజమహల కట్టింది లేబర. యుద్ధం చేసింది లేబర. సౌతంత్రం సంపాయించింది లేబర. అలాంటి లేబరల వార్డుని ఇట్టాగేనటయ్య వుంసేది. ఏటనుకుంటున్నారు మీరంతా డిస్మిస్ చేసీగలను. నేనసలె లేబరోళ్ళ మంత్రిని !




ఖబడ్దార్. ఎంటనే మంచి జంపకానాలు, పట్టు చూది పరుపులు ఏసెయ్యండి లేబరోళ్ళకు.ఏయ్! పి. ఎ. ఇట్రా. ఇదిగో ఈ రివల్యూషన్ పాస్ చేసేస్తున్నాను. రాస్కో" అనరిచారు మంత్రిగారు ఆవేశంగా.

లేబర్ వార్డు అంటే కూలీల వార్డుకాదు ప్రసవాల వార్డు అనీ, పాస్ చేసేది రివల్యూషన్ కాదు రిజల్యూషన్ అనీ

# నూతన జీవితం

పూర్వకాలంలో ఓ మహా జ్ఞానియైన రాజు ఈ విధంగా వ్రాశాడు; "సూర్యుని క్రింద నూతనమైనదేదియు లేదని". ఈ సూక్తి అంతర్యం ఆలోచిస్తేనేగాని అంతుపట్టదు. ఇలాంటి సూక్తులు వ్రాయబడి కొన్నివేల సంవత్సరాలైనా, నేటికిని అవి సజీవంగానే నిలిచాయి. మానవుని శాస్త్రీయ పరిజ్ఞానం పెరుగుతున్నా, ఈ దినాల్లో సూర్యుని కింద కొత్తదంటూ యేదియు కనుగొనలేకపోయారు. విశ్వాంతరంపై మానవుని పయనం - చంద్రమండలంపైనా దిగడం నిజానికి మనం వూహించనటువంటి కార్యాలు. అయినా యివేవి సూర్యుని క్రింద కొత్తవికావు.

అయితే సూర్యుని క్రింద కొత్తదంటూ ఒక్కటుంది. సూర్య చంద్ర, భూగోళాల్ని సృష్టించిన దేవుడు అన్నింటికీ పైగా నున్నాడు. ఆ దేవుని ఆత్మ ప్రవేశించిన మానవుని హృదయం అదే సూర్యుని క్రింద కొత్తగా వుంటుంది. దేవుని ఆత్మ పొందినవారు, సూర్యుని కింద నూతనత్వం పొందిన మానవులుగా పరిగణింప బడ్తారు. వారి జీవిత స్వరూపాలే మారిపోతాయి. వారిలో దైవ లక్షణాలు కానవస్తాయి. అట్టి నూతనమైన జీవితం మీకు లభించాలంటే ఈరోజే మాకు వ్రాయండి. దైవరూపం ఆయన లక్షణాలు నీలో జనించి పవిత్రుడవగుటకు ఓ పవిత్ర గ్రంథాన్ని మీకు పంపగలము. మీరు తప్పక ఆ గ్రంథాన్ని చదవండి. మీ ఉత్తరం కొరకు ఎదురు చూస్తూంటాం. "నమస్కృతులు"

## ఉచితం! ఉచితం!!

దేవుని శాశ్వత ప్రేమను తెలిసికొని నిత్యజీవనను పొందగోరేవారు నేడే మాకు వ్రాయండి. మీకు ఉచితంగా 300 పేజీలుగల చక్కని పుస్తకంను మా తపాలా ఖర్చులతో పంపగలం.

**ఎ. యం. జి.**
**పోస్టుబాక్సు నెం. 1820**
హైదరాబాద్-500 020 (ఆం. ప్ర.)

అమాత్యశేఖరులకు వివరించటం మర్యాద కాదని అంతా గొర్రెమూకలా తలాడించే సారు.

అక్కడ నుంచి బయలుదేరి టి. బి. హాస్పిటల్ మీద దాడి చేసారు అమాత్య శేఖరులు తన బృందంతో సహా.

హాస్పిటల్ అంతా దర్శించటం అయింది. అదిగో అప్పుడే అమాత్యుల బుర్రలో ఓ ఫ్లాష్‌లైట్ ఎర్రెర్రగా వెలిగింది.

అక్కడ ఎన్నో వార్డులున్నాయి కాని లేబర్‌వార్డు లేదు. అంతే ఆయన మరొక్కసారి డాక్టర్ల మీద విరుచుకుపడ్డాడు. "అక్కడ ఆస్పిటల్లో గుడ్డిదో మెర్రిదో ఓ వార్డుందనుకుంటే ఇక్కడసల్లేకుండా చేస్తారా ? అసలు మీరంతా డాటర్లేనా? ఎంటనే ఇక్కడ లేబర వార్డు ఎట్టించండి" అంటూ పళ్ళు నూరారు అమాత్యశేఖరులు.

పి.ఎ.ని అంటే మా మృత్యుం జయుణ్ని పిలిచి మరొక్కసారి మరో రివల్యూషన్ పాస్ చేయించేసారు. మధ్యలో ఛీఫ్ సర్జన్ కలగజేసుకుని వివరించబోయారు కానీ ఈయన వింటేనా "డిస్‌మిస్ చేసీగల్ను జాగ్రత్త" అంటూ విశ్వ నరసింహ రూపాన్ని ధరించేసారు మంత్రిగారు.

అంతా విన్నాక అన్నా న్నే సన్నిన్నసగా జరిగినదానికి ఇప్పుడెందుకురా జుట్టు పీక్కుంటున్నావని –

"ఇవ్వాళ అమాత్యశేఖరులు పిచ్చాసుపత్రి మీద దాడి చేయబోతున్నార్రా. ఆయనతోపాటు నేనూ..." అంటూ ఘొల్లుమన్నాడు మళ్ళీ మావాడు.

—గౌస్

# పందెం

"ఆ ఇంట్లో దిగుతున్న నిన్ను చూసి జాలిపడడం తప్ప ఏం చెయ్యలేక పోతున్నా గురూ......" అన్నాడు ముకుందం కాఫీ కప్పు టేబిల్ పైఉంచుతూ.

"ఇల్లు, అద్దె రెండూ బాగానే వున్నా యిగా...?" అన్నాడు ప్రకాశం.

"అన్నీ బాగానే ఉంటాయి. కాని ఆ ఇంటికి ఎదురుగావున్న జిడ్డు రామ్మూర్తి బాధే భరించలేం"

"వాడికీ, మనకూ సంబధం ఏమిటి?"

"ఎటువంటి సంబంధం లేకపోయినా క్షణాల్లో బంధుత్వం కలిపేస్తాడు. ఆవకాయ దగ్గర్నుంచి ఆటంబాంబు వరకూ ఏ విషయం గురించైనా అసర్గళంగా మాట్లాడేస్తాడు.

మొదట్లో కాలక్షేపానికి పనికొస్తాడని ఊరుకొంటే అప్పడాల పిండిలా అంటుకుపోతాడు. తెలుగు సినిమా సంఘటనల్లాగే అతని సంభాషణకూడా ఒకదానికొకటి సంబంధం లేకుండా గొలుసు కథలాగ సాగుతుంది. గట్టిగా చెప్పి వదిలించుకుందామంటే అతని కొడుకు పర్మిట్లుఇచ్చే ఆఫీసరుగా పనిచేస్తున్నందున ఎప్పటికైనా ఉపయోగపడకపోతాడా అని బలవంతంగా ఆ బాధ భరిస్తున్నాం."

"ఈ జిడ్డు రామ్మూర్తిలాంటివాళ్ళను వదిలించుకోవడం నాకేం సమస్యకాదు. కావాలంటే పందెంకాసి చూడు"



# నిబ్బరంగా ఉండాలనుకుంటే...

## ...అందుకు తోడ్పడే సంస్థ మీకు తోడుగానే ఉంది!

## మార్గదర్శి దానికొక మార్గం చూపిస్తుంది...

ప్రతి వ్యక్తి జీవితంలోనూ కొన్ని బరువు బాధ్యతలూ ఉంటాయి. అవి తీరాలంటే అందుకు తగిన సాధన సంపత్తి చాలా అవసరం. కుమారుని విద్య, అమ్మాయి వివాహం, సుఖజీవనానికో ఇల్లు వ్యాపార ప్రారంభానికి మదుపు ... ఇలా బాధ్యతలు ఎన్నో రూపాల్లో ఉంటాయి. వీటికి సరైన పరిష్కారమార్గం – తగిన పథకం మార్గదర్శి చూపిస్తుంది.

కొన్ని ప్రధాన అంశాలు:

* రూ. 10,000 నుంచి రూ. 1,00,000 వరకూ మీ శక్తికీ, అవసరాలకూ సరితూగే వివిధ చిట్‌లు, రూ. 200 నుంచీ, రూ. 2,000 వరకూ నెలసరి వాయిదాల్లో చెల్లించే అవకాశంతో.

* సత్వర చెల్లింపులు. ఏ చిట్‌ఫండ్ సంస్థలోనూ కానరాని రీతిలో పాడుకొన్న రెండు వారాల్లో మొత్తం లభిస్తుంది.

* డబ్బు నష్టపోయే ప్రమాదం లేదు. పద్దెనిమిది ఏళ్ళకు పైగా ఈ రంగంలో నిలదొక్కుకుని ఉన్న సంస్థ చరిత్రే అందుకు తార్కాణం.

డబ్బుకోసమేనా మీ చింత?
మార్గదర్శి ఉన్నది మీ చెంత!



**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

500 001.

ప్రకాశంతో వంద రూపాయలు పందెం కాసిన ముకుందం ఆ రోజునుంచి శ్రద్ధగా గమనించసాగాడు. ఓ రోజు జిడ్డు రామ్మూర్తి ప్రకాశం ఇంట్లోకి వెళ్ళడం, రెండు గంటలయ్యాక దాదాపుగా పరుగెత్తుతూ రావడం గమనించాడు. మర్నాడు కూడా ప్రకాశం ఇంటికి వెళ్ళిన రామ్మూర్తి మరో గంటలోగా కంగారుపడుతూ రావడం చూసి ఆశ్చర్యపోయాడు ముకుందం అంతేకాదు మరికొన్నిసార్లు ప్రకాశం ఇంటి వరకూ వెళ్ళి ఎవరో తరుముతున్నట్లుగా వెనక్కు వచ్చేసేవాడు జిడ్డు రామ్మూర్తి. దాదాపు ప్రకాశం జోలికి వెళ్ళడం మాను కున్నాడు ఆయన.

"నువ్వు పిలుస్తున్నా రాకుండా పారి పోతున్నాడు ఆ జిడ్డు రామ్మూర్తి. ఏం మంత్రం వేసావోయ్?!"... ఆశ్చర్యంగా ప్రశ్నిస్తూ పందెం కాసిన వందరూపాయలు ఇచ్చేసాడు ముకుందం.

"అందులో నా గొప్పతనం ఏమీలేదు. ఈ వంద రూపాయలు నా శ్రీమతి చీర కొనుక్కొనేందుకు ఇస్తానని ఆశపెట్టాను. నా శ్రీమతి వంటకాల రచయిత్రి. ఆ కూరలూ ఈ కూరలూ కలగా పులగంచేసి, పాత కూరలనే కొత్తపేర్లతో మలయాళ, తమిళ, ఆంగ్ల, హిందీ భాషలతో హెడ్డింగులు పెట్టి పత్రికలకు పంపడం, వాటిని పత్రికలవారు వెంటనే ప్రచురించటమేగాక పారితోషికాలు కూడా పంపిస్తుండడంతో ఏవో ప్రయోగాలు చేస్తూ వాటిని రాసి పత్రికలకు పంపడం ఆమెకు అలవాటయింది.

"జిడ్డు రామ్మూర్తిగారు వచ్చినరోజున నా శ్రీమతి ముందు రోజున చేయగా మిగిలిపోయిన చేగోడీల పిండితో పకోడీలు చేసి అతనికి పెట్టింది. మొహమాటం లేకుండా తిన్నాడు. కాని కొద్ది క్షణాల్లో తీవ్రంగా కడుపులో పనిచేయడంతో ఇంటికి పరుగెత్తాడు. మర్నాడు నీరసంగా వున్నా మళ్ళీ వచ్చిన అతనికి మళ్ళీ ఆ కొత్తవంటకం పెట్టింది. ఈసారి తిననని మొరాయించాడు. ఎన్ని కారణాలు చెప్పినా వినకుండా అవి తినకపోతే మీ మీద ఒట్టే అని నా శ్రీమతి ఒట్టుకూడా వేయడంతో గత్యంతరంలేక తినడం,



మళ్ళీ కడుపులో గుడగుడమనడంతో మా ఇంటికి రావడం తగ్గించాడు. కాని, మళ్ళీ రెండుమూడుసార్లు మా ఇంటిదాకావచ్చి నా శ్రీమతి వంటకం, ఒట్టు జ్ఞాపకం వచ్చి తిరుగు టపాలా వెనక్కుపోయాడు... అన్నాడు డబ్బు జేబులో పెట్టుకుంటూ ప్రకాశం.

—సుసర్ల సర్వేశ్వరశాస్త్రి

# వెనుక దెబ్బ

సుబ్బారావు సినిమా థియేటర్లోకి వెళ్ళే సరికి న్యూస్‌రీల్స్ వేస్తున్నారు. లైట్లు లేకపోవటం వల్ల చీకటిగా వుంది. ఎట్లాగో తడుముకుంటూ వెళ్ళి ఖాళీగా వున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు.

ఒక నిముషం తరువాత అతను తల తిప్పి చూసేసరికి పక్కసీట్లో మిత్రుడు గోవిందరావు కనిపించాడు.

"హల్లో బ్రదర్...చాలాకాలం తర్వాత కలిశాం" అన్నాడు సుబ్బారావు సంతోషంగా.

"నువ్వా సుబ్బారావ్! అవును, చాలా రోజులకు కలిశాం" అన్నాడు గోవిందరావు.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు సుబ్బారావు గోవిందరావుని.

"ఏమున్నాయ్ మామూలే... ఎట్లా వుంది ఉద్యోగం? వర్కు బాగా హెవీగా వుంటోందా?" అని అడిగాడు గోవిందరావు.

"హెవీ ఏమిటి బ్రదర్...సిటీ గదాని బుద్ధి తక్కువయి ఇక్కడకు ట్రాన్స్‌ఫర్ చేయించుకొన్నాను. ఇప్పుడు బాధపడుతున్నాను" అన్నాడు సుబ్బారావు.

"ఏమిటి డిఫికల్టీ?"

"ఒకటేమిటి? అన్నీ డిఫికల్టీసే... వర్కు బాగా ఎక్కువ.. నా ఒక్క సీటుకు తప్పించి మా ఆఫీసులో యింకెవ్వడికీ వర్కులేదు. ఎంత వర్కుచేసినా ఇంకా వుంటోంది. ఎంత చేసినా మా బాస్‌కి తృప్తివుండదు. రాత్రిళ్లు కూడా ఆఫీసులో కూర్చోమంటాడు.. వట్టి చాదస్తం ముండాకొడుకు" తన బాధను వెళ్ళబోసుకున్నాడు సుబ్బారావు.

"ఆశ్చర్యంగా వుందే! అయితే ఈ లెక్కన నేను అదృష్టవంతుడినే. నాకు అసలు వర్కులేదు. ఆఫీసులో కూర్చుని నవలలు చదువుకొంటాను రోజూ. మా ఆఫీసర్ కూడా ఏమీ అనడు. పాపం!!" అన్నాడు గోవిందరావు.

సినిమా మొదలయ్యింది.

అయినా సుబ్బారావు తనగోడు ఆపకుండా "నిజంగా నువ్వు అదృష్టవంతుడివి బ్రదర్. మా ఆఫీసరుతో చచ్చిపోతు




న్నాను. వట్టి సరపక్షి అనుకో..

అతను ఇంకా ఏదో అనబోతుండగా సుబ్బారావు నెత్తిమీద ఠపీమని దెబ్బ పడింది వెనకనుంచి..

ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూశాడు సుబ్బారావు.

వెనుక సీట్లో తన ఆఫీసర్ లేడు గానీ ఆయన భార్యా పిల్లలున్నారు.

— రవిశంకర్

సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఆ రోజుల్లో కరెక్టు గానే నడిచేది. ఆవేళా అలాగే నిడదవోలు దాకా బాగానే నడిచింది. తర్వాత అత్తిలి దాటి కొంత దూరం వెళ్ళి– అక్కడ ఆగి పోయింది. తర్వాత ... గంటదాకా మరి కదలలేదు.

రైలు కట్టకు రెండు పక్కలా రెండు చెరువులున్నాయి. వాటినిండా కన్నుల పండుగగా పద్మాలున్నాయి. చిరుగాలికి అల్లాడే అలల మీద తేలియాడుతూ చూడ ముచ్చటగా వున్నాయవి. చూపరు లందరినీ ఆహ్వానిస్తున్నట్లున్నాయి అవి.

బండి ఎంతకీ కదలకపోతే ఎవరి కాల క్షేపం వాళ్లు చేస్తున్నారు. ఎవరి కబుర్లు వాళ్లు చెప్పుకుంటున్నారు. అందరిలాగే ఫస్ట్‌క్లాస్ 'కూపే'లో వున్న సునంద, శ్రీధరం గూడా వారి సరస సల్లాపాల్లో వారు మునిగిపోయారు, కూతురు సంగతే మరచిపోయి. భువనేశ్వర్‌లో ఉద్యోగం శ్రీధరానికి. వేసంగి సెలవుల్లో వరసగా క్యాంపులు వేసుకుంటూ వెళ్తున్నారు. మద్రాసులో స్నేహితులున్నారు. బంధు మిత్రుల్ని చూడటమే కాక, ఈ ప్రయాణం దంపతులిద్దరికీ అదొక వినోదం గూడా. కానీ, అదృష్టం ఎదురు తిరిగింది.

వారిద్దరిదాంపత్యం అందరికీముచ్చటే. కూతురి వయస్సు ఆరేళ్ళు. ఏరికోరి 'అమృత' అని పేరు పెట్టుకున్నారు. అపు రూపంగా చూసుకుంటూ పెంచు కుంటున్నారు.

అమృత అప్పటివరకూ వారితోబాటే వారి 'కూపే'లోనే కూర్చుంది. రైలాగి నప్పుడే బయటకెళ్ళింది. వాకిలి దగ్గరే నుంచుని చెరువు వంకా, పద్మాల వంకా, అందులో ఈదులాడుకుంటున్న చిన్న పిల్లలవంకా చూస్తూ నుంచుంది. ఎప్పుడూ ఇన్ని పద్మాలను ఒక్కసారిగా చూడ లేదేమో– పరమానందం పొందుతూ వుంది. చెరువులో ఈదులాడే పిల్లలఅల్లరి అంతా ఇంతా కాదు. నడుంలోతునీళ్లలో గంతులేస్తూ నీళ్లు చిమ్ముకుంటున్నారు. ఒళ్లు మరచిపోతున్నారు. అందరిలోనూ ఓ కుర్రాడు మరీనీ– పదేళ్లుంటాయేమో. నల్లని రంగు! నున్నని గుండు. కళ్ళూ పళ్ళూ తెల్లగా మెరిసిపోతున్నాయి.

వాళ్ళ అల్లరి చూస్తూ నుంచుంది అమృత రైలెంత సేపటికీ కదిలేట్టులేదు. శ్రీధరం,సునందా వాళ్ల సరాగాల్లో అమృత సంగతే మరచిపోయారు. అంతలో...

అమృతకి రైలు దిగి నాలుగు పద్మాల్ని పెరుక్కు రావాలన్న బుద్ధి పుట్టింది. ఆ పువ్వులంత అందంగా వున్నాయి మరి, అమృత రైలు మెట్లు దిగి చెరువుఅంచుకు నడిచింది. ఈదులాడే అల్లరి పిల్లాడు– ఈదులాడుకుంటూ వచ్చి "పువ్వులు కావాలా" అని అడిగాడు.

"ఊఁ" అని నవ్వింది అమృత.

"నాలుగు చాలా" అని అడిగాడు కుర్రాడు.

అమృత మళ్ళా నవ్వింది.

కుర్రవాడు ఈదుకుంటూ పోయి– చెరువు లోపలగా వున్న పెద్ద పువ్వులు పెరుక్కువచ్చి అమృత కిచ్చాడు. మళ్ళా ఈదుకుంటూ వెళ్ళి అమృత వేలితో చూపెట్టిన పువ్వుల్ని పెరుక్కువచ్చాడు. ఆ సరదాలో రైలు బండి కూత వినలేదు వాళ్ళు.

రైలు కూత వెయ్యటం–కదిలిపోవటం రెండూ జరిగిపోయాయి. 'అయ్యయ్యో' అంటూ కుర్రాడే పరుగెత్తాడు–బండివెంట కేకలేస్తూ. అమృతా పరుగెత్తిందా రాళ్ళ




ల్లోనే కుంటుకుంటూ.
రైలు విన్పించుకోలేదు.
రైల్లోవాళ్ళూ వినిపించుకోలేదు.

రైలు కదిలినందుకుశ్రీధరం దంపతులు కూడా 'అమ్మయ్య' అనుకున్నారే గాని- తమ సరాగాల సందడిలో అమృతసంగతి గుర్తించలేదు. ఎక్స్‌ప్రెస్ ఆఘమేఘాల మీద పరుగెత్తికెళ్ళి భీమవరం టౌన్‌లో నిలిచేదాకా వారికా సంగతే గుర్తుకు రాలేదు. తీరా గుర్తించాక...

అమృత కోసం దంపతులిద్దరూ తమ పెట్టె అంతా కలియ వెదికారు. పక్క పెట్టెలో కూడా వెతికారు. ఏం లాభం? ప్రయాణం ఆపుకుని దంపతులిద్దరూ బండి దిగి పోయారు. ఏం చేయాలో తోచక, ఎవరేం చెబితే అది చేశారు. చివరికి స్టేషన్ మాష్టరుకి రిపోర్టుచేశారు. వెనకనున్న అన్నిస్టేషన్‌లకీ టెలిఫోన్‌లో చెప్పించారు. అప్పటికప్పుడు ఒక టాక్సీ మాట్లాడుకుని అన్ని స్టేషన్‌లూ చూసు కుంటూ వెళ్దామని వెనక్కి బయలుదేరారు.

ఈలోగా...విధి మరింత వక్రించింది.

అమృత అల్లాగే కుంటుకుంటూ కుర్రాడితో పాటు పై స్టేషన్ దాకా పరు గెత్తింది. అక్కడ తప్పకుండా రైలు ఆగుతుందనీ- నాన్నా అమ్మా చెప్పే రైలు ఆపుతారనీ—ఆ రైలు నడిపే డ్రైవర్‌కంటే- గార్డు కంటే కూడా నాన్న పెద్ద ఉద్యోగస్థుడనే ఆశపడిందమృత. కాని ఆ పై స్టేషన్ అంతా ఖాళీగా కనిపించే సరికి బిక్క పోయారిద్దరూ. "ఎల్లాగం"టే "ఎల్లాగ"ను కుంటూనే వున్నారు చాలా సేపు.

"పోనీ వెళ్ళి స్టేషన్ మాష్టరు గార్ని అడిగితే!!..." అన్నాడు కుర్రాడు.

వెళ్ళి ఆయన గది గుమ్మం ప్రక్కనే ఇద్దరూ నిలబడ్డారు. లోపల మాటలు స్పష్టంగా వినబడుతున్నాయ్.

"ఆ?ఆ?ఆరేళ్ళ ఆడపిల్లా? ఆ!-తెల్లని ఫ్రాకా? ఆహా!- మెళ్ళో బంగారుగొలుసూ చెవులకి లోలకులా!- సరే. అల్లాగే- కని పిస్తే ఇక్కడే వుంచేస్తాను. లేదా! పోలీసులకు అప్పగిస్తాను. అన్ని పోలీసు స్టేషన్‌లకీ చెప్తున్నారా?

"శుభం-ఓ-అల్లాగే - - -"

అంటూ,స్టేషన్‌మాష్టరు ఫోన్ పెట్టేస్తూ "రంగయ్యా రంగయ్యా" అంటూ బయటకు వచ్చాడు. రంగయ్య ఏం మునిగిపోయిందోననుకుని గబగబా పరు గెత్తు కొచ్చాడు. "ఎవరో ఆడపిల్ల! ఆరేళ్ళట! సర్కార్‌లోంచి దిగిపోయిందో! పడిపోయిందోట! ఎవరో పాపం అన్ని స్టేషన్‌లకీ ఫోన్ చేసున్నారు......"

ఇంకా చెపుతూనే వున్నాడాయన. అంతలోనే రంగయ్య-

"ఆడపిల్లాండీ!"అన్నాడుఆత్రుతగా.

"ఆ! ఆడపిల్లే!"

"ఆరేళ్ళా!"

ఆ! ఆరేళ్ళట? మెళ్ళో బంగారం గొలుసుట! చెవులకి లోలకులుట! తెల్లని గౌను వేసుకుని వుందట!"

"సరిగ్గా అల్లాంటి పిల్లా నూ- పిల్లాడూనూ ఇక్కడే- ఈ గోడ ప్రక్క నుంచుని వున్నారండీ-ఇందాక!!"

"ఆ. నిజంగానే!"

"ఆ నిజంగానే ..కాళ్ళకి తెల్లనిబూట్లు కూడా వున్నాయి.

"అయితే ఏరీ?"

"ఏరీ?"

"వెతుకు. వెతుకు. ఇక్కడే ఎక్కడో వుండి వుంటారు. వెతుకు-" వాళ్ళిద్దరూ-

# ఇది అబద్ధం కాదు...!

అసాధారణమైన అందం ఆమెది. ఆమె గదికి సరిగ్గా ఎదురింట్లో ఉండే వ్యక్తి డాక్టర్ మల్లిక్. అతని బెడ్ రూంలో ఈవిడ భర్త ఫొటో ఉంది. ఆ డాక్టర్ రోజూ ఆ ఫొటోకు ఓ పూలమాల వేసి పూజిస్తాడు. కానీ తాను రోజూ పూజించే ఆ వ్యక్తి భార్య ఎదురింట్లోనే ఉన్నా ఆ సౌందర్యరాసి కేసి కనీసం కన్నెత్తి చూడడు. వారి మధ్య అసలు మాటలే లేవు. ఏమిటి ఈ వింత ...?

ఫిబ్రవరి నెల 'విపుల'లో మహాస్వేతాదేవి బెంగాలీ కథ 'ఇది అబద్ధం కాదు' చదివి చూడండి.





మరీ నలుగురూ కలసి ఆ పరిసరాలన్నీ వెతికారు. కాని ఎవ్వరికీ పిల్లల ఆచూకీ కనపడలేదు.

"ఏమయి పుంటారబ్బా !"... రంగయ్య ఆలోచనలో పడ్డాడు.

అసలు సంగతేమిటంటే– అమృతా, అక్కురాడూ స్టేషన్‌మాష్టరుగారు ఫోన్‌లో మాట్లాడినదంతా విన్నారు. కొంత కొంత అర్థమయింది. కొంత కాలేదు. స్టేషన్ మాష్టర్‌గారి కళ్ళపడితే పోలీసులకి అప్ప చెబుతారని మాత్రం అర్థమయింది. దాంతో ఇద్దరి గుండెల్లోనూ రైళ్లు పరుగెత్తాయి. రైలు పట్టాల వెంట–పరుగెత్తారు–తర్వాత స్టేషన్‌కి.

అప్పుడికే చీకటి పడిపోతోంది.

"చీకటి పడిపోతోంది. ఇంకా ఇంటికి వెళ్ళకపోతే నాన్న చావబాత్తాడు. ఎట్లా? అన్నాడా కుర్రవాడు.

"మరినేనో!"

"నువ్వూ మాఇంటికిరా! అంతా మా

నాన్నతో చెబుదాం. మానాన్న మీనాన్నకి ఉత్తరం రాయిస్తాడు. అప్పుడు మీనాన్న వచ్చి తీసుకు వెళ్తాడు. ఏం?" అన్నాడా కుర్రాడు.

"సరే!" అంది అమృత ఆలోచించి ఆలోచించీ- పొంగి వస్తున్న ఏడుపు ఆపుకుంటూ.

ఇంకా సేపటికి ఇంకో రైలు వస్తుందిలే! రైళ్ళు అటూ ఇటూ కూడా తిరుగు తుంటాయి. ఇప్పుడు అటు నుంచి వచ్చాంగా-మనం? ఈ తడవ ఇటుపోయే రైలు ఎక్కితే సరి!

"అల్లాగే" అంటూనే గొల్లుమని ఏడుపు మొదలుపెట్టింది అమృత. "నువ్వేడవకు మరి! నువ్వేడిస్తే నాకూ ఏడుపు వస్తుంది". ఆస్టేషన్‌లో కూర్చునివుండగా మరి కాసేపటికే రైళ్ళు రెండు వచ్చి ఆగాయి. నిడదవోలు పోయే రైలు ఒకటి, నరసాపురం పోయే రైలుఒకటి.

అమృతా కుర్రావాడూ నిడదవోలు పోయే రైలు ఎక్కుదామనుకున్నారు మొదట. కాని రైల్వే పోలీసొకడు కని పించాడు. అమృతను గుర్తించాడేమో అమృత వంకే చూస్తూ అటే నడిచాడు కూడా.

పిల్లలిద్దరికీ గుండెలు ఝల్లుమన్నాయి- రైలు కింద నుంచి దూరి అవతలి వేపుకు వెళ్ళి వాణ్ణి తప్పించుకున్నారు.

నర్సాపురం వెళ్ళే రైలు అప్పుడే బయలుదేరింది. ఇద్దరూ అందులో ఎక్కేసి ఆపోలీసు బారి నుంచి తప్పించు కున్నారు.

మరి కాసేపటికి- నర్సాపురం చేరి, ఏం చేయటానికీ పాలుపోక కూర్చున్నారా కొత్త స్టేషన్‌లో.

* * *

శ్రీధరంసునందా కారులో బయలుదేరి ప్రతి రైల్వే స్టేషన్ దగ్గరా ఆగి- అడి గారు. ప్రతి పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు చేసి వివరాలిచ్చారు.

ఏస్టేషన్ లోనూ పిల్ల కనిపించిందనిగానీ, రైల్లోనుంచి పడి చచ్చిన పిల్ల శవం కని పించిందనిగానీ భోగట్టాలేదు. అదొక దిగు లైతే-ఇదొక సంతృప్తి. చివరికి అత్తిలి చేరారు. కనిపించినవాళ్ళందరికీ ఈసంగతి చెప్పారు. ఒక రైతు అంతా విని చివరకి అన్నాడు.

"ఎవరో అల్లాంటి పిల్లేనండీ-ఎంకయ్య కొడుకు రామిగాడితో చెరువు దగ్గర ఆడుతూ రైలు కట్ట ఎంట ఎళ్ళటం చూశానూ!" అన్నాడు.

దంపతులిద్దరికీ ప్రాణాలు లేచి వచ్చాయి.

"ఎవరా వెంకయ్య?"

"అదిగో ఆ చివరి ఇల్లు."

దంపతులిద్దరూ వెంకయ్య ఇంటికి దాదాపు పరుగెత్తారు. అప్పటికే వెంకయ్య నాలుగు రకాల వార్తలు వినివున్నాడు. అతని భార్య కుర్రాడి సావాసగాళ్ళనుంచి మరికొన్ని వార్తలు తీసుకువచ్చింది.

మొత్తంమీద ఆ పిల్లా, ఈ పిల్లవాడు కలిసివెళ్ళారు - రైలు కట్టవెంట. వేంద్ర స్టేషన్‌లో కనిపించి మాయమయ్యారు. ప్రమాదమేమీ జరగలేదు. తెల్లవారిన తర్వాత వస్తే రావచ్చు ఏదో ఒక రైల్లో!

వెంకయ్య చాలా బీదవాడు అయినా ఉన్నంతలోనే శ్రీధరం దంపతులకు ఆశ్రయం, ఆతిథ్యం యిచ్చాడు. ఏదో నలుగురూ తిన్నారన్న మాటేగాని, వండిన అన్నం గిన్నె మాత్రం కదలలేదు. నులక మంచాల మీద మేనువాల్చారన్న

మాటేగానీ కునుకు పట్టనేలేదు.

వెంకయ్య ఇల్లు చాలాచిన్నది. కొద్దిగా పిత్రార్జితం వుంది. కాని భుక్తికి చాలదు. అందుకని పైన దళారీ వ్యాపారం చేస్తుంటాడు. పెళ్లయి చాలా ఏళ్ళే అయినా పదేళ్లగ్గానీ ఈ కుర్రాడు పుట్టలేదు. శ్రీరామనవమినాడు పుట్టాడని శ్రీరాములు అని పేరుపెట్టారు. ఊళ్లో వాళ్లంతా రాముడూ అంటారు వాడిని. మళ్లా ఇంత వరకూ సంతానమేలేదు. రాముడికి అయిదో ఏడు వచ్చిన తర్వాత ఇంట్లో ఒంటరిగా ఆడుకొంటున్నాడని మరో పిల్లో పిల్లాడో పుడితే బాగుండునని చాలా రోజులు ఆ దంపతులిద్దరూ బాధపడ్డారు.

మరునాటికి కూడా రాముడూ,అమృతల అయిపు తెలియక పోయేసరికి ఎవరికీ కన్నీళ్లు ఆగలేదు. ఎవరిదుఃఖం వారేదిగ మింగుతూ ఒకరినొకరు ఓదార్చుకో సాగారు.

"పాపం మావాడివల్ల మీపిల్లా..." అంటూ మరి మాట్లాడలేక గుడ్ల నీరు కుక్కుకుంది వెంకయ్య భార్య.

"కాదు,కాదు. మాపిల్లవల్లే మీకీ కడుపుకోత" అంది సునంద. "కాదమ్మ కాదు. మా కొంటె వెధవే రైలు దిగమని రేపెట్టి వుంటాడు. పాపం కష్టం ఎరగని పిల్ల—ఎక్కడుందో! ఎక్కడ పడుకుందో! ఏం చేస్తున్నారో !"

"పర్వాలేదులే బెంగపడకండి! పిల్లలెక్కడున్నా ఇంటికి తెప్పించే ఏర్పాట్లు చేయిస్తాను. అన్ని పోలీసు స్టేషన్లకి రిపోర్టు పంపిస్తాను. అన్ని పేపర్లలోనూ వేయిస్తాను. తప్పకుండా పిల్లలిద్దరూ ఒకటి రెండు రోజుల్లో తిరిగివస్తారు" అంటూ అందరి ఆశల్నీ పెంచటానికి ప్రయత్నించాడు శ్రీధరం.

మరునాటి మధ్యాహ్నానికల్లా ఆశలు అల్లానే పెరిగి పెరిగి నేలకొరిగాయి. ఆ పల్లెటూళ్లో వుంటే లాభం లేదని, అవేళే విజయవాడకు బయల్దేరారు శ్రీధరం దంపతులు. అక్కడికెళ్లి పేపర్లో బహుమతులిస్తామంటూ ప్రకటన వేయించాలి, రేడియోలో చెప్పించాలి, పోలీసులకు అవసరమయితే రికమెండేషన్ చేయించాలి—అంటూ శ్రీధరం ఆదుర్దాపడుతుంటే ఏమీ చెయ్యలేని పరిస్థితిలో వెంకయ్య కళ్లనీళ్లతో "అంతా మీ దయ" అన్నాడు. అని ఘొల్లుమన్నాడు.

"వస్తాసమ్మా" అంది సునంద వెంకయ్య భార్యతో "అలాగే వెళ్లిరండి" అంది వెంకయ్య భార్య. సునందకింత కుంకం బొట్టు పెడుతూ కన్నీళ్లు పెట్టుకుంది. ఇంట్లో అల్లరిచేస్తూ ఎక్కడన్నా దాక్కున్నట్లే అమృత ఎక్కడన్నా ఈ ఊళ్లోనే దాక్కుందేమో, అకస్మాత్తుగా కనబడుతుందేమోనని దిక్కులన్నీ పరకాయిస్తూ వెళ్లి కారెక్కింది సునంద. వెంకయ్య ఆపగలూ రాత్రీ పెళ్లాన్ని చూడలేకా, కళ్లనీళ్లాపుకోలేకా మోకాళ్లమధ్య తల పెట్టుకు కూర్చుండిపోయాడు.




అమృతా, రామిగాడూ సర్పాపురంలో దిగి ప్లాట్‌ఫారం మీదనే ఓ బెంచీమీద

కూర్చున్నారు గంటసేపు. తర్వాత ఆ వేళకి వెనక్కి ఏ బండీ లేదు.

రాత్రికి ఊరంతా తిరిగి తిరిగీ, ఇద్దరూ గోదావరి ఒడ్డుకు చేరారు. అక్కడ నది పక్కనే చిన్న గుడి వుంది. దాన్లో దేముడున్నాడుగానీ–గుళ్ళో దీపం లేదు. గుడి చుట్టూ విశాలంగా అరుగు వుంది. చక్కగా నాపరాళ్ళున్నాయి. "ఫర్వాలేదు రాత్రికిక్కడ పడుకోవచ్చు" అన్నాడు రామిగాడు.

"ఇక్కడా! అమ్మో" అంది అమృత.

"మరేం భయం లేదులే!"

"భయం కాదులే. మరి పక్క ఏదీ?"

"పక్కలు కావాలంటే ఇక్కడ ఎక్కణ్ణించి వస్తాయి!"

"రావా ?"

"రావు".

"మరి అన్నమో ?"

"ఏం ఆకలేస్తోందా?"

కళ్ళ నీళ్ళతో తల వూపింది. అమ త.

"నాకూ ఆకలిగానే వుంది ...కాని ఎట్లా?"

ఎల్లాగో ఇద్దరికీ తెలియదు.

"వెళ్ళి మంచినీళ్ళు తాగు – నదిలో ! ఏం?"

ఇద్దరూ వెళ్ళి కడుపునిండా నదిలో నీళ్ళ తాగారు.

రాముడికి రైలెక్కి ఇంటికి వెళదామనే వుంది,మనసులో! కాని ఇంత ఆలస్యంగా ఇంటికెళితే..అమ్మ తిడుతుందేమో! పైగా



ఈ అమ్మాయిని కూడా తీసికెళ్ళినందుకు నాన్న కొడతాడేమో ?

"నువ్వు భయపడకు. ఏడవకుండా వుండు. మనం ఇద్దరం అన్ని ఊళ్ళూ తిరుగుదాం. ఏదో ఒక ఊళ్ళో మీ అమ్మా నాన్నా కనిపించరా? నువ్వు వాళ్ళ దగ్గర కెళ్ళిపోదువుగాని...తర్వాత నేను – మా ఊరెళ్ళిపోతా ఏం ?" అన్నాడు రామిగాడు.

"అల్లాగే" నంది అమృత. రాముడి కింతవరకూ తెలిసిందల్లా ఒక్క అత్తిలి మాత్రమే. దగ్గరె వున్న తణుకు కూడా ఒక్కసారే వెళ్ళాడు. భీమవరం, నర్సాపురం పేర్లు విన్నాడు. ఏదో నాలుగు అయిదు ఊళ్ళు వెతికితే చాలనుకున్నాడు. ప్రపంచం ఎంత పెద్దదో ఆ పసి మనసుకు తెలియదు. కాసేపటికి ఆకలి తగ్గిపోయిందేమో ! నడిచి నడిచీ ఇద్దరూ పూర్తిగా అలిసిపోయారేమో ! బాగా నిద్రపోయారు. తెల్లవారి ఎండవేడికి గాని మెలకువ రాలేదు.

మెలకువ వచ్చేసరికి – ఎదురుగా పెద్ద పడవ కనిపించింది. దాన్నిండా అరటిపళ్ళ గెలలు ఎత్తుతున్నారు. ఎవరన్నా రెండో మూడో అరటిపళ్ళు ఇస్తే బాగుండును. కాని వీళ్ళిద్దర్నీ ఎవ్వరూ పట్టించుకోలేదు.

అమృత ఇహ ఓపికలేక లేచినెమ్మదిగా వెళ్ళింది. ఎవ్వరూ చూడకుండా ఆ పడవలో ఎక్కి రామిగాణ్ణి కూడా రమ్మని సైగ చేసింది. కాసేపటికి ఇద్దరూ ఆ అరటి గెలల మధ్యగా నక్కి ఉలక్కుండా పలక్కుండా–ఒక్కొక్క అరటి పండే ఒలుచుకునితింటూ కూర్చున్నారు.





ఈలోగా పడవ బయలుదేరింది. భయం భయంగానే ఇద్దరూ పడవలో కూర్చున్నారు.

"ఎవరన్నా చూస్తారేమో! పట్టుకుంటారేమో! అరటిపళ్లు తిన్నందుకు కొడతారేమో..."

"తినెయ్యి పర్వాలేదు. అంతగా కొడితే కొడతారులే ..." అంటూ గుసగుసలాడాడు రామిగాడు.

ఎవ్వరూ చూడలేదు. పట్టుకు కొట్టనూ లేదు.

పడవనడిపే సరంగు మాత్రం–గడ వేస్తూ తిరుగుతూ వీరికి కనిపిస్తున్నాడు.

వాడు చాలా లావుపాటి మనిషి. పెద్ద బొజ్జ! పెద్ద మీసాలు విశాలమైన వీపూ! వాణ్ణి చూస్తూనే నవ్వు వచ్చింది. అమృతకు. ఆ నవ్వులో భయాన్నీ బెంగనీ కూడా మరచిపోయారిద్దరూ... చెయ్యరాని పని చేసిందంతలో అమృత.

చేతికందిన అరటిపండు తుంపి తీసి మెత్తగా పిసికి ముద్ద చేసింది. దాన్ని చేతికొద్దీ విసిరేసిందాతని వీపు మీదకి.

అది వెళ్ళి చక్కగా పడవ వాడి వీపుకు అంటుకుంది.

అమృతకి రామిగాడికీ కూడా ఒకటేనవ్వు.

ఆ పడవ వాడికి ఒకటే ఆశ్చర్యం ! చుట్టూ కలియచూశాడు ఎవ్వరూ కనపడ లేదు.

పడవలో అంతా కలిపి వున్నది ముగ్గురే మరి! ఏదో లెమ్మని వూరుకున్నాడప్పటికి. కాని రెండవ తడవా మూడవ తడవా నాలుగో తడవా అమృత విసురుతూనే వుంది అలా. అవి ఆ వీపుకి తగులుతూనే ఉన్నాయి– గురి కాస్తన్నా తప్పకుండా. పడవవాడు మొదట ఏదో లెమ్మనుకున్నాడు తర్వాత దయ్యం కాదుగదా అనుకున్నాడు. అను

కాని "ఇదేదో తేల్చుకోవాలనుకున్నాడు.
పడవంతా వెతికి-ఇద్దరి పిల్లల్నీ చూసి మొదట-! దయ్యాలే అనుకున్నాడు. తర్వాత మామూలు పిల్లల్లాగే వున్నారుగా !" అనుకున్నాడు. 'ఎవరు మీరని' గద్దించాడు.

అన్నింటికి జవాబు బిక్కమొహం !-బిత్తర చూపులూ ! బుంగమూతి.

పడవ వాళ్ళందరికి ఈ పిల్లల్ని ఏం చెయ్యాలన్న సమస్య మిగిలిపోయింది. ఏమీ చెప్పకపోతే ఎవరేం చేస్తారు.. సఖినేటి పల్లిలో దింపేశారు.

ఊరంతా తిరుగుతుండగా ఒక చిన్న పాకలో హోటల్ కనిపించింది. అక్కడ మంచి నీళ్ళడిగి తాగుతుండగా... రేడియో ప్రకటనలు వినిపించాయి.

"ఆరేళ్ళ బాలిక...అమృతని పేరు. భీమవరంలో కనపడవచ్చు. ఈ బాలిక ఆచూకీ తెలిసిన వారు విశాఖపట్నం మార్వాడీ వీధి నెం 10 కి తెలియజేయగలరు. ఆచూకి తెలిపిన వారికి వెయ్యి రూ॥ బహుమతి కూడా యివ్వబడును."

"అమృతంటే నువ్వేగా!''

''నేనా!''

''రేడియోలో కూడా చెప్తున్నారు." భయం భయంగా అన్నాడు రామిగాడు.

ఇక అప్పట్నించి ఎక్కడ చూసినా పోలీసులే కనిపించసాగారు. చివరికో పోలీసు చూడనే చూశాడు. వెంటబడనే పడ్డాడు. వాణ్నించి తప్పుకు పోవటానికి మరో మార్గం లేక, బయలు దేరబోతున్న బస్సులోకి ఎక్కేశారు.

ఆ ప్రయివేటు బస్సునిండా జనం కిక్కిరిసి వున్నారు. కండక్టరు అందరికీ టిక్కెట్లు అడుగుతూ వచ్చేసరికి అరగంటయింది. ఏమయితే అయిందని ఇద్దరూ అందరితోబాటు నుంచుంటే...

ఎదురుగా కూర్చున్నాయన పేపరు చదువుతున్నాడు.

ఆ పేపరు వెనక పేజీలో అమృత ఫోటో వుంది.

అమృత రహస్యంగా సైగలతో రాముడికా ఫోటో చూపించింది. 'నేనే' అని సైగ చేసింది. మూగభాషలో కళ్ళు మాట్లాడుతున్నాయి.

''ఏం చేద్దాం?''

"దిగిపోదాం"

"ఎట్లా''? బస్సు పరుగిడుతోంది. గుండెల్లో రైళ్ళు పరుగిడుతున్నాయి.

కండక్టర్ అందర్నీ అడుగుతూ-దెబ్బలాడుతూ-ఒక్కొక్కరికే టిక్కెట్లు అమ్ముతూ వస్తున్నాడు.

"ఎల్లా!".. "ఎల్లా!!" "ఎల్లా..!!!"

అదృష్టం కొద్దీ- ఏదో వూళ్ళో బస్సు ఆగింది. ఇద్దరూ తలలూపుకున్నారు. బస్సు దిగిపోయారు.

ఆ రాత్రి అక్కడే వున్నారు.

''ఇక్కడ బాగానే ఉంది కదూ-ఆ సది ఒడ్డున కంటే?"

"ఏం బాగో ! నాకు నేల మీద నిద్ర పట్టదు."

కాసేపాగి మళ్ళీ అమృతే అడిగింది.

"నీకు ఆకలపటం లేదూ ?"

"లేదు...మరీనీకూ- ?"

"అవుతోంది."

''అవుతుంది- ఎప్పుడో అరటిపళ్ళు తిన్నాం-అంతేగా? పడుకో ఇల్లాగే! రేపు డబ్బులు ఎల్లాగన్నా సంపాదిద్దాం. ఏం?"

''డబ్బులున్నాయి నా దగ్గర."

"ఆ !ఎల్లాగొచ్చాయ్!"

''బస్సులో పక్కనున్న వాడి బొడ్లో

కనిపించాయి. లాగేశాను."

"ఎల్లాగా?"

"ఇల్లాగ" అంటూ నవ్వుతూ బొడ్లోంచి సంచీ బైటకి లాగింది అమృత.

"దొంగతనం చేశావా!"

బిక్క మొహం పెట్టింది అమృత.

"ఎవరన్నా పట్టుకుంటే !"

"దిగిపోయాం గా! ఎట్లా పట్టు కుంటారూ ?" కాసేపాగి అడిగింది అమృత.

"పట్టుకుంటే-కొడతారా ?"

"మరి కొట్టరూ?"

"ఆ, అదేం లాభం లేదు. వాళ్ళు కొట్టి పదిలెయ్యకుండా తీసికెళ్ళి పోలీసులకి అప్పచెప్పుతారు. తణుకులో ఒకసారి చూశాను. ఇల్లా జేబులు కొట్టిన వాణ్ణి కణ్ణి పట్టుకుని, పదిమంది తన్నుకుంటూ పోలీసుల దగ్గరకి తీసుకెళ్ళారు"

"మా నాన్నగార్ని చూస్తే పోలీసులకి భయమే!" అందమృత ఏదేదో జ్ఞాపకం చేసుకుంటూ.

ఆ పూట కిద్దరూ వెళ్ళి ఓ మిఠాయి కొట్టుదగ్గరేవేవో కొనుక్కు తిన్నారు. మంచినీళ్ళు బాగా తాగి ఆ బస్సుస్టాండ్ పాకలోనే పడుకుని నిద్రపోయారు.

"మా అమ్మ ఎంత కావాలన్నా ఇస్తుంది. ! వాళ్ళకి కావాలంటే ఇంటి కెళ్ళిన తర్వాత అమ్మనీ, నాన్నగార్నీ అడిగి తీసుకుని ఇచ్చేద్దాం."

మర్నాడు నిద్ర లేచేసరికి ఎదురుగా ఇద్దరు! ఒకడి చేతిలో పేపరుంది. ఆ

పేపరులో 'అమృత' ఫొటో వుంది. దాన్నీ, అమృతనీ చూస్తున్నాడా రౌడీ. అమృత మెడ వంకే, అక్కడున్న బంగారపు గొలుసువంకే చూస్తున్నాడు రెండోవాడు. వాళ్ళనీ, వాళ్ళచూపుల్నీ చూసేసరికి— పిల్లలిద్దరికి గాభరా పుట్టింది. మరో నిముషంలో ఎగిరిపడి లేచి పరుగు తీసారిద్దరూ.

ఆ రౌడీలు వదలలేదు. వెంటబడ్డారు. దారిలో దొమ్మరి ఆట జరుగుతుంటే అక్కడి జనంలో కలిసిపోయారు. కానీ, రౌడీలు వదలలేదు. ఆటంతా అయిపోయినా ఆ దొమ్మరి వాళ్ళను రాముడు. అమృతా వదల్లేదు. వాళ్ళతోనే వెళ్ళి మరో చోట మరో ఆట దగ్గర కూర్చున్నారు. అప్పుడుగానీ రౌడీలు వదలి వెళ్ళలేదు.

ఆ దొమ్మరాట పెద్ద శోభనాద్రి— పిల్లలిద్దర్నీ ఆ సాయంకాలం చూశాడు. వెంటబడివుంటుంటే ఎవరో లెమ్మను కున్నాడు. రాముడి చేత మధ్యలో బీడీలు తెప్పించుకున్నాడు. ఇద్దరు పిల్లలూ అక్కడున్న దొమ్మరి పిల్లలతో కాస్త స్నేహమూ చేశారు. వాళ్ళు తిరుగుతున్న ఊళ్ళు ఇన్నీ అన్నీ కావని తెలుసుకున్నారు. "వీళ్ళతోనే అన్ని ఊళ్ళు వెళ్దాం. మీ నాన్నా వాళ్ళూ ఏ ఊళ్ళో సన్నా కనబడితే అక్కడ నువ్వు ఆగిపోదువుగాని ఏం" అన్నాడు రామిగాడు అమృతతో.

"ఈలోగా అన్నమో!''

"అదే చిక్కు."

"దొంగతనం చేద్దామా?"

"వద్దొద్దు. ఆ పని చెయ్యకు. చేశావా నీకూ నాకూ ఇరోధమే. జాగర్త!''

"పోనీ ఈ గొలుసు అమ్మేస్తే! డబ్బొస్తుందిగా.!''

''వస్తుంది. కానీ వద్దు. మీ నాన్న గారు కనబడగానే గొలుసేది అని అడుగుతారు. అప్పుడు ఆయనగారికివ్వద్దూ? కనుక ముందు దాన్ని ఓ పొట్లంకట్టెయ్యి. ఎవరికీ కనబడకుండా గుడ్డ పేలికతో నడుముక్కట్టుకో. ఏ రౌడీలయినా వెంటబడినా కనబడకుండా ఉంటుంది. ఏం!"

అల్లాగే చేసింది అమృత. 'ఆపూట తిండి ఎల్లాగ' అనే ఆలోచన ఆరంభమయింది అప్పట్నించీ.

తిండి కావాలంటే డబ్బు సంపాదించాలి. అంటే ఏదో ఒక పని చెయ్యాలి.

రాముడికీ తనకి వచ్చిన పనేదో తోచనే లేదు. చివరికి ఇద్దరూ మళ్ళా దొమ్మరాట దగ్గరే చేరారు. అక్కడే ఓ కొత్త ఆలోచన తట్టింది రాముడికి.

"ఈ దొమ్మరాటే మనమూ ఆడితే!''

''నీకొచ్చా?"

''రాదు కానీ... పాటలు పాడ్తాను. మా ఊళ్ళో నా పాటలు విని చాలా మంది మళ్ళా పాడమంటారు."

''మరీ, హార్మనీ, మద్దెలా...అవీ ?"

''లేవు! పద పోదాం, చెప్తాగా"

ఇద్దరూ కలిసి వీధులు గాలించగా ఓ పెద్ద పాత డబ్బా దొరికింది. ఇక కావల్సిందల్లా రెండు కర్ర ముక్కలే. అవి దొరగ్గానే ఇద్దరూ వచ్చి ఆ దొమ్మరాట పక్కనే మకాం పెట్టారు. డబ్బా వాయించటం మొదలు పెట్టారు. పది మందీ చేరారు. రామిగాడి పాటా, చేతగాని అమృత డబ్బా వాయింపూ ఈ రెండిటికంటే రామిగాడి కోతి చేష్టలూ చాలామందినిఆకర్షించింది. కొంత సేపటికి దొమ్మరాట దగ్గరి జనం కూడా ఇటు మళ్ళారు.




దొమ్మరాట లాంటి ఆశ్చర్యకరమైన మొగ్గలు లేవు పీళ్ళాటలో. కాని దొమ్మరాట పలుమార్లు అందరూ చూసిందే. ఈ చిన్న పిల్ల బొమ్మలాట అది వరకు ఎరగరు. చాలా మందే గుమిగూడారు. చాలా మందున్నారని మరి కొందరు గుంపు గూడారు. గుంపులో పడినవారు మరిక కదల్లేదు.

రామిగాడి కోతి చేష్టలు కొందరికి నవ్వు పుట్టిస్తున్నాయి. అమృత రూపు రేఖలు కొందరి చూపుల్నికట్టుకొంటున్నాయి.

రామిగాడు చొక్కా విప్పి కింద పరిస్తే- పది పైసలు, అయిదు పైసలు... మొత్తం మీద మూడు నాలుగు రూపాయలొచ్చాయి.

ఆ పూటకిద్దరూ తిండి తినగా ఓ రూపాయి మిగిలింది. దాంతో ఇద్దరికీచిన్న ఘర్షణా బయలు దేరింది. సబ్బు కొందామంటుంది అమృత – కాదు చొక్కా పరవకుండా, ఓ చిన్న ప్లాస్టిక్ పళ్ళెం కొందామంటాడు రాముడు.

ఆ సాయంత్రం మరోచోట ప్రదర్శన. మరో మూడు రూపాయలొచ్చాయి. ఇదీ బాగానే వుందనుకున్నారు.

అన్నిటికంటే ముందొక కంజీరా కొన్నాడు రాముడు. దాన్ని వాయిస్తూ పాటలు పాడుతూంటే చిన్న పిల్ల అమృత డాన్సులా చేతులు తిప్పుతోంది.

పది పైసలు ... పావలా ... అర్ధ రూపాయి.

ఆ దొమ్మరాట వాడికన్నా అంత మాత్రంవస్తుందో ! రాదో ! త్వరలోనే వాడికి వీళ్ళొకరకం పోటీ దారులైపోయారు.

ఓ రోజు వెతుక్కుంటూ వచ్చి మచ్చిక చేసుకున్నాడు ఆ దొమ్మరాడు. మీరిద్దరూ నాతోనే ఉండరాదా. తిండి తిప్పలూ అన్నీ నేనే చూస్తాను. పైన నా విద్యలన్నీ నేర్పుతానన్నాడు"."

ఆ దొమ్మరాటపెద్ద శోభనాద్రి దగ్గర ఇద్దరు ముగ్గురు కుర్రాళ్ళున్నారు. వాళ్ళు అన్ని రకాల మొగ్గలూ వేస్తారు. పాటలు పాడతారు. కాని వాళ్ళ ముఠాలో ఆడ పిల్ల లేదు. కొన్ని మొగ్గలు ఆడపిల్లలు చేస్తుంటేనే అందం- ఎక్కువ జాలి- ఎక్కువ డబ్బు.

ముఖ్యంగా పొడుగాటి గడ కొసమీద, అడ్డంగా ఆడపిల్లని పడుకో పెట్టి పైకి ఆకాశంలోకి ఎత్తి- తన భుజం మీద నిలబెట్టి- అంత ఎత్తు నుండి వదిలేసి- ఆ ఆడపిల్లను చేతుల్తో పట్టు కోవడం...

మొదట్లో భయం వేసినా తర్వాత ధైర్యం కుదిరింది. అన్నీ నేర్చుకుంది అమృత. అమృతతోనే రాముడూను. నాలుగయిదునెలల్లో మొగ్గలన్నీ వచ్చేశాయి ఇద్దరికీ. మొగ్గల్తోపాటు రామిగాడివల్ల కొంత హాస్యం మిళితమౌతోంది ప్రదర్శనల్లో. క్రమంగా రామిగాడు దొమ్మరివాళ్ళల్లో 'రామూ' అయ్యాడు. అమృత 'అమ్మూ' అన్న అందమైన పిల్ల అయింది.




గోదావరి ఆప్యాయంగా పెంచుకున్న ప్రదేశం కోనసీమ. ఎక్కడ చూసినా

కొబ్బరిచెట్లూ, చవులూరించే జామచెట్లూ, మధురసాల నందించే మామిడిచెట్లూ నేలతల్లి పమిట చెంగులాగ పరచుకున్న వరిపొలాలూనూ.

కోనసీమ కడ్డంగా పయనించి శోభనాద్రి తన బృందంతో అమలాపురం చేరాడు. అక్కడ మూడురోజులున్నారు. సాధారణంగా పూటకు రెండుచోట్ల ప్రదర్శనలుంటాయి. ప్రదర్శనలోనే అమృతకీ, రాముడికీ అభ్యాసం; తక్కినస



కాలంలో అంతా విశ్రాంతే.

విశ్రాంతి కాలంలోనే రాముడూ, అమృతా తప్పించుకుపోయి ఊరంతా తిరిగేవారు. ఎక్కడన్నా తల్లిదండ్రులు కనిపిస్తారేమోనని లోపల ఆశ. నెలలు గడుస్తున్నా ఆశ ఇద్దరికీ ఆగిపోలేదు.

తల్లిదండ్రులు కనబడకపోయినా దేశంలో ఉన్న రకరకాల మనుషులు కనిపించారు. మూడుముక్కలాటగాళ్ళు, నవ్వారు ఆటగాళ్ళు, నకిలీ బంగారం అమ్మేవాళ్ళు, దొంగవాచీలు అంటగట్టే వాళ్ళు! పొట్టకోసం ఎన్నెన్ని తిప్పలో, ఎన్నెన్ని మోసాలో!

అటువంటి వాళ్ళెవరు కనబడినా అక్కణ్ణించి కదిలేదికాదమృత. అంతా పూర్తిగా గమనించేది. వాడి కిటుకేదో చటుక్కున పట్టేసేది. నిజానికి అది రాముడికే తలవంపులుగా ఉండేది.

"పద పోదాం" అంటూ నసపెట్టే వాడు వెసకజేరి.



"ఆగు వెళ్దాం" అంటూ లక్ష్య పెట్టేది కాదు అమృత.

ఒక్కొక్కప్పుడు అలిగి తను నడిచి ముందుకు వెళ్ళిపోయేవాడు రాముడు. అప్పుడు కదిలేది అమృత.

ఆ ముఠాలో ఎవ్వరూ వారాల లెక్కలనూ, నెలల లెక్కలనూ పట్టించుకోరు. తెల్లారిందా లేదా, పొద్దెక్కిందా లేదా! అంతవరకే కావాలి. అమలాపురం గుడిదగ్గర ఎంతసొమ్ము వచ్చిందీ-కాలప గట్టున నిద్రగన్నేరు చెట్టుకింద ఎంత సొమ్మొచ్చిందీ-అదే కావాలి శోభనాద్రికి.

ఓ రోజున అమృత మూడుముక్కలాట దగ్గర కూర్చుని ఆటనే చూస్తోంది. ఎవరో పల్లెటూరి కుర్రాడు-ఇరవైయ్యేళ్ళుంటాయి-మరీ ఆశపోతేమో రెండొందలు పోగొట్టుకున్నాడు. మోసం జరుగుతోందని అప్పటిగ్గాని తెలియలేదు తెలిసి పేచీ పెట్టాడు. వెంటనే ఎవరెవరో చుట్టూ చేరారు. నలుగురూ మోసగాళ్ళ పక్షమే మాట్లాడారు. చాలమంది ఆ పరిస్థితుల్లోనే నోరు మూసుకు జారుకుంటారు. కాని ఈ కుర్రాడు రెండు వందలూ ఏదో కొనుక్కోవాలని తెచ్చుకున్నాట్ట! ఒకటే ఏడుపు!...ఒకటే దెబ్బలాట!

ఏంచేసినా ఆటగాళ్ళు వదిలిపెట్టలేదు. పైగా కొట్లాటదాకా పోయింది. ఇక దెబ్బలు కూడా తినటం అదొక అప్రతిష్ఠని ఆ కుర్రాడెళ్ళిపోయాడు.

ఆరాత్రి ముఠా అంతా నిద్రపోతుంటే పేక తీసుకుని అమృత - ఒంటరిగా ఆ ఆటే ఆడనారంభించింది. ఆ ఆట చాలసార్లు చూశాడు రాముడు. ఏదో సరదా-అదొక కాలక్షేపం అనుకుని మిన్నకున్నాడు.

అందరూ ఆట సందడిలో వుండగా అమృత ఎటుతిరిగినా ఎవరూ పట్టించుకునేవారుగాదు. చిన్నపిల్ల - అందమైన పిల్ల-చక్కని డ్రెస్సు...ఆటమధ్యలో పాటలకి ఏదో పచ్చిరానీ డాన్సు చేస్తుండేది. ఆ ప్రేక్షకులకదేచాలు. సినిమాల్లో గూడా ఇంతేకదా అనుకుని సంతోషించేవారు. అమృతకి చివరికొక ప్రమాదకరమైన గడమొగ్గ ఉండేది. అది తప్పితే, ప్రదర్శన కాలమంతా అటూ ఇటూ తిరగటమే. ప్రేక్షకులలో కెళ్ళి వాళ్ళతో కలిసిపోవటమే! వెనగ్గానుంచుని రోజుకొక జేబు కొట్టెయ్యటమే!

ఇది తెలిసి రాముా మండిపడ్డాడు. ఇల్లా అయితే ఎప్పుడో ఎవరో పట్టుకుని కాళ్ళూ, చేతులూ విరగ్గొడతారన్నాడు. ఈ పనులు చేస్తే శోభనాద్రే గెంటేస్తాడన్నాడు. ఇక ఆ తర్వాత ఇద్దరం అడుక్కు తినాల్సిందే అన్నాడు. దేనికీ జవాబు చెప్పలేదు అమృత. అన్నిటికీ ఒకే జవాబు. ఒక బుంగమూతి, బిత్తర చూపులు! ఏడుపులేని ఎక్కుబెక్కులు, నోట్లో నములుతున్న బటానీలు.

ఎంత కోపంవచ్చినా, అమృత బుంగ మూతిచూస్తుంటే రాముడికెక్కడ లేని ముద్దూ వచ్చేది. కానీ... అతి తొందరలోనే తెలిసిపోయింది జేబు దొంగతనంలో అమృత అతి చాకచక్యం సంపాదించేసిందనీ, వీలు దొరికితే ఆ చెయ్యి ఊరుకోదనీను. అదొక దుర్గుణం. రెండో దుర్గుణం విశాలమైన వీపు కనబడితే-ఏదో ఒకటి వేసి వీపుమోత మోగించటం

ఆటజరుగుతుంటే దూరంగానుంచుంటుం దమృత. విశాలంగా వీపు కనిపిస్తేచాలు. ఏది దొరికితేఅది. ఆఖరికి ఇంతమట్టో,




పేడో, అరటిపండు తొక్కో—ఏదోఒకటి ఆదిపుచ్చుకుని కొట్టాల్సిందే— వాడెవడి తోహో దెబ్బలాట రావాల్సిందే. రాముడు క్షమార్పణలు చెప్పుకోవల్సిందే ! వాడి చొక్కా ఉతికి ఇవ్వాల్సిందే ! అమలాపు రంలోనే ఇది మొదలయింది.కాకినాడలోనూ అదేవిధంగా నడిచింది.

కాకినాడ ముంతావారి సెంటర్లో గారడీ జరుగుతోంది. రాముడు కోతివేషాలకి పాటలకీ వికృతంగా వేస్తేమొగ్గల్లో వున్న గమ్మత్తుకి అందరూ పగలబడి నవ్వు తున్నారు. శోభన్నాదికూడా మంచి హుషారుగా బూతుపాటలు మొదలెట్టాడు. శోభన్నాది ఎప్పుడూ బూతుపాటలే పాడు తాడు. పూర్వం గ్రామఫోను రికార్డులు పాడేవాడు. ఈమధ్య సినిమాపాటలుపాడు తున్నాడు. ప్రజానీకానికి అవంటేనే ఇష్టం అని శోభన్నాది కనిపెట్టాడు. అటువంటి పాటే— అందులో వున్నబూతు అర్థం విడమర్చి పాడుతుంటే ప్రేక్షకులందరూ ఆరక్తి అనుభవిస్తున్నారు.....అట్లాంటి సమయంలో ఇంత పేడముద్ద నేరుగా వెళ్ళి ఒకడి వీపుమీద తగిలింది. అంతా గోల గోల. ఏమీ ఎరగనట్లే అమృత అటూ ఇటూ తిరుగుతూ ఉంది. అంతలోనే మరొకడు పర్సు పోయిందని గోల! సరిగా ఆట అంతా అయిపోవచ్చే సమయం అది. దాంతో దమ్మిడీ కూడా వెయ్యకుండా ఉడాయించారు, ఎవరికివారు.

ఆరోజు అందరికీ పస్తే. వచ్చిన డబ్బులేవో శోభన్నాది తాగటానికే సరిపో యింది. తక్కిన వాళ్ళు సింగన్నా, ఫకీరూ, రాముడూ అందరూ పడుకున్నారు ఒక్క— అమృతతప్ప. అమృతనిద్రపోలేదు. నిద్ర పోయినట్లు నటించింది. అంతానిద్రపోయిన తర్వాత, రెండో ఆట సినిమావదుల్తారనగా నెమ్మదిగా రాముణ్ణి తట్టిలేపింది.

"రాముడూ... రాముడూ"

"ఊఁ"

"కడుపులో ఎండకాస్తోంది".

"అంటే?... ఆకలా ?"

డబ్బుల్లేవు. మంచినీళ్ళుతాగిపడుకో.".

"తాగాను. కాని... ఎండ ఊరుకోటం లేదు".

"కాళ్ళు బిగదియ్యి. బాగా పొట్టలోకి నొక్కుకుని పడుకో".

"రాముడూ ?"

"'ఊహు''.

"కడుపులో వేసంకాలంలాగా ఆగటం లేదు".

"అయితే ఏం చేద్దాం."

"అల్లా సినిమా హాల్దాకా వెళ్ళి..."

"వెళ్ళి...? డబ్బుల్లేవుగా !"

"నా దగ్గరున్నాయ్".

"ఆ! ఎక్కడివీ ?"

"పద— చెప్తా".

ఇద్దరూ సినిమా హాలు దగ్గరకి సగం దూరం వెళ్ళారు.

"ఏవీ డబ్బులు?"

"ఇదుగో!" అమృత పావలా బొడ్లోంచి తీసి బయట పెట్టింది.

''దొంగతనం చేసిందేనా"

"ఊఁ"

చేత్తో పుచ్చుకుని ఆ పావలా విసిరి పారేద్దామనే అనుకున్నాడు రాముడు. చెయ్యి ఎత్తాడు గూడా కానీ ఆగాడు. తీరాపారేస్తే ఆకలెలా తీరుతుంది.

సరాసరి ఇద్దరూ సినిమాహాలు దగ్గరో కొట్టుకెళ్ళారు. అక్కడప్పుడు మిగిలి పోయిన సరుకేదో ఉంది. కొట్టువాడు మొత్తం సరకు— పావలాకే యిచ్చాడు

ఇకనెట్లాగూ పారేసేవేగా అని. వాటిని తెచ్చుకుని వంతెన మీద కూర్చుని, ఇద్దరూ తిన్నారు. తింటూ చెప్పాడు రాముడు.

"ఇదిగో అమ్మా! నువ్వు దొంగతనాలు మానెయ్యాలి"

"మానేస్తే ఇవ్వాళ ఇవి ఉండేవి కావుగా."

"లేకపోతే పసుండేవాళ్ళం. అదీ కాకపోతే ఎళ్ళి హోటేలు దగ్గర ఎంగిలాకులు ఏరుకు తినేవాళ్ళం. నా మాట విను. ఇక రోజూ నేను సంపాయిస్తాను. చీకటిపడంగానే ఆట అయిపోతుందిగా! అప్పుడే ఎళ్ళి సినిమాహాల్లో సోడాలమ్ముతా- లేదా ఏదో ఒకటి చేస్తా. పైసడబ్బులుండాయి. పస్తులుండకుండా దాన్తో తినొచ్చు. రేపు మీ నాన్న దగ్గరకెళ్ళినా కూడా, ఈ దొంగతనాలు చేస్తూనే వుంటావా? అదృష్టం కొద్దీ ఎక్కడా దొరికిపోలేదు. చావు దెబ్బలు తినలేదు. జాగర్త"



"నిజమే! వద్దనే అనుకుంటా కాని నేనొద్దనుకున్నా ఈ చేతులూరుకోటంలే! జేబు చేతికి తగిలే చాలు; వద్దు వద్దనుకుం టూనే జేబులో డబ్బులు తీసేస్తానేమిటో"

"అదే వద్దంటున్నది కావాలంటే రేపు నీ చేతికి ఓ కట్టుకట్టేస్తా సరేనా ?"

"సరే...కట్టెయ్యి."

ఇద్దరూ ఇంటికి బయలుదేరారు. జోడుగా నడుస్తున్నారు.

వెన్నెల్లో సిమెంటు రోడ్డు మీద నడక జోరుగా సాగింది. అంతలో ఏదో రాముడి లాగూ జేబుకి తగిలింది. ఏమిటా అని వెంటనే చూసుకుంటే అమృత చెయ్యి జేబులో సగం దూరి సగం బయటకు వచ్చి ఉంది. ఆ చెయ్యి పట్టుకు కోపంగా చూశాడు రాముడు.

అమృత బావురుమని ఏడుస్తూ నుంచుంది.

రాముడికా ఏడుపు చూసినా వచ్చిన కోపం తగ్గలేదు. పైగా పెరిగి పోయింది వళ్ళు తెలియని కోపం! అయినా ఏమీ చెయ్యలేకరోడ్డువెంట సరాసరేనడిచేశాడు. నడిచినడిచి కాలువ గట్టున ఆంజనేయ స్వామి కెదురుగా నిలిచాడు.

'వెళ్ళి ఆ నీళ్ళల్లో దూకేస్తే!! ఈ పిల్ల బాధ తప్పిపోతుందిగా! అదే మంచి పనిగా తోచింది చాలా సేపు. కాని ఈ పిల్లనిలా వీధుల్లో వదిలి వెయ్యటమా ? రేపు ఈ పిల్ల తనలాటి దిక్కున్నా లేకుండా...వీధుల్లో...!!'

కాలు కదుల్తూనేవుంది. కళ్ళారకుండా మండిపోతున్నాయి. ఛీ. ఛీ ఈ రెండు చెడ్డ గుణాలు లేకపోతే...ఈ పిల్ల పిల్ల గాదు, బంగారం ముద్ద.

అంతలో బంగారం ముద్దే దగ్గరకొచ్చింది, నెమ్మదిగా అడుగులేసుకుంటూ. వచ్చిందే కాని పలకరించలేదు. పక్కనే నుంచుంది. తన కోపం తగ్గించటానికె ప్రయత్నమూ చెయ్యలేదు. ఊరికే మొద్దులాగ నుంచుందంతే.

చాలా సేపయిందలాగే...

''పద...ఆ నీళ్ళల్లో దూకేద్దాం"

''అమ్మో భయం వెయ్యదూ?"

''ఈ దొంగ తిండి తినడం కంటే అదేనయం."

"నేనింక దొంగతనం చెయ్యనుగా!"

"నీ చేతులూరుకోవుగా!"

"నా చేతులు నువ్వు కట్టేస్తా నన్నావుగా!"

"చేతులు కట్టేస్తే అన్నమెట్లా తింటావ్!"

"నువ్వే ముద్దలు చేసిపెట్టు."

"పద పోదాం చెట్టుదగ్గరకి'' రామూ కోపంగానే అన్నాడు.

''పద" అందమృత- అన్యాసక్తంగానో, నిర్లక్ష్యంగానో.

రాముడికి మళ్ళా కోపమే వచ్చింది. తానింత కోపంగా ఉంటే...

చచ్చిపోదామనుకుంటూంటే – ఈ పిల్లకి చీమకుట్టినట్లన్నా లేదేమిటి? కాలవలో దూకేస్తే తనేమయ్యేదీ?

''ఏమయ్యేది?'' తనే సమాధానం చెప్పుకున్నాడు."తర్వాత దెబ్బలు తింటూ బతికేది. ఏ గుడిసేటి వాళ్ళల్లోనో చేరి చాకిరి చేసేది! అంతేగా!!"

కాసేపాగి ఇద్దరూ మకాం చేసిన చెట్టు దగ్గరకెళ్ళేసరికి- శోభనాద్రి చెట్టు మొదలునానుకొని కూర్చుని ఉన్నాడు. ఏదో ఆలోచిస్తూ. తక్కిన వాళ్ళు గాఢ నిద్రలో ఉన్నారు. దొమ్మరి ఆటలో గూడా శోభనాద్రి ఆరితేరిన వాడేం కాదు

ఏదో సామాన్యంగా నేర్చినవాడు. చాలా పరకన్నీ అందరూ ప్రదర్శించేవే! గడ మీద పిల్లను నిలపటం, పడలటం కూడా చాలా మంది చేసేదే. ఆట ఏదో నడుస్తుంది. గాని అత్యాసక్తిగా మాత్రం నటపదు. కాని శోభనాద్రి తను అత్యంత సమర్థుడైన కళాకారుడన్నని లోపల గర్వం అది తాగడానికి డబ్బులు రాని రోజున బయట పడుతుంటుంది. ప్రదర్శనల వల్ల సంపాదించే దాంతో నలుగురూ బాగానే తినవచ్చు. కాస్తో కూస్తో మిగుల్చుకోవచ్చుగూడా. కాని వచ్చినదాంట్లో సగానికి పైగా సారాయి తాగేస్తాడు. అందుకే ఒక్కోపూట పస్తులుండాల్సి వస్తోంది.

శోభనాద్రికి ఆ ఊరిమీదే కోపం వచ్చింది. "ఒరే రాముడూ, ఫకీరూ! సర్దెయ్యి మూట. కట్టెయ్యి పోదాం. ఈ ఊళ్ళోంచే వెళ్ళిపోదాం" అంటూ గావుకేక వేసాడు ఆకలికోపంతో.

అందరూ పోదామంటే పోదామనే బయలుదేరారు.




అమృత ఏమయిందో, బ్రతికి ఉందో లేదోకూడ తెలియదు. ఆ బెంగతోనే కుంగిపోతున్నారు సునందా, శ్రీధరమూ.

వారాలూ, నెలలూ, సంవత్సరాలూ కూడా అయిపోతున్నాయి. కాని అమృత మాత్రం మరుపుకు రావటం లేదెంత ప్రయత్నించినా.

అమృతలేదు. అమృత ఫొటో ఉంది. దానిముందే కూర్చుంటుందెప్పుడూ సునంద. దాన్ని తీసి దాచేస్తేగాని సునంద అమృతను మరచిపోదేమో.

శ్రీధరం ఆ ప్రయత్నమే చేశాడా ఉదయం. సునంద కాఫీకాస్తూ 'స్టౌ' దగ్గరుండగా ఫొటో తీసి పారేద్దామనుకున్నాడు. చేతులు రాలేదేమో ఆలస్యం చేశాడు. తీరా ఫొటో తీసి పంచెకుచ్చెళ్ళ చాటున వుంచుకుని బయటకు నడుస్తుంటే సునంద కాఫీ తీసుకు వచ్చింది. శ్రీధరానికి ఖంగారే మిగిలింది.

"ఏం చేస్తున్నారు?"

"ఏం లేదు".

ఆ ఫోటో తీశారెందుకూ?"

"ఏం లేదు."

"నాతో చెప్పటానికేమండి" అంటూ దగ్గరి కెళ్ళింది సునంద. కన్నీరు మున్నీరైపోయాడు శ్రీధరం.

"ఈ ఫోటో ... ఈ ఫోటో ... ఇక్కడుంటే... నేను... అమృతను మరిచిపోలేకుండా ఉన్నాను సునందా!" గొల్లుమన్నాడు శ్రీధరం.

కట్టలు తెగి కన్నీటి కాలవలు వరదలు కట్టాయేమో! ఇద్దరికీ శ్వాసలే ఆడలేదు. మాటలే పెగల లేదు చాల సేపు. తర్వాత గొంతు పెగుల్చుకుని సునంద... "పోనీలెండి... అది ఈ బల్లమీదే వుంటే నేనూ ఇక్కణ్ణించి కదల్లేను. తీసికెళ్ళి ఏ పెట్టె అడుగునో పడేద్దాంలెండి.బంగారం లాంటి పిల్లే పోయింది. ఇక ఈ ఫోటో లెందుకూ!" అన్నది. "కాదు సునందా! ఆ మాట అనకు, అమృత బ్రతికే వుంది. వస్తుంది-ఎప్పటికో అప్ప

టికి..."

"అవును... వస్తుంది. తప్పకుండా! గుండెల్ని ఇట్లా పిండి చెయ్యటాని కెక్కడో దాక్కుంది. కానీ...వస్తుంది. దానికేం దానికి పూర్ణాయుర్దాయం అని అందరూ చిన్నపుడే చెప్పారు. కాకపోతే, మనకే దుఃఖం రాసి పెట్టి వుందేమో..."

ఆ రాత్రిదాకా ఆ ఫోటో పెట్టె అడుగున పారేద్దామనే ఆలోచనతోనే సరిపోయింది. ఫోటో పెట్టెలో పెడుంటే, చంటిపిల్లను గోతిలో పెడుతున్నట్లే శ్రీధరం దుఃఖపడ్డాడు. మగవాడు కనుక ఆపుకుని బలవంతాన పెట్టె మూసేశాడు. ఇద్దరూ ఆరాత్రి భోజనాల సంగతే మరచిపోయారు.

మర్నాడు శ్రీధరానికి ప్రమోషను మీద ట్రాన్స్ఫర్ ఆర్డర్లు వచ్చాయి. తనే ట్రాన్స్ఫర్ కోరాడు–అది వచ్చింది ప్పుడు. ఇకనా కొత్త ఊళ్ళోనే ఉండా

మనుకున్నారు దంపతు లిద్దరూ. ప్రమోషన్ వచ్చిందన్న సంతోషం ఏ కోశానా లేదు ఇద్దరికీ. "ఏ ఊరయితే ఏం? ఏ ఉద్యోగమయితే ఏం పొట్ట గడపటానికి?"

* * *

శోభనాద్రి బృందం అనకాపల్లి చేరింది అక్కడ ఆట బాగానే జరిగింది. అంటే డబ్బు బాగా వసూలైందన్నమాట. వసూలు బాగా అయిందంటే అర్థం ఆవేళ శోభనాద్రి మస్తుగా తాగి పడుకున్నాడన్నమాట. శోభనాద్రి ఆటకి మొదటి రోజు ఏ వూరిలోనైనా బాగానే వసూలవుతుంది. రెండో రోజూ ఫర్వాలేదు. మూడో రోజు నుండి జేబుల్లో డబ్బుల్లేని కుర్రకారే చుట్టూ చేరతారు.

ఆవేళ అందరూ అన్నాలు తిని పడుకున్నారు. నిద్దర్లూ పోయారు. అర్ధ రాత్రి వేళ అమృతకి తల్లి జ్ఞాపకం వచ్చింది కాబోలు-ఏడుస్తూ కూర్చుంది. రాముడూ లేచాడు.

"ఎందుకు ఏడుస్తున్నావ్?"

"ఏం లేదు."

"ఆకలేస్తోందా?"

"లేదు"

"మరెందుకూ?"... మీ అమ్మగారు జ్ఞాపకం వచ్చిందా?"

"లేదు"

"ఏమిట్రా కబుర్లు-పడుకో" తాగిన మత్తులోనే ఒక్కకేక వేశాడు శోభనాద్రి.

"లేచాడంటే చంపేస్తాడు. దూరంగా పోదాం పద."

ఆ సత్రానికి తలుపులూ ద్వార బంధాలూ కూడా లేవు. ఎండకి కాస్త అడ్డమంటుంది. వానకదీ ఉండదు. ఒక గుమాస్తా ఉంటాడు. కాస్త మంచిగదులు కావాలంటే వాడికి కొంత ముట్టజెప్పాలి. లేదా ఆ ఆవరణలో చెట్లకింద ఉండాల్సిందే.

అమృతా, రాముడూ బయటికి వెళ్ళి దూరంగా నడిచారు. చిన్న చెరువు దగ్గర కెళ్ళి కూర్చున్నారు.అక్కడో నాప రాళ్ళ చప్టా ఉంది.

కూర్చున్న తర్వాత రాముదే అన్నాడు.

"నా కివ్వాళ్ళ మా అమ్మా నాన్నా జ్ఞాపకం వస్తున్నారు"

"నాకూనూ !" గొల్లుమన్నది అమృత.

"ఊరుకో అమ్మూ ఏం చేస్తాం? ఏడుస్తూ కూర్చుంటే అమ్మ వస్తుందా? ఎవరో గొప్పోరింట్లో పుట్టావ్ ! ఇల్లా ఊళ్ళెంట తిరుగుతున్నావ్ ! అనుకుంటుంటే నాకే ఏడుపొస్తోంది. ఆపుకుంటున్నాను. నువ్వేడిస్తే నేనూ ఆగలేను. ఏం చేస్తాం. రేపెళ్ళి మళ్ళా గుళ్ళో దణ్ణం పెట్టుకుందాంగా ! ఈ పూటకి నా ఒళ్ళో పడుకో... రా...".అమృతను అమ్మూ అని పిలుస్తాడు నోరు తిరక్క రాముడు. అమృతకు ఎప్పుడు నిద్ర పట్టకపోయినా ఇట్లాగే ఒళ్ళో పడుకుని నిద్రపోతుంది. వీపుమీద చిచ్చు కొట్టటం ఆరభించాడు. ఏదో నోటికి వచ్చిన లాలి కూడా మొదలు పెట్టాడు రాముడు.

తల్లే జ్ఞాపకమొచ్చిందో లేక ఆ చల్లగాలికి నిద్ర వచ్చిందో గానీ అమృతకి చక్కగా నిద్ర పట్టింది.

తెల్లారింది. లేచి కళ్ళు నులుపుకుంటూ ఇద్దరూ సత్రాని కెళ్ళేసరికి సత్రమంతా గందరగోళంగా ఉంది. జనం అంతా ఎవరికివారు సరుకుని ఎవరి పొట్టతిప్పలకు




వారు వెళ్ళిపోతున్నారు. కొందరు అన్నాలొండుకుంటున్నారు. కొందరా దగ్గరే వున్న పందిరి కింద 'టీ' కొట్లో టీ తాగుతున్నారు. ఇద్దరు బిచ్చగాళ్ళు ఖాళీగా ఉన్న అరుగు నాదంటే, నాదని హోరాహోరీగా దెబ్బలాడుకుంటున్నారు.

"నేను అద్దెకుంటాను గనక ఈ అరుగు నాదీ" అంటాడు తెల్లగడ్డం ఒకడు.

"అదేంకాదు ఇవ్వాల అద్దె కడతాను గనుక నేనూ ఇహ్వాళ ఇక్కడే కూర్చుంటా" అంటాడు రెండోవాడు. పోట్లాట సాగుతూనే ఉంది. ఎవరు తీసిపోవటం లేదు. యధేచ్ఛగా, అసర్గళంగా బూతు పదకోశంతో నిండివుందా దెబ్బలాట.

టీ కొట్టు దగ్గర ఈ విషయం విచారణకు వచ్చింది. ఓ అనుభవజ్ఞుడు వివరించాడు.

"ఆ! ఏం లేదు. అరుగుకు అటు చివర 'రంగి' ఉందిగా! ఆ రంగి ఇటు నుంచి చూపుకు ఆనుతుంటుందిలే. అది కాస్త నవ్వుతూ మాట్లాడుతుంటుందిగా అదీ సంగతి"

దాంతో చాలామందికి విషయం అర్థమయింది. రంగి అక్కడ అందరికీ తెలిసిన మనిషే. దాని మొగుడో గుడ్డి వెధవ. అటు వెళ్తూ రాముడా మాటలు విని గాభరాపడ్డాడు. ఇంతలో మొదటివాడు కోపంతో "పోరా మాట్లాడతావ్! పిల్లల్ని అమ్ముకునే వెధవా! ఈ తడవ పోలీసుల్ని రానీ-నీ సంగతంతా ఆళ్ళకుచెప్తా" అన్నాడు.

ఆ మాట వినగానే రాముడి గుండెల్లో రాయి పడింది.

"ఈ సన్యాసి!! పిల్లల్ని అమ్ముతాడా!! నిజంగానే! వీడి దుంప తెగా!" వాడిమొహం పిల్లల్ని ఎత్తుకుపోయి అమ్మేవాడిలాగే కనిపించింది.

అంటే తనింక మరింత జాగ్రత్తగా ఉండాలన్న మాట! అమృతను ఏ మాత్రం గూడదన్నమాట. అసలు ఈ సత్రంలోంచే, ఈ ఊర్నుంచే త్వరగా మకాం ఎత్తెయ్యాలన్న మాట! ఆ వేళంతా జాగ్రత్తగా అమృతను అంటిపెట్టుకునే తిరిగాడు.

బెల్లం మార్కెట్ దగ్గర ఓ ప్రదర్శన ఇచ్చారావేళ. మాలక్ష్మమ్మ చెట్టు దగ్గర మరో ప్రదర్శన, ఆంజనేయులు గుడి దగ్గర ఇంకోటి. డబ్బు పది రూపాయలు పైనే వచ్చింది. అంటే శోభనాద్రి తాగి పడుకుంటాడన్న మాట! తను మరింత జాగ్రత్తగా ఉండాలన్న మాట

ఆవేళ తోటివాడు సింగన్న దగ్గర జేరి రాముడు రహస్యంగా తన భయం బయటపెట్టాడు. "రాముడూ! నీకేం ఫర్వాలేదు. నేనో పక్కా నువ్వో పక్కా పడుకుందాం. ఇద్దరం మెలుకునే ఉందాం. సరేనా?" అన్నాడు సింగన్న.

అలాగే చేశారు కూడా; దాంతో అనకాపల్లిలో ఉన్నన్నాళ్లు ఆ దొంగల భయం తగ్గింది కాని అనకాపల్లి వదిలి వెళ్ళాక తర్వాత కూడా సింగన్నకు వదలలేదు. అమృతకు రెండో పక్క పడుకుంటూనే ఉన్నాడు. సింగన్న ఆ ముఠాలో శోభనాద్రి తర్వాత వాడు. వాడే డోలు వాయిస్తాడు. వంత మాటలు అంటాడు. శోభనాద్రి తాగి పడుకుంటే పెత్తనమంతా వాడిదే. కాని ఇంతవరకూ రాముడికీ, అమృతకీ దూరంగానే ఉంటుండేవాడు. పరాయివాళ్ళుగానే చూసేవాడు.

ఇప్పుడు దగ్గరకు రావటం మరిగాడు. చనువు తీసుకోవటం ఆరంభించాడు. రాత్రి పడుకున్నపుడు అమృత కాళ్ళు వాడికాళ్ల మీదో, చెయ్యి పీకల మీదో వేసేది. ఇదే ఇష్టం లేదు రాముడికి.

ముగ్గురూ పిల్లలే! ఎవ్వరికీ పన్నెం డేళ్ళ కన్నా ఎక్కువ లేవు ! అయినా రాముడికీర్ష్యే పుట్టేది. అమృత సింగన్న కాళ్ళమీద కాళ్ళు వేసి నిద్రపోతున్న పుడు చూస్తే ఆ కాళ్ళు తీసి తన మీదే సుకునేవాడు. ఆ తర్వాత ఆ కాళ్ళు గట్టిగా నొక్కిపట్టి పడుకునేవాడు.

సింగన్నకప్పుడే పుట్టిందో లేక అప్ప డప్పుడే కలుగుతోందో గాని అమృత దగ్గరకొచ్చినప్పుడల్లా "రా...కూర్చో- ఏం కావాలి?" అంటూ ఆదరం వొలక బోసేవాడు. చేసేది లేక చాలాసార్లు రాముడు ఒళ్ళు మండిపోతున్నా చూస్తూ ఊరుకునే వాడు. కాని ఓ రోజున ఏదో మాటకు ముద్దొచ్చి సింగన్న



అమృత బుగ్గ పట్టుకు గిల్లాడు. అది చూశాడో లేదో అగ్గిబరాటాలాగా లేచాడు రాముడు.

"అమ్మాయ్ అంటే ఎవరనుకుంటున్నావేటి? కర్మం జాలక మన మద్దెనపడింది గాని ఇలా బతకాల్సిన పిల్ల గాదది. కలెక్టేర్ గారమ్మాయి. తెలుసుకో. ఏహ్హే"

అక్కణ్నించీ అందరూ సింగన్నే కాదు ఆఖరికి శోభనాద్రి కూడా అమృతని 'కలెక్టర్ గారమ్మాయ'నే అనేవారు. అలా పిలుస్తుంటే మరీ పయ్యారాలు పోతూ నడిచేది అమృత.

విశాఖపట్నం వెళ్ళేదాకా అలాగే జరిగింది. పూర్ణాసెంటర్ దగ్గరా, మెడికల్ కాలేజీ దగ్గరా ప్రదర్శన లిచ్చిన తర్వాత ఓ చెట్టుకింద వంట చేసుకుంటున్నారు. రాముడు పొయ్యూదుతుంటే అమృత పరుగెత్తుకొచ్చింది.

"రాముడూ...రాముడూ"

"ఏం?"

''ఈ ఊరు మా చుట్టాల ఊరే''

"ఆ !"

"ఈ వీధిలో ఆ చివరింట్లోనే మేం దిగాం. రెండు రోజులున్నాం.

నాకు గుర్తే... అదే ఆ పూలకుండీల ఇల్లు!"

"పద పద" అన్నాడు రాముడు. ఇద్దరూ పరుగెత్తారు. పూల కుండీల ఇంటి దగ్గర ఆగారు. అంతవరకూ అమృతకి గుర్తే. కాని ఇంట్లో వాళ్ళని చూసి తెల్ల మొహం వేసింది.

"ఈ ఇంట్లోకి మీరు కొత్తగా వచ్చారా" అంటే...

"అవును" అంటో చిన్నపిల్ల.

''వెనక ఉన్న వాళ్ళు ఎక్కడికెళ్ళారండి"

"ఏదో వూరు వెళ్ళిపోయారు. వెళ్ళిపోయి చాలా నెలలయింది ..." తిరిగి ఇద్దరూ శోభనాద్రి ఉన్న చెట్టుకిందికి వచ్చారు. తర్వాత చీవాట్లు తగిలాయి శోభనాద్రి నుంచి




అలా నాలుగు సంవత్సరాలు దుర్భరంగా గడిచిపోయాయి శ్రీధరం దంపతులిద్దరికీ. కొత్తసంవత్సరం మరింతగా బెదిరిస్తోంది. ఒకరికెదురుగా ఒకరు తిరగలేక, దోబూచులాడుకుంటూ ఇంట్లో తిరుగుతున్నారు. ఒకరినిచూస్తుంటే ఒకరికి అమృతజ్ఞాపకం వస్తోందో- వస్తుందని భయమో! అసలు ఆ దాంపత్యమే అలా కృతకమైపోయిందో.!

ఇక రేపు అమృత పుట్టిన రోజనగా- శ్రీధరం సునంద దగ్గరకు వచ్చాడు. దగ్గరగా కూర్చున్నాడు.

"రేపు అమ్మాయి పుట్టిన రోజు" అన్నాడు అంతకంటె మరి మాట్లాడలేకపోయాడు.

"అవును" అంది సునంద.

"పోనీ నలుగురు పిల్లల్ని పిలిచీ..."

"పిలిచి....?"

"ఆ పిల్లలందర్నీ చూస్తూ మన పిల్లలనుకుంటూ సంతోషిద్దాం పోనీ"

"అల్లాగే" అంది సునంద, ఏఆనందం

లేకుండానే.

ఆసాయంత్రానికే ఏవేవో సరుకులు తెచ్చారు. ఓ మిఠాయికొట్టంతా వచ్చిందేమో! సునంద గబగబా అన్నీ వెతికి చూసింది. ఏవేవో ఉన్నాయిగానీ, అమృత కిష్టమైన కోవాకజ్జికాయలు లేవు. "కోవాకజ్జికాయలు తేలేదేం?" తొందరలో అడిగేసింది సునంద. "అమృతను మర్చిపోదామనుకున్నాంగా!" కదిలిస్తే కన్నీళ్ళలికి పోతాయేమోనన్నట్లు నిలిచిపోయాడు శ్రీధరం.

సునంద మరతన్ని కదిలించలేదు. ఆ కన్నీళ్ళు వలకనూలేదు. అందరూ మన పిల్లలే. అందరూ వచ్చితింటుంటే, ఆడుకుంటుంటే అదిమాత్రం మనకానందం కాదా. మనపిల్లే వుంటే, అందరినీ పిలిచి పెట్టేదికాదా!

తనలోతాను అలాగే వాదించుకుంది సునంద. ఆ వీధిలో అందరితో ఆమాటే చెప్పింది.

"అందరూ నా పిల్లల్లాంటివాళ్ళే. రోజూ మీఇంట్లో ఆడుకుంటున్నారుగా! రేపు మా ఇంట్లో ఆడుకోటానికి పంపించండి. అంతే"

అల్లాగేనంటే అల్లాగేనన్నారు వీధంతా. ఇంటిచుట్టూ షామియానాలువేసి, నీడల్లో అన్ని ఆటలకి ఏర్పాటూ ఘనంగా చేయించాడు శ్రీధరం. 5-6 ఏళ్ళ పిల్లలంతా ఉదయం నుంచీవచ్చి ఆడుకుంటున్నారు. ఎవరి ఆట వారిదీ. మధ్యలో ఒక టేబుల్ వేసి, దాన్నిండా తెచ్చిన ఫలహారాలన్నీ చక్కగా ఉంచారు. ఎవరేం తినదలిస్తే వారు తీసుకు తినటమే.

ఆవేళ ఇల్లంతా కోలాహలమే! అందరితో బాటు శ్రీధరం ఆవెనకనే సునందఅందరికీ అన్నీ అందుతున్నాయోలేదో చూస్తూ తిరుగుతున్నారు. అలా తిరుగుతూ తిరుగుతూనే కనిపించకుండా పోయింది సునంద శ్రీధరానికి.

ఇదే సమయమనుకుని శ్రీధరం గబగబా వంటింటిపక్క పాత సామాన్ల గది దగ్గరకు వెళ్ళాడు. ఒక్కసారి...కళ్ళారా ఒక్కసారి అమృత ఫొటో చూసుకురావాలి అని. కాని కిటికీలోంచి చూసేసరికి అక్కడ అమృత ఫొటోనే చూసుకుంటోంది సునంద.

కళ్ళనీళ్ళ ప్రవాహం ఆపుకున్నా ఆగటంలేదు గదిబయట ఈయనకీ, గదిలో ఆమెకీ....

అయినా ఎవ్వరూ ఆ మూగబాధ బయట పెట్టుకోటానికిలేదు, వెళ్ళగక్కేదీ కాదది. ఈ కడుపుకోత ఎన్నాళ్ళోమరి!

శ్రీధరం వెనకనుండే వెళ్ళిపోయాడు. సునంద శోకించి శోకించి కన్నీళ్ళుగిరిపోయినతర్వాత, తిరిగి వెళ్ళింది ఏమీ ఎరగనట్టే. పిల్లల్లో కలిసిపోయారిద్దరూ మళ్ళీ.

తర్వాత కాసేపటికి శ్రీధరం తనూ ఆ ఫొటోఉన్న గదిలోకి వెళ్ళాలని ప్రయత్నించాడు. తనూవెళ్ళి సునందలాగే ఈ కళ్ళనీళ్ళ భారం వదిలించుకోవాలి దుఃఖ భారం ఎప్పుడూ అంతే. దాన్ని వెళ్ళగక్కుకోవటం ఒక్కటే హృదయ భారాన్ని తగ్గిస్తుంది. ఇక లోపలికెళ్ళి వద్దామనుకుంటుంటే- ఆవీధిలోనే ఉన్న ఒక తల్లి పిల్ల కోసం వెతుక్కుంటూ వచ్చింది. ఏదోపని ఉన్నట్లే పిలిచి, పిల్లను తీసికెళ్ళింది. మరో తల్లి ఆ వెనకనేవచ్చి తన పిల్లను ఏవో కేకలేసి, తీసుకుపోయింది. అల్లాగే అందరు తల్లులూ రా సా గా రు. వచ్చి వాళ్ళవాళ్ళ పిల్లల్ని లాక్కుపోయారు. చిన్నారి




లోకంతో కలకలలాడిన ఇల్లే దంపతుల కళ్ళముందే ఖాళీ అయిపోయింది. షామి యానాలు వెలవెలా వెలిసిపోయాయి. మళ్ళా యధాప్రకారం ఇల్లు దిగాలు పడి పోయింది.

సునంద, శ్రీధరం వరండాలో అలాగే నిలబడిపోయారు. అంతలో ఎవరో ఇద్దరు పిల్లలు ఆడుకుంటూ పరు గెత్తుకొచ్చారు. మళ్ళా దంపతులిద్దరి మొహాలు సంతోషంతో వికసించాయి. అంతలో ఆ తల్లులెవరో వచ్చి ఆ పిల్లల్ని బలవంతాన లాక్కుపోతుంటే... "ఆడు కుంటున్నారు. పోనీ ఆడుకోనియ్యండీ." అన్నది సునంద.

"వద్దులే తల్లీ! మేం ఇదొక తద్దినం అనుకోలేదు" అనేసిందా తల్లి.

ఒకరినొకరు ఓదార్చుకోటానికింక మాటలేవీ మిగల్లేదు. ఆ రాత్రికి కళ్ళు మూతలే పడలేదు శ్రీధరానికి. సునంద నోదార్చటానికి వెయ్యి విధానాలు ఆలో చించాడు.

ఏదో ఒకటి!... ఏదో ఒకటి చెయ్యకపోతే, ఈ సునంద కూడా తనకు దక్కేట్టులేదు.

అమృతలాగే తన అజాగ్రత్తవల్ల సునందకూడా దక్కకుండాపోతుందేమో!

ఆ ఉదయం—!!

"మనం ఎవరినన్నా ఒక బీదపిల్లని పెంచుకుందాం పోనీ" అన్నాడు శ్రీధరం బలవంతాన.

"అల్లాగే, మీకు కావాలంటే..."

శ్రీధరానికసలు ఇష్టంలేదింకో పిల్లని పెంచటం. కాని సునందకు ఇష్టమవుతుందే మోనని అని చూశాడు. నిజానికి సునం దకు 'కని పెంచే ఈడు' ఇంకా అయి పోలేదు. పిల్లపోయిన దుఃఖంలో మరో పిల్లని పెంచుకోవటం కొంత ఉపశాంతే మోనని ఆశ. బొత్తిగా ఇంట్లో ఒంటరిగా ఉంటే మరీ దిగులుపడిపోతుంది. ఎన్ని విధాలో సునందకు చెప్పి ఒప్పించ టానికే ప్రయత్నించాడప్పట్నించీ. కాని ఎన్నిసార్లయినా సునంద "మీ కిష్ట మయితే..." అంటూనే జవాబు చెప్పింది. "లాభం లేదు. ఎప్పటికయినా అమృత దొరికితేనేగానీ, ఈ మాతృ హృదయం సంతుష్టి చెందదు" అనుకుని మిన్న కున్నాడు శ్రీధరం.




విశాఖపట్నంలోనే నెల రోజులుండి పోయారు శోభనాద్రి ముఠా అంతా. ఒక రోజున పెద్దాసుపత్రి ముందూ, మరో రోజున జగదాంబ సినిమా హాలు సెంటర్లో, ఒకపూట స్టేషన్ దగ్గరా, మరో పూట సత్రం దగ్గరా ... ఇలా అన్ని చోట్లా డబ్బులయితే బాగానే వచ్చాయి. గానీ మిగలటం మాత్రం ఏం లేదు. జనం కూడా ఆట దగ్గర ఎక్కువ నిల బడేవారు కాదు. ఏదో కాసేపు నిలిచి చూడటం, తర్వాత వెళ్ళిపోవటం. పట్నా లలో అందరికీ ఒకే హడావుడి! తెల్లారి లేస్తే అందరూ అంతా పరుగే. తీరుబడిగా నిలిచిఆట చూస్తేగదా పది పైసలు పారే సేది! ఆ తీరికే లేదెవ్వరికీ.

కాస్త కలెక్షన్‌లు తగ్గేసరికి 'చల్ మోహనరంగా' అనేశాడు శోభన్నాద్రి. అంతా సింహాచలం వైపు దోవతీశారు. బస్సు ఎక్కటానిక్కూడా డబ్బులు మిగల్లేదీ తడవ. కాలినడకనే బయలుదేరి ఆ సాయంత్రానికి సింహాచలం చేరుకున్నారు.

సింహాచలంలోనే ఓ చిన్న తగాదా వచ్చింది. శోభన్నాద్రి పిల్లలతో నడుస్తూనే ఉన్నాడు. ఆ పక్కనే ఒక లావాటాయన నడుస్తున్నాడు. ఆయన వీపువంకే చూస్తూ నవ్వుతోంది అమృత. ఇక ఏదో విసిరేస్తుంది. ఆయన గోల గోల చేస్తాడని వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండాల్సి వచ్చింది రాముడు. రాముడా విషయం సింగన్నకీ చెప్పి జాగ్రత పరిచాడు. ఇద్దరూ కనిపెట్టే ఉన్నారు. అయినా ఎప్పుడు అంది పుచ్చుకుందో ఒక సల్ల మట్టిముద్ద విసిరేసింది. అమృత ఎప్పుడూ గురి తప్పదు. అది వెళ్ళి ఆ లావాటాయన వీపుకు 'తప్పు'న అంటుకుపోయింది.

లావాటాయన, బాగా లావాటాయనే గానీ, మహాచురుకైనవాడు. అమృత ఎంత నంగనాచిలా నటించినా తకాలున గుర్తుపట్టేశాడు. తటాలున వచ్చి జుట్టు పుచ్చుకున్నాడు పెద్ద రభస. రాముడే తప్పనిసరై, నేరం తన నెత్తిన వేసుకున్నాడు. ఫలితంగా ఆ లావాటాయిన రాముణ్ణి చావగొట్టేశాడు.

రాముడు దెబ్బలు తింటుంటే అమృత బిక్కమొహం పెట్టి, కళ్ళప్పగించి చూస్తూనుంచుంది. తనవల్లేగదా రాముడు దెబ్బలు తింటున్నాడని కసికసిగా చూసింది. నలుగురూ చుట్టూచేరి కలిగించుకుని విడదీసి లావాటాయన్ని పంపించేశారు. ఆయన వెళ్తుంటే. అమృత మరో పేడముద్ద విసిరి కొట్టింది. కసిగా లావాటాయన మరింత కసిగా వెంటబడ్డాడు. అమృత స్టేషన్ రోడ్డున పడి పారిపోయింది. ఆ వెనకనే రాముడూ పరిగెత్తాడు.

లావాటాయన మరిద్దరు స్నేహితులతో కలసి వారిని స్టేషన్‌లోకే తరుము కొచ్చాడు. ఆ ఊపులో ఆగివున్న రైలులో దూరారు వారిద్దరూ. రైలుకదిలి పోయేదాకా వాళ్లు స్టేషన్ వదిలి పెట్టలేదు.

అమృతనీ, రాముడినీ తీసుకుని రైలు వేగం పుంజుకుంది.

అదో మిలటరీ రైలు సిగ్నల్‌కోసం అక్కడ ఆగిందికాని, అసలాగాల్సింది కాదు. అలిసి అలిసి ఉన్నారేమొ ఓసీటు క్రిందచేరి ఇద్దరూనిద్రపోయారు. విజయవాడ దాకా లేవనేలేదు. విజయవాడలో మెలుకువ వచ్చి చూస్తే ఎదురుగుండా టికెట్ కలెక్టర్! డబ్బులేమీ రాలవని తెల్సిన తర్వాత, నాలుగు ప్రశ్నలువేసి ఏడిపించి నాలుగు మొట్టికాయలు వేసి ఇద్దర్నీ స్టేషన్ బయటికి పంపించేశాడు.

మళ్ళా పూట వెళ్ళటానికీ – కడుపు నింపటానికీ ఊరంట పడాల్సిన రోజులొచ్చాయి. స్టేషన్‌లోనే చాలా సేపు కూర్చుండిపోయారిద్దరూ.

అమృతను ఏమారితే–ఎక్కడ వెళ్ళి ఏ 'జేబుదొంగతనం' చేస్తుందోనని ఒక భయం, బిచ్చమెత్తి పొట్ట నింపుకోవటానికి అభిజాయిత్యం. ఆకలి ఆరంభించి అప్పటికే ఎంతో సేపయింది.

అప్పుడే వాళ్ళకి భద్రయ్య కనిపించాడు. భద్రయ్య అనేకరకాల వ్యాపారాలు





చేస్తాడు. అమృతలాంటి అందమైన ఆడ పిల్లల్ని తీసికెళ్ళి ఏదోరకంగా మారు బేరం చెయ్యటం ఆ వ్యాపారాల్లో ఒకటి. అమృత చాలా అందమైన పిల్ల. కాస్త మంచిపోషణ వుంటే చక్కగా తేలుతుంది. భద్రయ్యా పిల్ల వాలకాన్ని చూసి, దిక్కులేని పక్షులేనని ఇట్టే గ్రహించాడు కూడా. చాలా సేపు ఇద్దరినీ పరిశీలనగా చూశాడు. తర్వాత దగ్గరగా చేరి కూచ్చున్నాడు. మాటలు కలిపాడు. డబ్బులిచ్చి తనకు కావల్సిన బీడి వగైరాలు తెప్పించుకున్నాడు. తర్వాత బన్నూ, టీ వగైరా లేవో ఇప్పించాడు. ఆ విధంగా అతను పన్నిన వలలో ఆ ఇద్దరూ పడ్డారు.

ఒక్క గంటలో ఇద్దర్నీ భద్రయ్య ఒక బ్రోతలింటికి తీసుకెళ్ళాడు.

"ఎందుకీ దోరపిందె" అన్నదో ఘన జఘన సుందరి అమృతను చూసి. ఆమె పేరు కాంతమ్మ.

"పైపనులకన్నా పనికిరారూ? పనిపిల్ల



కావాలంటున్నావుగా! ముందాళ్ళకు తిండి పెట్టు. నకసక లాడుతున్నారు."

అమృతకీ, రాముడికీ లోపల తిండి ఏర్పాట్లు జరిగాయి. బయట భద్రయ్యతో కాంతమ్మ మాట్లాడుతూ కూర్చుంది.మరో నలుగురు జవరాళ్ళు కూడా అక్కడే కూలబడ్డారు. రాముడికా వాతావరణం ఏమిటో వికృతంగా కనిపించింది.

"కాస్త కాళ్ళు పిసకవే" అంటూ భద్రయ్య పక్కనున్న చకోరాక్షి ఒళ్ళో కాళ్ళుపడేసి-మరో పక్కనున్న అమ్మాయి వొళ్ళో తలవాల్చాడు.

"ఆ ఇందుకైతే ఉన్నాడు - గోపాల కృష్ణుడు!" అంటూ బుగ్గలు నొక్కుకుంది కాంతమ్మ.

"బేరాలు రాకపోతే నేనేం చెయ్యనే!''

"ఏం చెయ్యాలో కూడా నేనే చెప్పాలా?"

"నా తంటాలు నేపడ్తానే వున్నా హోటళ్ళన్నీ తిరుగుతూనే ఉన్నా. ఆ హోటల్ కుర్రాళ్ళంతా కమీషన్లు మరిగారు.ఆళ్ళే అక్కడ బ్రోతల్ హౌసు లెట్టేస్తున్నరు. ఇంకా ఇక్కడికెవడు వస్తాడూ? ఇక్కడంతా పోలీసోళ్ళ భయమాయె! గట్టిగా ఒక్క మంచి మంచ మన్నా ఇక్కడ తగలడదాయె.''

"ఏమో! ఏం వ్యాపారం చేసుకుంటావో! నువ్వేచేసుకో. రంగమ్మా, కనకం ఇవ్వాళో రేపో ఎళ్ళిపోతారంట ! ఇక ఈ ఇల్లు నడపటం నావల్లకాదు".

"ఈళ్ళెళ్ళిపోతే-ఏం? కొత్తగా వచ్చిం దుందిగా!...ఏమిటమ్మా దాని పేరు ! వనజా...?"

"ఆ వనజే ! తింటోంది, కూర్చుంటోంది. ఏం చెప్పినా దానిపాటే దానిది అదిగో ఆ గదిలోనే వుంది.ఎళ్ళిమాట్లాడు''

భద్రయ్య ఆ గదిలోకి వెళ్ళాడు హుషారుగానే. అయిదు నిమిషాలైంది. లోపల ఏవో తిట్లూ శాపనార్థాలూ ప్రారంభమైనాయి. పది నిమిషాలయింది. లోపల ఏవేవో భయంకరమైన శబ్దాలే ప్రారంభమయినాయి. మరో అయిదు నిమిషాల తర్వాత భద్రయ్యే నెత్తిమీద రెండు బొప్పెలు కట్టి బయటికి వచ్చాడు.

"ఏమయిందిఏమయిందన్నారందరూ"

"ఏమవుతుందీ!-గొడ్డును మేపినట్టు మేపుతోందాయె! తెగబలిసి ఎదురు తిరిగింది. ఇక దీనికి కూడెయ్యకు. రేపు సుబ్బయ్యనీ, ఖుస్రూగాణ్ణీ పంపిస్తాను. పొగరణిచేస్తారు" ఆ అంటూ, పై గుడ్డేసుకుని వెళ్ళిపోయాడు భద్రయ్య.

రాత్రికి ఆ సుందరాంగులంతా చక్కగా ముస్తాబయ్యారు. తెల్లవార్లూ ఎవరెవరో వస్తున్నారు, పోతున్నారు. చాలా సేపు మేలుకున్నారు గానీ-తర్వాత అమృత మొద్దునిద్ర పోయింది. రాముడే ఓ కంట అంతా గమనించాడు.

ఆరాత్రికేం జరగలేదు. గానీ, భద్రయ్య శపథం మరునాటి ఉదయం నెరవేర్చుకున్నాడు. భద్రయ్య ఇద్దరు కొత్తవాళ్ళతో ఇంటికి వచ్చాడు. ఇద్దరూ ఆబోతుల్లాంటి వాళ్ళు. ఇద్దర్నీ ఆ అమ్మాయి ఉన్న గదిలోకి పంపించాడు.

రాముడా పక్కగదిలోనే ఉన్నాడు. ఆగదిలో ఏదేదో అనూహ్యంగా జరిగిపోతోంది. మొదట అమ్మాయి బ్రతిమాలింది. కేకలేసింది కసిరికొట్టింది. పెనుగులాడినట్లుంది. అన్నిటికీ ఆ వస్తాదులిద్దరూ నవ్వుతూనే ఉన్నారు. రాముడవన్నీ విన్నాడు. తలుపు విసవిసలాడటం కళ్ళారా




చూశాడు. గబగబా బయటికి వచ్చి అందరితోనూ చెప్పబోయాడు. కాని అందరూ వాణ్ణి చూసి వేళాకోళంగా నవ్వారు.

చాలా సేపు గదిలోంచి మూలుగు వినిపించింది. తర్వాత అదీలేదు.

నాలుగయిదు గంటలయిన తర్వాత గానీ ఆ రౌడీలిద్దరూ బయటికిరాలేదు. వాళ్ళు నవ్వుకుంటూనే వచ్చారు బయటికి. భద్రయ్యే ఎదురు వెళ్ళి వాళ్ళనేదో అభినందిస్తున్నాడులాగుంది. అంతలో ఆ అమ్మాయి కోపంగా బయటికి వచ్చింది. ఖాండ్రించి వాళ్ళమీద ఉమ్మేసింది. వాడు లాగి గట్టిగా తన్నాడు.

ఆ అమ్మాయి వెళ్ళి దూరంగా పడింది. తక్కినవాళ్ళందరూ గొల్లున నవ్వారు.

"ఇంకా నీ పొగరు తగ్గలేదంటే" అంటూ లేచాడు భద్రయ్య. "లే; తగ్గలే సువ్వరా" అంటూ రాక్షసిలాగా లోపలి కెళ్ళిందా అమ్మాయి. సిగ్గన్నా లేకుండా భద్రయ్య ఆ గదిలోకి వెళ్ళాడు. అరగంట తర్వాత నవ్వుతూ బయటికి వచ్చాడు. ఆ రోజునుంచీ ఆ అమ్మాయి 'జానకి' కూడా అందరితోబాటే అయింది.

ఈ ఇంటికంటె శోభనాద్రితో మను గడే హాయిగా ఉంది అనుకున్నాడు రాముడు. అమృతకి గోలేమీ అర్థంకావటం లేదు. ఏదో కొట్లాటలూ, తిట్లాటలూ, గందరగోళం! కాలక్షేపమయిపోతోంది.

వారం రోజులు గడిచింది. పిల్లలిద్దర్నీ ఎవ్వరూ పట్టించుకోవటంలేదు. ఎవరికన్నిపిస్తే వాళ్ళు ఏదో ఒకపని చెప్తున్నారు. ఇద్దరూ చేతనయిన విధంగా ఆయా పనులు చేస్తున్నారు. రాముడు మాత్రం అమృతను కంచాలు కడగటం లాంటి పనుల్ని చెయ్యనివ్వటంలేదు. కలెక్టర్‌గారి కూతురు కంచాలు కడుగుతుందా ?

ఓ నెల రోజులు గడిచిందేమో! ఓ రోజున భద్రయ్య మరొకరితో కలిసి కారులో వచ్చి దిగాడు. సుమారు 45 సంవత్సరాలు ఉంటాయి. ఖద్దరు లాల్చీ. పంచ. ఆయనకన్ని మర్యాదలూ చేశారు. ఆయన ఇంట్లో వాళ్ళందర్నీ పలకరించాడు. అందర్నీ భుజంమీద చేతులేసి తట్టాడు. తర్వాత నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. ఆవేళ అర్ధరాత్రిపూట పదిమందిదాకా ఆయనతోబాటు వచ్చి దిగారు బిలబిలా. వాళ్ళల్లో 25 ఏళ్ళ వాళ్ళ నుంచీ 60 ఏళ్ళ వాళ్లదాకా ఉన్నారు. కొందరు కొందర్ని బాబాయ్ అని పిలుస్తున్నారు కూడా. అయినా అందరూ కలిసి అందరు అంగనామణుల్తో సర్దాగా లాడుతున్నారు. అంతలో ... మొదట వచ్చినాయన లేచి నుంచున్నాడు. ఉపన్యాసధోరణిలో మొదలుపెట్టాడు.

"మనందరం ఇక్కడ కెందుకొచ్చామో మీ అందరికీ తెలుసు. మనందరి ఖర్చే, మన 'గౌరినాధమే' పెట్టుకుని మనకీ ఏర్పాట్లు అన్నీ చేశాడు. ఇక్కడ ఏడెనిమిది మంది అమ్మాయిలున్నారు. భోజనం కాఫీ టిఫిన్లు అన్నీ ఇక్కడికే వస్తాయి. ఇక రోజుకో 'కేసు' సీసాలూ, సోడాలూ ఒకటేమిటి? అన్నీ మీరు అడిగిందే తడవుగా వస్తాయి. కనక సోదరులెవ్వరూ మొహమాటం పడనక్కర్లేదు. కావల్సినంత తిండి. కావల్సినదేదో అడిగి తాగండి. వైను-వైను తర్వాత బీరు - తర్వాత బ్రాంది...ఓ మీ ఇష్టం! అదిష్టం కాకపోతే అమ్మాయిలున్నారు. కావల్సిన దాన్ని సెలెక్టు చేసుకోండి. ఎవరిష్టం వచ్చినట్లు

వారుభోగాలనుభవించండి. వరసగా వారం రోజులు...ఆ తర్వాత సరాసరిక్కణ్ణించి యిచే మునిసిపల్ ఆఫీసుకెళ్ళి ఓట్లే సెయ్యటం, గౌరీనాధం గెలవటం... తర్వాత మళ్ళీ మనకి పెద్ద పార్టీ"

అలవాటుకొద్దీ ఎవడో నినాదం ఇచ్చాడు.

"ప్రజాస్వామ్యం..."

"వర్ధిల్లాలి" అన్నారందరూ.

అందరూ గొల్లుమని నవ్వుతూ, తలా ఒక అందాలబొమ్మనీ దగ్గరకు లాక్కున్నారు. వాళ్ళ మోటుతనం చూస్తే పడపు పడతులకే సిగ్గేసుకొచ్చింది.

రెండు రోజులయిపోయింది. అందరికీ ఉన్న కాస్త బెరుకు కూడా తీరి మరీ 'బరి' తెగించారు. మురికి కంపుకొడుతున్నా ఆ ఇల్లు బృందావనమయిపోయింది. అందరి ఒడిలోనూ జానకి పూలబంతే అయిపోయింది.

ఒకాయన జానకిని నా ఒళ్ళో



కూర్చోబెట్టుకుంటానంటాడు. మ రొ క కుర్రాడు కాళ్లు నా ఒళ్ళో పెట్టమం టాడు. ఇంకోకాయన తల్లో నేనే పువ్వులు పెడ్తానంటాడు. 'వెల వెలదు' లంటేనే అందరికీ లోకువ. ఎవరి సరదా వారిదయింది.

రాముడికి పోలీసులంటూ ఉన్నారని కొంత తెలుసు. వాళ్ళు అల్లర్లు జర క్కుండా జనాన్ని కంట్రోల్లో పెడతా రని తెలుసు. దొంగల్ని పట్టుకుంటారనీ తెలుసు. ఇటువంటి ఇళ్ళమీద పడి చెకింగ్ చేస్తారని కూడా వినే ఉన్నాడు. ఇక్కడ ఈ మాదిరి పనులు పెద్దమనుషులు చేస్తు న్నారని వాళ్ళకు ఇంకా తెలియదేమో ననుకున్నాడు. పోసి వెళ్ళి తనే చెబ్దామా?' అని ఆలోచించాడు.

ఓ రోజు ఉదయం సిగరెట్ పెట్టెలకి పంపించినప్పుడు అటునుంచే అటువెళ్ళి పోలీసుస్టేషన్‌లో కనిపించిన పోలీసు కల్లా చెప్పాడు. చెప్పినదంతా వాళ్ళూ విన్నారు. మరి నలుగురు స్నేహితుల్ని కూడా కేకేసి పిల్చి వాళ్ళకూ కూడా అన్నీ మళ్ళీ చెప్పించారు. రా ము డు చెప్పినదంతా విని వాళ్లు మరింత ఆనంది స్తున్నట్లు కనిపించిందిగానీ చర్య తీసు కునేట్లే కనిపించలేదు రాముడికి.

ఇక లాభంలేదని తిరిగి వస్తుంటే ఒక పోలీసు ఉండబట్టలేక కా బో లు అన్నాడు.

"మమ్మల్నా వీధిలోకి కూడా వెళ్ళొ ద్దని పైనుంచి వచ్చాయి ఆర్డర్లు. మేమేం చేస్తామింక?"

తెల్లమొహం మిడిగుడ్లతో రాముడు తిరిగి వచ్చాడు సిగరెట్ల పెట్టెల బస్తాతో.

ఆ వారం రోజులూ తిరణాల్లాగా అయిపోయింది. ఆ అమ్మాయిలనందర్నీ ఆ 'మునిసిపల్ ఆఫీసు గేటు'దాకా కారు లోనే తీసికెళ్ళి ఆ గేటు దగ్గర వదిలేశారా కౌన్సిలర్లు. తిరుగు ప్రయాణం ఎవరిది వారిదే అయింది.

అదంతా చూసినప్పట్నించీ అమృతను కూడా అల్లాగే తిప్పుతారేమోననే భయం పట్టుకుంది రాముడుకి. "జన్మలో అలా జరగకూడదు. ఇక్కణ్నించి తప్పించుకు పోవాలి వెంటనే..."

ఆ మాట అమృతతో చెప్పటానికే సరియైన సమయం దొరకలేదు.

ఓరోజున ఒంటరిగా చూసి అడిగితే...

"ఎందుకూ?" అన్నది.

"మరి మీ అమ్మా నాన్నల దగ్గర కెళ్ళవా?"

"వెళ్తా!"

"మరి ఇక్కడే వుండి పోతేఎట్లా?"

"అవును; ఎలా ?"

వెళ్ళటం ఖాయమైంది. ఇందరికళ్లనూ కప్పి ఎలావెళ్ళటం! స్త్రీ పురుషులందరూ ఏదో పని మీద ఎప్పుడూ పిలుస్తూనే ఉన్నారు. ఎప్పుడూ ఏదో పని చెప్తూనే ఉన్నారు.

"పైగా ఈమధ్య రాత్రిపూట ఆడ వాళ్ళ కోసం ధనికులెవరన్నా వచ్చి నపుడు అమృతను పిలిచి, "పాపం; మ మ్మ ల్ని కనిపెట్టుకుంటోందిక్కడ. పరికిణీ కుట్టించుకుంటుంది. ఏమన్నా ఇవ్వండి" అంటూ డబ్బు ఇప్పిస్తున్నారు. అలా ఇచ్చినప్పుడల్లా రాముడిఒళ్ళు మండి పోతోంది.

ఇద్దరూ 'సరే' నంటే 'సరే' నను కున్నారు. తెల్లారేటప్పటికి రైల్లోఉన్నార.

* * *

రైల్లో అంతా కిటకిటలాడుతోంది. బండి నిండా టిక్కెట్ కలెక్టర్లూ ఉన్నారు.

రాత్రి తెల్లవార్లూ ఎక్కడ నిద్రపోయారో గాని ఒక్కసారిగా బండి చెక్ చెయ్యటం ప్రారంభించారు. అక్కడికీ రాముడు అమృతతో సహా వాళ్ళని తప్పించుకోవటానికి పెట్టెలు మారటం ఆరంభించాడు. ఆఖరి పెట్టెలో ఎక్కిన తర్వాత దాంట్లోనే టికెట్ కలెక్టర్ని చూశారు. బిక్కు; బిక్కు మంటూ. ఇద్దరూ ఓమూల నుంచున్నారు. టికెట్ కలెక్టర్ రానే వచ్చాడు. టికట్ అడుగనే అడిగాడు.

అమృత రెండు టిక్కెట్లు ఎక్కణ్ణించి తీసిందో తీసి ఆయన చేతిలో పెట్టింది.

అసలే గడగడలాడిపోతున్న రాముడి గుండెలు మరీ గడగడలాడటం ప్రారంభించాయి.

టి.సి. దూరంగా వెళ్ళిన తర్వాత, చెవిలో రహస్యంగా అడిగాడు "ఎక్కడవీ టిక్కెట్లు?" ఎవరి దగ్గరో కొట్టేశావ్ కదూ?" అన్నింటికీ సమాధానం ఆ పత్తి కళ్ళ చూపులే! ఆ బిత్తర చూపులుచూస్తే కొట్టబుద్ధి కాదు. కాసేపటికి అవతల ఉన్నాయన ఎవరో టికెట్టు పోయిందని గోల ప్రారంభించాడు. పాపం! ఎవరో ముసలాయన! చాలా బీదవాడు లాగున్నాడు. రాముడికేకంగా ఏడుపొచ్చింది. ఏదో స్టేషన్లో రైలాగింది. టికెట్ కలెక్టర్ పెట్టె నుంచి దిగిపోతూ ఇద్దర్నీ చూసి కేకలేశాడు. "సంధ్యాల వచ్చింది. దిగరేం?" ఆ టికెట్లు సంధ్యాల వరకే కాబోలు. ఇద్దరూ బండి దిగిపోయారు.

ఇక పొట్ట తిప్పలు మళ్ళా ప్రారంభమయ్యాయి. మొగ్గలెయ్యటానికూడా వాసాలూ, పనిముట్లు కావాలి. పాటలు పాడాలన్నా 'మద్దెలో,' 'ఏక్‌తారో కావాలి. ఏదీ లేనిదే!!

"పోనీ నా గొలుసు పందిగా! అమ్మేస్తే..."

"గయ్యిన లేచాడు రాముడు. "ఆ మాట ఇప్పుడంటే అన్నావ్! ఇంకెప్పుడూ అనకు."

సాయంకాలం బస్సు స్టాండ్ కిటకిటలాడుతోంది. ప్రయాణీకులంతా బస్సుల కోసం ఎదురు తెన్నులు చూస్తున్నారు. పెళ్ళి మేళగాళ్ళు కాబోలు ఏ ఊరో వెళ్తున్నారు.

సమయం బాగానే ఉందనుకున్నాడు రాముడు.

ఏదో హాస్యపు పాట అందుకున్నాడు. అమృత ముద్దుగా చేతులు తిప్పుతూ ఆట ఆడుతోంది. జనం నిలిచి చూడసాగారు.

బాండు మేళగాళ్లకూడా సరదా పుట్టినట్టుంది. తీరికా ఉన్నట్టుంది. వాళ్ళూ వాయిద్యాలు బయటికి తీసేరు. శ్రుతి కలిపారు. పాట బాగుంది. ఆట రక్తి గట్టింది. కొందరు ఆ ఆట రక్తిలో బస్సు మాటే మరచిపోయారు. మొత్తం మీద చివరికి కలెక్షనూ బాగానే ఉంది. ఆపూట తిండి తినగా ఓ కంజీరా కొనటాని కూడా అవకాశం కలిగింది.

ఆకంజీరానే నమ్ముకున్నాడు రాముడు మరిదాన్ని వదలలేదు. రోజులు దొర్లిపోతున్నాయి. కడుపు నిండుతున్నది. అమృత చూడ ముచ్చటగా బొడ్డుమల్లి పువ్వులాగా ఉంటోంది. అంతా బాగానే గడిచిపోతోంది ఆరోజు దాకా. కాని ఆ వేళనే ఎందుకనో అమృత కనిపించలేదు పొద్దున్నే రాముడికి

ఎక్కడి కెళ్లిందోలే అనుకున్నాడు చాలా సేపు. కాని చాలా సేపు దాకా రాక

పో సరికి "ఎక్కడికెళ్ళిందబ్బా" అనుకున్నాడు. మరో గంటకి మరీ ఖంగారుపడి మజిలీ వేసిన పాత సత్రమంతా వెతకనారంభించాడు దిగులుపడుతూ.

వెతగ్గా వెతగ్గా ఓ మూల కూర్చుని వుంది అమృత. పంచప్రాణాలు లేచి వచ్చాయి రాముడికి.

"ఎందుకూ ఇక్కడ కొచ్చి కూర్చున్నావ్?" అన్నాడు దగ్గరకెళ్తూ. "ఒంట్లో బాగా లేదా" అన్నాడు ఖంగారు పడ్తూ.

అన్నింటికీ సమాధానంగా అమృత "ఛీ ఫో" అని చీదరించే గంటసేపు అటూఇటూ తిరిగి వచ్చి రాముడు మళ్ళా అడిగాడు. మళ్ళీ అదే సమాధానం. పరిశీలనగా మొహం చూస్తే నీరసంగా కనిపించింది. నిజంగా ఏదో జబ్బే చేసిందనుకున్నాడు. దగ్గరకెళ్ళి మళ్ళా అడిగాడు

"ఒంట్లో ఎలా వుంది? జ్వరమా?"

అదివరకు రెండు మూడు సార్లు అమృతకి జ్వరం వచ్చింది. ఎంత సేవన్నా చేయించుకునేది జ్వరం వస్తే. కాని ఈ తడవ... ?!

"ఛీ పో"

రాముడికేమీ అర్థం కాలేదు.

డాక్టరు గార్నెవర్నయినా పిలుచుకు వస్తే...! రొంటిని పది రూపాయలు నిలవ ఉన్నాయి. గబగబా దగ్గరున్న డాక్టరు దగ్గరకి పరుగెత్తాడు. ఓ డాక్టరమ్మ ఇల్లది. ఆ ఇంటి దగ్గర ఆగాడు. ముందు చేతిలో 10 రూపాయల నోటు పట్టుకు సుంచున్నాడు. తర్వాత దణ్ణం పెట్టి అడిగాడు. "వస్తా, పద" అన్నది ఆ డాక్టరమ్మ వెంటనే— పది రూపాయలు దీసికొని. కాని సత్రం గేటు ముందాగి, "ఇక్కడా? నేను రాను. ఆ పిల్లనే హాస్పిటల్‌కు తీసుకుని రా చూస్తాను" అని ఆ రిక్షామీదే వెళ్ళిపోయింది. రిక్షా వెంట పరుగెత్తి వచ్చిన రాముడి ఆయాసం ఇంకా ఆగనే లేదు. నిరాశగా అమృత ఉన్న గది ముందుకు వెళ్ళాడోసారి, ఎట్లా వుందో చూద్దామని. అమృత దగ్గర్నుంచి ఓ ముసలమ్మ ఎదురొచ్చింది.

"ఎల్లా వుంది అమ్మూకి?"

"మరేం లేదులే. పెద్దమనిషయింది."

"పెద్దమనిషా!...అంటే...?"

"అంటే తర్వాత తెలుస్తుంది. ముందెళ్ళి సెనగపప్పుండల్రటా. అందరికీ పంచి పెడ్దాం" అందామె.




సంవత్సరాలు గడచినా అమృతను మరచిపోలేకపోతున్నారు శ్రీధరం, సునంద అమృత మృతి చెందిందని కాసేపూ, లేదని కాసేపూ మనసులో మథనపడుతూ, బాధపడేవారు.

పుట్టినరోజు పండగ రావటం ఇద్దరికీ భయమే! ఒకరికి తెలియకుండా ఒకరెళ్ళి పిల్ల ఫోటో చూసి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నారని ఇద్దరికీ తెలుసు.

'ఈ దుఃఖాన్ని కంతంలేదా?' అని మరింత బాధపడుతున్నాడీ ఏడు శ్రీధరం.

ఈ విచారంలోనే గడచిపోతున్నందు

కేమో- పుట్టిన పిల్లను సరిగా చూసుకో సందుకు శిక్షగానేమొ భగవంతుడు మరిక సంతానాన్ని ప్రసాదించనేలేదు. మరొక్క పిల్లో, పిల్లాడో కలిగివుంటే, కొంతవరకన్నా అమృతని ఇద్దరూ మరచి పోయేవాళ్ళేమొ!

ఒక్కసారికాదు పదిసార్లు పది రకాలుగా శ్రీధరం "పోనీ మరొక పిల్లని పెంచుకుంటే ఏం?"అని అడిగి చూసాడు.

"అల్లాగే మీ ఇష్టం" అంటూ తన అయిష్టాన్నే వ్యక్తం చేసేది సునంద. అయినా ఏదో మాటల సందర్భంలో "అరువు సొమ్ము అరువుసొమ్మే!"అన్నది చాలాసార్లు.

వీధి నెవరన్నా అమృత వయసు పిల్ల వెళుతుంటే గబ గబా మేడదిగి వెళ్ళేది సునంద. ఇంకా అమృత ఆ వయసులోనే ఉంటుందనుకుందేమో!

'అంతా బాగుంటే అమృతకి వయ సుండేదని'- ఊహల్లోనే పిల్లని పెంచు కుంటున్నాడు శ్రీధరం.

అప్పుడే ఏడేళ్ళయిపోయింది. ఇంకేం కనిపిస్తుందని నిరాశ రోజు రోజుకు పెరుగుతున్నా ఆ మరుక్షణంలోనే పది పన్నెండేళ్ళ పిల్ల ఎవరు కనిపించినా అమృతేమోనని ఆశ. కాదని నిరాశ. మనసు అల్లకల్లోలమై పోతోంది దంపతులిద్దరికీ. వంతులేసుకుని అనురా గాలు పంచుకోవల్సిన వయసులో, అంతు లేని బెంగ పంచుకుంటున్నారు ఇద్దరూ.

అమృత ఆట పాటలు చూసే అదృష్టం ఎలాగూలేదు. ఆ వయసు పిల్లల ఆటలన్నా చూసి సంతోషిద్దామని ఒక రోజున అనాథ శరణాలయానికెళ్ళాడు. వారి ఆటలూ అవీ చూస్తుంటే శ్రీధరానికి మొదటిసారిగా ఒక ఉపాయం తట్టింది. తర్వాత మూడురోజులు తనలోతనే తర్కించుకుని, వివరంగా ఆలోచించుకుని మూడవరోజున ఆ అనాథ శరణాలయా నికి వెళ్ళాడు. మేనేజర్‌తో ప్రత్యేకంగా మాట్లాడాడు.

"మేమో పిల్లను పెంచుకుంటా నంటే ఇస్తారా?"

శర్మ ఆ అనాథ శరణాలయానికి మేనేజర్‌గా దాదాపు 20 యేళ్ళ బట్టీ పని చేస్తున్నాడు. తన విధి నిర్వహణలో మాత్రం ఏమాత్రం లోపం చెయ్య డాయన.

శర్మ కొన్ని సందేహాలు వెలిబుచ్చాడు. శ్రీధరం జవాబులు చెప్పాడు. పిల్లలను పెంచుకోవటం కన్నా, భార్య ఆరోగ్యం కాపాడాలన్న ఆదుర్దా శ్రీధరం మాటల్లో శర్మ గమనించాడు. మర్నాడు భార్యతో గూడా రండన్నాడు శర్మ. ఆ మాటకే ఉప్పొంగిపోయాడు శ్రీధరం.

మర్నాడు అనుకున్నవేళ కంటే ముందే శ్రీధరం సునందతో సహా శర్మ ఆఫీసుగదిలో ఉన్నాడు. అనుకున్న ప్రకారం అదే ప్రథమ పర్యాయం కలుసు కోవటం లాగా ఇద్దరూ మాట్లాడారు. తర్వాత ఏదో శరణాలయాన్ని చూడటా నికి వెళ్ళినట్లుగానే అన్ని గదులకి వెళ్ళారు.

ఏదో అందర్నీ చూస్తున్నట్లుగానే 'అమ్మడి'నీ చూశారు.

"ఈ అమ్మాయి వయసెంతన్నారు?'' అన్నాడు శర్మతో శ్రీధరం.

"చూసి చెప్తాను."

"పేరు?''

"అమ్మడు"

"అమ్మడేమిటి?అసలు పేరు చెప్పండి."





"అది మాకు తెలియదు. దొరికి నప్పుడు 'అమ్మడ'నే చెప్పింది. అమ్మడనే రికార్డు చేసుకున్నాం. అప్ప ట్నించీ అమ్మడనే వ్యవహరిస్తున్నాం. చిన్న పిల్లలుగదా అంత చిన్నతనంలో ఏ పేరుతో పిలుస్తుంటే ఆ పేరేతప్ప అసలు పేరున్నా చెప్పలేరు"

ఏవేవో నాలుగు ప్రశ్నలు వేశాడు శ్రీధరం. ఆ అమ్మడు జవాబులేవో బాగానే చెప్పింది. శర్మ సునందనుగూడా ప్రశ్నలు వేయమన్నాడు. కాని ఆమె శ్రీధరాన్ని చూసి నవ్వి ఊరుకుంది.

"పదండి ఈ అమ్మాయి రికార్డు చూసి చెబుదురుగాని"

అందరూ మళ్ళీ ఆఫీసుగదికి వచ్చారు. శర్మ ఆఫీసు రికార్డు తిరగేస్తూ చెప్పాడు "పదిహేనేళ్ళ క్రిందట ఈ అమ్మడు భీమవరం దరిదాపు ప్రాంతాలలో తప్పి



పోయింది. అప్పట్నించీ ఇక్కడే ఉంటోంది"

"ఎక్కడా! భీమవరం ప్రాంతాల్లోనా?" అంటూ ఆశ్చర్యం ప్రకటిస్తూ సునంద వంక చూశాడు శ్రీధరం సాభిప్రాయంగా సునంద కూడా అక్కణ్ణించి అమ్మడు'మీద ఆసక్తి కనబరచింది.

"అవును. ప్రస్తుతం థర్డు ఫారం చదువుతోంది. చాలా బుద్ధిమంతురాలు. అల్లరి చిల్లరి పనులకు వెళ్ళదు. మంచి కుటుంబంలో పుట్టినట్లే అనుకోవచ్చు.."

మరోసారి సునంద వంక చూశాడు శ్రీధరం. సునంద మొహం కూడా మరి కాస్త ఉజ్వలమైంది.

"చదువులో కూడా కిందలేదు.అన్ని సబ్జెక్టులలో 50%, 60% లో మార్కులు వచ్చాయి..."

తర్వాత భోగట్టా ఏమీ ఆ భార్యా భర్తలు వినిపించుకోలేదు.

"నీకు నీ తల్లిదండ్రులేమన్నా జ్ఞాపకం ఉన్నారామ్మా?"

"లేరండి."

తల్లి హృదయం ఉండబట్టలేదు కాబోలు-'అమృతా' అంటూ సునంద ఒక్కసారిగా అమ్మడిని కావలించుకుంది.

శ్రీధరానికి కళ్ళు చెమర్చాయి. సునంద అమ్మడిని దగ్గరకు తీసికుని, మరి వదలలేదు.

"అమృత అన్న పేరు నోట పలకలేక అమ్మడని అంటారు. అదే ఖాయపడి పోయి వుంటుంది" అన్నాడు.

శ్రీధరం ఒక 'బాండు'మీద సంతకం పెట్టి ఇస్తుంటే...శర్మ-

"అంతా దైవఘటన కాకపోతే ఏమిటిది! ఇన్నాళ్ళూ మీరీ వూళ్ళోనే ఉన్నారు. ఇవ్వాళ్టికి మళ్ళా ఇలా కలుసుకున్నారు" అన్నాడు. 'మళ్ళా' గొల్లుమన్నది సునంద... ఈ తడవ శ్రీధరం కూడా. ఆనందం ఓ పక్క పొంగి వస్తుంటే అణచిపెట్టి ఇద్దరికీ ఇన్నాళ్ళుగా దాగివున్న దుఃఖం పెల్లుబికి వచ్చింది. వాళ్ళిద్దర్నీ చూసి అమ్మడు కూడా కన్నీళ్ళు పెట్టుకుంది.




ఇన్నేళ్ళ తర్వాత మళ్ళా ఆ ఇల్లు ఒక ఇల్లనిపించుకుంటూ కలకలలాడింది. సునంద అందమంతా మళ్ళా మొహంలో తాండవించింది. మళ్ళా వారికిద్దరికీ తాము 'దంపతులమ'ని జ్ఞాపకం వచ్చింది.

సునంద బజారెళ్ళి రకరకాల పట్టు పరికిణీలు కొనుక్కువచ్చి ఇంట్లోనే మిషన్ పెట్టించి కుట్టించింది. తొడుక్కుంటుంటే చూసి సంతోషించింది. ఇక నగలు తనవన్నీ తీసి అమ్మడికే పెట్టింది. అమ్మడు కూడా వస్తుతః చాలా బుద్ధిమంతురాలైన పిల్ల, అణిగి మణిగి ఉండేపిల్ల. అనాథశరణాలయంలో ఉన్న క్రమశిక్షణంతా వంట పట్టించుకున్న పిల్ల. తన చదువేదో తను చదువుకునేది. తన గుడ్డలు తను ఉతుక్కునేది.

శ్రీధరానికప్పుడు అర్థమవుతోంది. ఇన్నాళ్ళూ ఏ ఆనందాన్ని తాను గోల్పో

యాడో, జీవిత మాధుర్యం ఎక్కడ ఉందో !

రెండేళ్ళలో మంచి పోషణ మంచి శిక్షణలతో అమ్మడు మరింత అందంగా తేలి ఎదుగుతున్నది. తల్లిదండ్రుల కన్నులకు విందుగా ఇంట్లో తిరుగుతున్నది.

అనురాగాన్ని తిరిగి సంపాదించుకోవాలంటే తన అనురాగాన్ని పంచి ఇవ్వటమే మార్గం. శ్రీధరం దంపతులు తమ అనురాగాన్ని అలా పంచి పెట్టారు. అమ్మడి ప్రేమాభిమానాల్ని అలాగే సంపాదించుకున్నారు. ఆ ఏడాది, రెండేళ్ళలో పెంపుడు కూతురన్న విషయమే తాము మరచిపోయారు. ఊళ్ళో వాళ్ళూ మరచిపోయేట్లు ప్రవర్తించారు.

తమ కన్నకూతురు తప్పిపోయిందనీ, ఏళ్ళకొలదీ కాలం గడిచిపోయిన తర్వాత తిరిగి అదృష్టంకొద్దీ దొరికిందనికూడా దంపతులిదరూ మరచిపోయిన తర్వాత రాముడితోగూడా అమృత తల్లిదండ్రుల్ని వెతుక్కుంటూ ఆ ఊరొచ్చింది. ఆ మహారణ్యంలాంటి పట్టణంలో తల్లొక మూల, పిల్లొక మూల. తల్లిదండ్రులు పెంపుడు కూతురుతో కారులో మహోల్లాసంగా తిరుగుతుంటే 'పిల్ల'రాముడితో వీధుల వెంట బొమ్మలాట లాడుతోంది. ఆర్నెల్లిలాగే గడిచింది. రెలు పట్టాలాగే జీవితాలు సమాంతర రేఖలేనేమో.

ఒక రోజున రాముడు పాట పాడుతుంటే అమృత ఆడుతుంటే కారులో సునంద వచ్చి ఎదురుగుండా పూలకొట్టు దగ్గిర ఆగింది. అమృత తల్లిని చూడగానే గుర్తు పట్టింది. ఆట ఆపి కారువైపు పరుగెత్తింది "అమ్మా అమ్మా" అంటూ. ఆశ్చర్యపడుతూ రాముడూ పరిగెత్తాడు. ఇద్దరూ కారు దాకా పరుగెత్తే సరికే, కారు కదిలి వెళ్ళిపోయింది.

ఈ పట్టణంలో అటువంటివి ఎన్ని కారులో మరోసారి గుర్తించటానికి ! ఇప్పుడే ఆ కారు వెంటపడాల్సిందేనని నిశ్చయించాడు రాముడు, ఆపూట ఆట వసూళ్ళు పోయినా సరే.

ఇద్దరూ ఆ పట్టణ వీధిలో కారువెంట పరుగెత్తారు. అదృష్టం కొద్దీ ఎదురయిన రోడ్డు ప్రమాదాలు తప్పిపోయినాయి. అదృష్టం కొద్దీ కారు కొంత నెమ్మదిగా వెళ్ళింది. అదృష్టం కొద్దీ శ్రీధరం ఇంటి ముందే ఆగింది.

"అమ్మా అమ్మా" అంటూ లోపలికి పరుగెత్తిందమృత.

"ఎవరీ పిల్ల !"

వెనకనే అమ్మడు నిలిచి వుంది.

"ఎవరా పిల్ల !"

ఈ హడావుడి విని, శ్రీధరం హాలులోకి వచ్చాడు.

"ఎవరా పిల్లా, పిల్లాడూ?"

తల్లి తననే గుర్తించలేదని అమృతకు అర్థమయ్యే సరికి చాలా సేపు పట్టింది. అందరి మొహాల్లోనూ సంభ్రమాశ్చర్యాలే! అందరి మనసుల్లోనూ సందేహ సందోహాలే.

"అవునా కాదా?" అన్న అనుమానాలే !

శ్రీధరమే తిరిగి అడిగాడు.

"ఎవరు మీరు ?"

"ఈ అమ్మాయి మీ అమ్మాయేనండీ! ఇన్నేళ్ళూ మిమ్మల్ని వెతుక్కుంటూ తిరుగుతున్నాం."

"నువ్వెవరు"

"నేనా ? నేనూ... నేనే ఆవేళ... మీ అమ్మాయి రైలుదిగుతుంటే చూశాను.


చతుర ... లిలి

అప్పట్నించీ... మీ కోసం..." బోలెడంత కథ చాటభారతం అంతా ఒక్కమాటలో ఒక్క వాక్యంలో చెప్పటం ఎలా? ఆ ప్రయత్నంలో రాముడు తెగతడబడ్డాడు.

తనకు తల్లీ తండ్రీ బాగా జ్ఞాపకమే. కాని ఇంత అవస్థపడి అదుర్దాగావస్తే తననే గుర్తించలేదు. ఈ తల్లీ, ఆ తండ్రీ. అవమానంతో కాబోలు అమృత తల వంచుకుంది.

శ్రీధరానిక్కూడా అంతా జ్ఞాపకం వచ్చింది. ఆవేళ 'అత్తిలి'లో దిగి ఈతని తల్లిదండ్రుల్నేనా తాము చూసింది!

"ఆ అమ్మో! మరచిపోయా...చిన్నప్పుడు నీ మెళ్ళో గొలుసు నీ దగ్గరే ఉందిగా. తీసి చూపించు"

అమృతకి ఆ గొలుసు సంగతి జ్ఞాపకం వచ్చింది. గబగబ పరికిణీ దిగలాగి, గుడ్డపీలికలో మూటకట్టి మొలకు చుట్టిఉన్న పొట్లం ఊడదీసింది. పొట్లం మట్టి గట్టుకుపోయివుంది. పదేళ్ళ



కింద మూటగట్టినట్లే గొలుసు. అదే ఆ వేళ అమృతకి సునంద చేయించిందే సందేహం లేదు. కాని ఈ అమ్మాయి అమృతేనా!

సునంద మరోసారి అమ్మడిని దగ్గరకు తీసుకుంది. రాముడూ, అమృతలవి ఇద్దరి మాటలూ చాలా అమాయకంగా వున్నాయి. నటనలాగా లేవు ఎక్కడా. శ్రీధరం అడుగుతుంటే రాముడు తన తల్లిదండ్రుల నిద్దర్నీ చక్కగా వర్ణించి చెప్తున్నాడు. ఆ సర్కార్ ఎక్స్‌ప్రెస్‌ను వర్ణించి చెప్తున్నాడు చివరికి 'వేంద్ర' స్టేషన్‌లో 'ఫోన్' విన్న సంగతి కూడా చెప్తున్నాడు.

నమ్మకమయితే కుదురుతోంది గానీ నమ్మేదెట్లా? పుట్టుమచ్చల్లాంటి వేరే గుర్తులేవీ అమృతకి లేనూ లేవు. సునందకు అటువంటివేవీ గుర్తు రావటమూ లేదు.

దంపతులిద్దరూ ముందరిద్దర్నీ అన్నాలు తినమన్నారు. తర్వాత ఆలోచించుకున్నారు. చిన్నప్పుడు తను చూసిన తన తల్లిగారి పెళ్ళి ఫొటో జ్ఞాపకం చేసుకుంది సునంద. తన తల్లి పోలికలొక్కొక్కటే జ్ఞాపకం వస్తున్నాయి. అవే కళ్ళు! అదే వయసులో అదే పోలిక! అంతా తన తల్లే!

సునంద ఆనందం పట్టలేకపోయింది. "అమృతా, అమృతా" అంటూ ఏడుస్తూ వంటింట్లోకి వెళ్ళి కావలించుకుంది గట్టిగా. ముద్దు పెట్టుకుంది. ఇద్దర్నీ చూసి రాముడూ, అవతల అమ్మడూ తెల్లబోయి నిలిచిపోయారు ఎక్కడ వాళ్ళక్కడ. తొలిగి విడిన తర్వాత చూస్తే సునంద శుభ్రమైన చీరనిండా అమృత వంటి బట్టలనున్న ఎర్రమట్టే! అమృత అది గమనించి సిగ్గుపడింది. సునంద అది చూసుకున్నా లక్ష్య పెట్టలేదు. భోజనానంతరం అమ్మడు తీసికెళ్లి అమృతకి తలారా స్నానం చేయించింది. ఆతర్వాత అన్నీ తన బట్టలే కట్టబెట్టింది. తర్వాత తన మెళ్ళో నగలే తీసి అమృత మెళ్ళో వేసింది.

ఇంత సేపూ హాల్లో శ్రీధరం ముందే నేలమీద కూర్చున్నాడు రాముడు. సాధ్యమయినంత వివరంగా తమ కథంతా చెప్తున్నాడు.

కథ విన్నకొద్దీ నమ్మకం కలిగింది శ్రీధరానికి. ఆకథంతా వింటూ హృదయం కరిగిపోతుంటే, కన్నీరు మున్నీరైపోతూ కూర్చుంది సునంద.

ఆ కథంతా విన్నకొద్దీ నమ్మకం ముదిరిపోయింది దంపతులిద్దరిలోనూ.

కథ కొంతవరకూ తనూ విని లోపలికెళ్ళింది అమ్మడు. అక్కడ పక్క మీద పడుకుని వుండిపోయింది. శ్రీధరం అమ్మడు వెళ్లటం గ్రహించాడు. కాసేపాగిన తర్వాత ఏదో అనుమానం కలిగి వెనకనే లేచివెళ్ళాడు. అమ్మడున్న గదిలోకి వెళ్ళాడు. అమ్మడు పడుకున్న పక్కమీదే కూర్చున్నాడు. అమ్మడాయన్ని గుర్తించి వెక్కి వెక్కి ఏడవసాగింది. నిండు గుండెల్లో ఆమెను దగరకు తీసుకున్నాడు శ్రీధరం. అంతలోనే సునంద వచ్చిందక్కడికి.

"ఎందుకమ్మా దుఃఖం !"

"మీ అమ్మాయి వచ్చిందిగా ! ఇక నేను..."

"అదేం మాట!" అన్నాడు శ్రీధరం.

"దేముడు ఒక్క కన్నే ఇచ్చాడనుకో! అదే భాగ్యమని సంతోషించాలి. రెండో కన్ను కూడా ఇస్తే వద్దంటామా?" అంటూ తనూ దగ్గర కూర్చుంది సునంద.

"మూడో కన్ను ఇస్తే మాత్రం బహు సంబామా?" అంటూ ఓదార్చాడు శ్రీధరం.

తర్వాత ఆ రాత్రి పొద్దుపోయేదాకా అందరూ కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు తృప్తిగా. కష్టాలన్నీ తీరిన తర్వాత తలుచుకోవటం, చెప్పుకోవటం సరదాగానే ఉంటుంది. ఒక్కోసారి గర్వంగా కూడా ఉంటుంది. వేరొకసారి మనసులో నాటకం చూసినట్లుంటుంది.

అందరికంటె ముందు ఆ వేళ రాముడికే నిద్ర వచ్చింది. కబుర్లు చెప్పటాన్ని అమృతకే వదిలేసి రాముడు "నేనిక పడుకుంటున్నా" నంటూ అక్కడ కింద పరచి వున్న తివాసీ మీదే నిద్ర పోయాడు.

తర్వాత ఎప్పుడో అమ్మడూ 'అమృతల నిద్దర్నీ "వెళ్లి మేడ మీద గదిలో పడుకోమ"ని సునందా వెళ్లిపోయింది తన గదిలోకి. అమ్మడు తీసికెళ్లి అమృతను తన పక్కమీదే పడుకోబెట్టుకుంది. ఏవో కబుర్లింకా సాగుతూనే ఉన్నాయి. అమ్మడు తన కథ చెప్పింది. అమృత ఆ కథా విన్నది. తన కథ చెప్తూ ఎప్పుడో కళ్ళు మూసుకుని నిద్రపోయింది అమ్మడు. అందరిలోనూ అమృతకే నిద్రపట్టలేదు.

ఇంత మంచి దుప్పటి మీద పడుకుంటే మాసిపోదూ ?

ఇంత మెత్తని పరుపు మీద నిద్దెట్లా పడుతుందో! పైన పంకా ఏమిటి పాడు· హాయిగా ఆరు బయట పడుకోక! ఖర్మ. ఈ పదేళ్ళ బట్టీ ఇల్లా నిద్రపట్టక కొట్టుకోవడం ఎప్పుడూ లేదేమొ !

ఏ కాలవ గట్టునో, గుడి ముందో, పంతెన కిందో అలా పడుకోగానే ఇలా నిద్ర వచ్చేది. వెధవదిక్కడ...? ప్రక్కనే ఉన్న అమ్మడు హాయిగా నిద్ర పోతోంది. ఇల్లంతా గుయ్యారంగా బిక్కు బిక్కు మంటూ ఉంది. అమృత ఎప్పుడు లేచి వెళ్లిందో వెళ్ళింది. చీకట్లో తడుముకుంటూ మేడ మెట్లు దిగింది. నెమ్మదిగా వెళ్ళి రాముడు పడుకున్న తివాసీ మీదే తనూ పడుకుంది. అప్పటికీ నిద్ర పట్టక పోతే, కాళ్ళెత్తి రాముడి మీద వేసింది. హాయిగా అప్పుడు నిద్రపోయింది. ఇంట్లో తలుపులన్నీ వేసి వున్నాయేమో ఎప్పుడు తెల్లవారిందో తెలియనే లేదు.

ఇద్దరూ కళ్ళు తెరిచేసరికి శ్రీధరం, సునంద, అమ్మలూ, మరో పని మనిషి, డ్రైవరూ వీళ్లిద్దరి వంకా చూస్తూనే నిలబడి ఉన్నారు. రాముడు కాస్త కంగారు పడ్డాడు గానీ, అమృత కదేంలేదు. చాలా సేపు కళ్ళు నులుముకుంటూనే వుంది.

శ్రీధరానికి ఏదేదో కళ్ళముందాడింది. చేయాల్సిన సంస్కారం తలంటి పోయటంతోనే సరిపోలేదు ఇంకా చాలా ఉందన్న మాట.

ఆ సంగతి సాయంకాలానికే అందరికీ అర్థమయింది. అమ్మడు కాఫీ తెచ్చిఇస్తే "ఇదేం బాగాలేదు. నాకు వద్దు. చద్దన్నం లేదా ?" అని అడిగిందమృత. 'స్నో' అంటే ఏమిటో తెలియదు. 'పౌడర్' అంటే ఏమిటో తెలియదు. చెప్పులు వేసుకోవటం, నడవటం, ఏమీ తెలియవు. ఆఖరికి మర్యాదగా మాట్లాడటం కూడా తెలియదు.

శ్రీధరం చాలా ఆలోచించాడు. ముందీ పాత పరిచయాల్ని మరచిపోతేగానీ కొత్త అలవాట్లు కావు. లేకపోతే రోజూ వెళ్లి ఆ రాముడి ప్రక్కనే... రాముడింత వరకూ చాలా మేలే చేశాడు. ఇంకా




ఇక్కడే ఉంటే ఆ మేలే కీడు' కావచ్చు ఏదైనా అతనిక్కడ వుండటం అనవసర మింక అనుకున్నాడు శ్రీధరం.

రాముణ్ని సాయంత్రం తనతోబాటు కూర్చోబెట్టుకుని కులాసాగా కబుర్లుచెప్తూ "ఇక మీద నువ్వేం చేస్తావ్?" అని అడిగాడు.

"నాదేముందీ! నేనింకా ఏమీ అనుకో లేదు. ఏదన్నా ఉద్యోగం చేసుకుంటా?"

"అలా ఎందుకు? మీ అమ్మానాన్నల దగ్గర కెళ్ళరాదూ."

"వెళ్ళచ్చు. కానీ...పదేళ్ళు అయి పోయినట్లుంది! ఇక్కడలాగానే నన్ను మాత్రం గుర్తు పడ్తారా అని?"

"గుర్తు పడ్తారు. నువ్వక్కడికే వెళ్లు. కొడుకు తప్పిపోయాడని వాళ్ళు చాలా బాధపడ్డారావేళ. ఇప్పుడు మాలాగే చాలా సంతోషిస్తారు..."

"అలాగే. వెళ్తాను. ఆ ఊరి పేరు 'అత్తిలి'. దాని కెళ్ళటానికి ఏ రైలు ఎక్కాలోగానీ...ఆ వూరి పేరు మాత్రం అత్తిలే!"

"ఏ రైలు ఎక్కాలో, ఎలా వెళ్ళాలో అంతా నేనుచెప్తానులే ఫర్వాలేదు.నువ్వెళ్తా నంటే రేపే ఏర్పాటు చేస్తాను."

"ఓ! వెళ్తాను. రేపే ఏర్పాటు చెయ్యండి. ఆలస్యమెందుకూ?" శ్రీధరం ఈ వ్యవహారం తేలిగ్గా సమసిందని బాగా సంతోషించాడు. అప్పటికప్పుడు తీసు కెళ్ళి నాలుగు జతలు బట్టలు కుట్టించాడు. మర్నాటికి టిక్కెట్టు కొని ఇచ్చాడు. మర్నాడు అయిదు వందల రూపాయలు చేతిలో పెట్టి వెళ్ళి రమ్మన్నాడు.

అంతవరకూ బాగానే వున్నాడు రాముడు. అందరికీ కబుర్లు చెప్పాడు. హుషారుగా కనిపించాడు. తీరా వెళ్ళే టప్పుడు కన్నీళ్లు పెట్టుకున్నాడు.

"ఇంతవరకూ మీ దగ్గర ఇంత వైభో గంగా పెరిగి పెద్దదవ్వాల్సిన పిల్ల నాతో తిరిగి ఎంతో అవస్థ పడింది! ఇక సుఖ పడ్తుంది. చదువుకుంటుంది. పైకొస్తుంది. పెళ్ళి చేసుకుంటుంది. నాకంతే చాలు. కాని నాదొక్కటే కోరిక వుంది. మీరు..."

"ఏమిటో" చెప్పమన్నాడు శ్రీధరం.

"ఏడాది కొక్కసారన్నా వచ్చి 'అమ్మా'ని చూసి వెళ్తాను. నాకు ఆ వరం ఇవ్వండి" అన్నాడు కన్నీళ్ళతో రాముడు.

"దానిదేముంది అలాగే" అన్నా రందరూ కన్నీళ్ళతోనే.

అమృత, అమ్మడూ రైలు స్టేషన్ దాకా వెళ్ళి రాముడికి వీడ్కోలిచ్చారు కన్నీళ్ళతో.




రెండు మూడు నెలల్లో అమృత రూపు రేఖలు మారిపోయాయి. వేషమూ మారింది. భాషకూడా ఫర్వాలేదు. అలా అన్ని మాటాలనే శ్రీధరం అమృతని అమ్మలుకు జతకలిపి తిప్పుతున్నాడు. ఇద్దరూ కలిసి షాపింగ్‌లకీ, సినిమాలకీ, క్లబ్‌లకీ, పార్కులకీ తిరగటం ఆరంభిం చారు. కారుంది,డబ్బుంది, తిరగటానికి హైదరాబాద్‌లో కావల్సినన్ని ప్రదేశా

లున్నాయి. అమ్మలు వెంట తిరుగుతూ హైదరాబాద్‌లో అమృత నాగరికత అంతా నేర్చేసుకుంది. మాట తీరు మారటానికి మాత్రం చాలా తంటాలు పడాల్సి వచ్చింది. ఎక్కడన్నా యాస పలుకుతున్నా అదొక 'ఫాషన్' అనుకున్నారంతా. అమృతకు కొందరు ఫ్రెండ్స్ ఏర్పడ్డారు. వాళ్లు అమృత మాటలో 'యాస'ను అనుకరిస్తున్నారు గూడా

కాని పదహారేళ్ళుగా చదువుకోవల్సిన చదువు కొద్ది నెలల్లో, రోజుల్లో నేర్చుకోవటం కష్టమే. చెప్పటం కూడా కష్టమే. ఇంట్లో అమ్మలు అమృతను కూర్చోబెట్టి అక్షరాలు దిద్ది చెప్పటం మొదలుపెట్టింది. ఆర్నెల్లయింది. బయటకెళితే పెద్ద చదువున్నట్లు పోజు. ఇంట్లో అక్షరాలు దిద్దుకోటం. వసుత: తెలివైన పిల్లగనక, లోకజ్ఞానం అదివరకే వున్నది గనక అమృత ఈ రెండు పాత్రలూ దివ్యంగానే నిర్వహిస్తోంది.

ఆరు నెలలు తిరిగేటప్పటికే ఇంట్లో అమృత చాలా తెలివిగల పిల్లని రూఢి అయిపోయింది. ఊళ్ళోనూ, మహిళా మండలి లోనూ చురుకైన పిల్లఅని పేరు పడింది. సుగుణాలతోబాటు అవగుణాలు గూడా బయటపడ్డాయి.

ఆవేళ మహిళా మండలి వార్షికోత్సవం జరుగుతోంది. ఆ ఉదయం నుంచి సాయంకాలం దాకా అమృత అక్కడే వుంది. తెరలు కట్టడం దగ్గర్నుంచీ తనే చేసింది. నిచ్చెనల్నీ తనే ఎక్కింది. అన్నింటికీ తనే పరుగులు తీసింది. ఆ సాయంత్రానికి అం ద రూ అమృత గొప్ప సోషల్ వర్కర్‌గా పేర్కొనటం ప్రారంభించారు

గూడా. నిజానికి వద్దుగాక వద్దని శ్రీధరం నిరాకరించటంవల్ల గాని లేకపోతే ఆవేళ ప్రోగ్రామ్‌లో తన 'వీధి డాన్సు' పెట్టించేదే.

'ఇంగువ కట్టిన గుడ్డ జనం ఇట్టే పట్టేస్తారని' శ్రీధరం "వద్దుగాక వద్ద"న్నాడు. తక్కినవాళ్ళు అదే మాటన్నారు. సరే అందరూ కాదంటున్నారని అమృత విరమించుకుంది. కాని ఆవేళటీ పార్టీలో ఈ ఇంగువ కట్టినగుడ్డ చేతులూరుకోకుండా బయట పడింది.

ఎప్పుడూ మహిళామండలికి రాని సభ్యులు కూడా 'వార్షికోత్సవాలు' లాంటి వాటికొస్తారు. ఆ వేళ వీలైనంత పెత్తనమూ వారే చేస్తారు కూడా. కొందరికది సరదా. అలాంటి మహిళే మహాలక్ష్మమ్మ గారు. స్థూలకాయస్థురాలు. పెత్తనం చేస్తూ బొద్దయిన బొంగరంలాగా అన్ని బల్లల చుట్టూ ఆమెగారే తిరుగుతోంది. తన చుట్టూ తను తిరగటంకాక, అలా తిరుగుతూ అందరికీ అన్నీ అందాయోలేదో చూస్తోంది. తన దగ్గర వాళ్ళందరినీ మరీ బలవంతం చేస్తోంది. ఆమెగారి ప్రవర్తన చూస్తే అందరికీ నవ్వూ వచ్చింది. వేళాకోళం అయింది కూడా. అందరితోబాటు అమ్మలుకీ, అమృతకీ, తక్కిన స్నేహితురాళ్ళందరికీ అందరూ తలా ఒక మాటా అంటున్నారు– మొదట్లో సర్మగర్భంగా, తర్వాత సూటిగానూ.

"నిన్న సర్కస్‌కి వచ్చావుటే"అందో అరవింద.

"ఆ వచ్చా! దాంట్లో గున్న ఏనుగు సంగతేనా? చూశా" అంటూ జవాబిచ్చింది ఒక చతురానన.

"ఆగండి. తొందర పడకండి. వాళ్ళాయన త్వొందరలోనే ఒక సినిమా తియ్యబోతున్నాడు. దాంట్లో హీరోయిన్‌గా...?

 

"అలాగా. 70 యం. యం. తీయమను. లేకపోతే స్క్రీన్ చాలక యిబ్బంది పడాలి" అమృతకు తెగ మాట్లాడే అలవాటు తప్పిందిప్పటికే. అందరితోబాటు జోకులు తనూ వెయ్యే లేదు. కాని పాత అలవాటు... చేతులు దురదపుట్టడం మొదలుపెట్టాయి. తగ ట్టుగా ఎదురుగుండా ప్లేట్లలో 'వాంగీ బాత్' నిండుగా కన్పిస్తోంది.

అక్కడకి బాగుండదని సందేహిం చింది. తర్వాత అల్లరి అవుతుంది అని వెనక్కిదీసింది. అయినా ఆ అలవాటు ఆ మనోవైకల్యం, ఆ కుక్కతోక అలాం టిది. ఎవ్వరూ కనిపెట్టలేదు. ఒక్క అమ్మలు తప్ప. వాంగీబాత్ ప్లేటు లేచింది. ఎగిరివెళ్ళింది. మహాలక్ష్మమ్మగారి వీపుమీద వాలింది.

"ఏమిటేమిటి?" అన్నారు ఒక్క సారిగా అందరూ. చాలా మంది నవ్వలేక మింగేశారు. మిగిలిన వారికి కోపమే వచ్చింది.



"ఎవరు విసిరేశారంటే ఎవరన్నారు" ఎవరో కొందరు.

"ఎవరయినా చాలా కొంటె చేష్ట. చెయ్యరాని పని" అంటూ అందరూ అనామతుగా నానా మాటలూ అన్నారు. ఆ తర్వాత ఒక్కొక్కరే వెళ్ళి మహా లక్ష్మమ్మను పరామర్శించారు.

ఇంటికి వెళ్ళే దోవలోనూ, ఇంటి దగ్గరా కూడా అమ్మలు ఈ కొంటె పనిని గురించి ఎవ్వరికీ చెప్పకూడదనే అనుకుంది, చెప్పలేదు కూడా. కానీ ఆ మాటలు రానే వచ్చాయి. భోజనాల దగ్గర. కథ అంతా విని సునంద శ్రీధరం నిర్ఘాంతపోయారు. అమృత చిన్నపిల్లా, చితకపిల్లా కాధాయె! ఇది అర్థం లేని అల్లరాయె!

"ఏమిటమ్మా ఈ పని? ఎందుకు చేశావలా?"

"నలుగురూ ఏమంటారు ఇది వింటె" ఇద్దరూ నాలుగు విధాలా అడిగారు గుచ్చి గుచ్చి అమృతను.

దేనికీ సమాధానం చెప్పలేదు అమృత. అన్నింటికీ మిడిగుడ్లే సమాధానం. పొంగి వస్తున్న దుఃఖాన్ని మింగి వేస్తూనే ఆ గుటకలతోనే ముద్దలు మింగింది.

''ఇంక ఎప్పుడూ ఇట్లా చెయ్యకూడ" దని ఒట్లు వేసుకుంది, లోలోన పదిసార్లు. కాని చేతులు వూరుకునేదెలాగంటూ విల విలలాడింది. భోజనాలయ్యాక తన గదిలో కెళ్ళి చేతిని తలుపు సందున ఇరికించి నొక్కి వేసుకుంది. అప్పుడే అమ్మలు లోపలికి రావటం వల్ల గానీ లేకపోతే...

అమ్మలడ్డం పడి ఆ ప్రయత్నం ఆపింది. తర్వాత ఆ చేతులే పుచ్చుకుని బతిమాలుకుంది. ఆ పైన తన మీద ఒట్లు వెయించుకుని నిద్రపుచ్చి నిద్రపోయింది.

కాని వారం రోజులుందోలేదో మరొక పెద్ద దుర్గుణం బయటపడింది.

ఆ వేళ అమృత అమ్మలుతో బాటు గాజుల షాపుకెళ్ళింది. ఇద్దరూ కలిసి రక రకాల గాజులు తీయించారు. కళ్ళ సరదా తీరే వరకూ చూశారు. తర్వాత రెండు డజన్లు ఫాన్సీ గాజులు పాక్ చేయించి తీసుకున్నారు. తర్వాత బజారంతా తిరిగి తిరిగి కాళ్లు నొప్పులు పుట్టిన మీదట ఇంటికొచ్చారు. తర్వాత చూస్తే గాజుల పాకెట్ లోనే మరో రెండు జతల చెవి రింగులున్నాయి. ఏదో పొరబాటున ఆ షాపువాడే పడేశాడేమో ! అనుకున్నది అమ్మలు మొదట. కాని అమృత హాండ్ బాగ్‌లో చూస్తే మరి రెండు రకాల రింగులూ, మరి నాలుగు హెయిర్‌పిన్నుల పాడ్‌లు, మరో తిలకం సీసా, మరో పౌడర్ పాడ్... !

"ఇవన్నీ ఎక్కడివి?'' అంటే సమాధానం మళ్ళా ఆ మిడిగుడ్లే. ఆ బుంగ మూతే!

"ఈ విషయం నాన్నగారికి తెలిస్తే ఇంకేమన్నా వుందా ?" అంటే ఆ పత్తి కళ్ళు ఉత్తి నీరజాలయ్యాయి.

ఆ బుంగ బుగ్గలు నీట మునిగిన రోజా మొగ్గలయ్యాయి. 'నాన్నగారికి ఈ విషయం చెప్పన్లే' అంటూ ఓదార్చింది అమ్మలు. వెనువెంటనే మాత్రం వెనక్కి తిరిగి వెళ్ళి పొరబాటున ఇవన్నీ మా పాకెట్‌లో పడ్డాయని చెప్పి అన్నింటికీ డబ్బిచ్చేశారిద్దరూ.

'అలాగా'అన్నాడా షాపు యజమాని. చిరున పైకి లేచాడు. చిరున షాపులో కెళ్ళి పాక్ చేసిన కుర్రవాణ్ని జుట్టు పట్టు కుని నాలుగు బాదాడు— సోదరీమణుల




కళ్ళెదుటే.

నడిచి ఇంటికి వస్తూ దోవలో "చూశావా! నీవల్ల పాపం ఆ షాపు కుర్ర వాడు దెబ్బలు తిన్నాడు!" అన్నది అమ్మలు.

"మనం తీసికెళ్ళి వాపసు ఇవ్వకుండా వుంటే ఈ దెబ్బలు వాడికి తగిలేవి కావుగా!"

"కాని ఈ విషయం ఇవ్వాళ కాక పోతే రేపు ఫలానా వారమ్మాయి ఇలాంటి దంటారుగా! మనకు గాదు. నాన్నగారి పేరు బయటకొస్తుంది. అది మర్యాదగా ఉంటుందా?"

"ఉండదు" మెదలకుండా ఒప్పు కుందమృత.

"పోనీ అవ్వేమంత ఖరీదు! అమ్మాత్రం కావాలంటే నాన్నగారు కొనిపెట్టనం టారా? కావాలంటే బంగారమే కొని పెడతారుగా!"

"నిజంగా బంగారం కొనిపెడతారా?"

"కావాలా?"

"కావాలి."

"మరి నాన్నగారితో చెప్పు''

"అమ్మో!"

"సరే: భయమయితే నేనే చెప్తాలే"

ఇద్దరూ ఆ పూట యింటికి వచ్చారు. ఆ పూట కాదు కాని ఆ మన్నాడు మళ్ళా భోజనాల దగ్గర అమ్మలు శ్రీధరానికి చెప్పింది.

"నాన్నగారూ! అమృతకి బంగారు చెవిరింగులు కావాలిట!"

అడిగింది తడవుగా భార్యాభర్తలిద్దరూ గొల్లున నవ్వారు. ఆ కిందటి రాత్రి ఇద్దరూ అనుకున్నట్లున్నారు - రెండు రోజుల్లో ఇద్దరికీ చెవి రింగులు చేయిద్దామని.

ఆ నవ్వులకి తెల్లబోయిన కూతుళ్ళి ద్దర్నీ చూసి "అల్లాగే సాయంత్రం 'చెల్లారాం షాపు' కెళ్దాం సరేనా" అన్నాడు శ్రీధరం.

"చెల్లారాం షాపుకి కాదు; ఫ్యాన్సీ కంగన్ షాపుకి."

"ఆ షాపులో బంగారంవి వుండవు.

"కాని నాకు ఆ షాపులోవే కావాలి; అవ్వే బాగున్నాయ్."

అందరూ గొల్లున నవ్వారు.

వాళ్ళిలా నవ్వేసరికి అమృత ముందు తెల్లబోయింది. ఆ వెను వెంటనే బిక్కమొహం పెట్టి ఏడవబోయింది.

"ఏమిటో, ఎప్పటికి పిల్ల మామూలు ప్రపంచంలో పడ్తుందో" అని నిట్టూ ర్చాడు.

వయసు వల్లనో, అప్పటికే ప్రపంచ జ్ఞానం కొంత వుండటం వల్లనో చదువు మాత్రం అమృతకు నల్లేరు మీద నడక. ఒకసారి చదివితే మళ్ళీ చదవనక్కర్లేదు. అంతా ఇంటి దగ్గర ప్రయివేటుగానే సాగింది. ఆ ప్రయివేటు మాష్టరు గూడా నాలుగేళ్లల్లో మెట్రిక్‌కు కూర్చోబెడతా నన్నాడు.

* * *

రాముడు దోవలో కొంత తంటాపడ్డా మొత్తానికి స్వగ్రామం చేరాడు. ఊళ్ళో దిగగానే తెలిసింది అయిదారేళ్ళ క్రిందటే తండ్రి చనిపోయాడని. ఇంటికెళ్ళగానే తల్లి గుర్తించలేదు గానీ గుర్తించిన తర్వాత మొహం చాటంత చేసుకుంది. తండ్రి పోయిన తర్వాత బీడీల కొట్టు పెట్టుకొని కాలక్షేపం చేస్తోంది. కొడుకు ఒట్టి చేతుల్తో ఇంటికి రాలేదు. నాలుగైదు వందలతో తిరిగి వచ్చాడు. కనుక ఇక నంతా నిర్విచారమే.

కొడుకు కొత్త సరుకు తెచ్చి సర్ది పెట్టుకుని కొట్టుమీద కూర్చుంటే ఆ పూట నుంచే తల్లి కొడుక్కి ఊళ్ళో సంబంధాలు వెతకటం ప్రారంభించింది. స్వంత స్థలం వుంది. స్వంత వ్యాపారం ఉంది. పిల్ల నివ్వటానికేం? ఎవరన్నా ఇస్తారు. కట్నం ఇచ్చి మరీ పెళ్ళి చేసారు.

ఏడాదిలో రాముడి వ్యాపారం బాగానే నిలబడింది. వాడి సరదా మాటలూ, లోక జ్ఞానం వ్యాపారంలో గూడా బాగా ఉపయోగించాయి. అప్పటికే ఊళ్లో అందరికీ తల్లో నాలుకయి పోయాడు. వ్యాపారం కూడా తదనుగుణంగానే సాగుతోంది.

పదిరాళ్లు చేతిలో దొర్లుతూ, పదిరాళ్లు పెట్టెలో మూలుగుతూ వుండేసరికి కాస్త అటూ ఇటూ తిరిగి రావాలని కుతూహలం రేగింది రాముడి అంతరంగంలో.

వెళ్ళాలి. వెళ్ళి అమృతనోసారి కళ్ళారా చూసిరావాలి. అంతస్థుల్లో పుట్టి పెరిగిన



పిల్ల ! తన పాలపడి పెరిగింది. మళ్ళా అంతస్థుల్లోకి ఎగిరిపోయింది. భగవం తుడి దయవల్ల అక్కడే వుండిపోవాలి. అక్కడే వుందా? ఇంకా అల్లరి చిల్లరిగానే ఉందా? ఎలా వుందో, ఏం చేస్తోందో !

ఓ నెలరోజుల తర్వాత కావల్సినదాని కంటె మరికాస్త ఎక్కువే డబ్బు జేబులో వేసుకుని హైదరాబాద్ వెళ్ళి వస్తానని బయలుదేరాడు.




రోజులాగే ఆపేశా అమ్మడు అమృతను తనతో బజారుకు తీసుకెళ్ళింది. ఏవేవో చిన్న చిన్న వస్తువులు కొన్నారు. అంతసేపూ అమ్మడు అమృతను కని పెడుతూనే వుంది. ఇహ ఫర్వాలేదు. ఇవ్వాళ గండం గడిచినట్లే. అమృత చేతులు దురద పెట్టలేదని లోలోన అమ్మడు చాలా సంతోషించింది.

ఇద్దరూ సరదాగా టౌన్‌హాల్‌లో నాటకం చూసి వెళ్దామనుకున్నారు. హాలులోకి వెళ్ళి కూర్చున్నారు.

ఆరోజు కృష్ణరాయబారం నాటక ప్రదర్శనం. నాటకం బాగానే నడుస్తోంది. ఔత్సాహికులు కావటంతో వేషధారణ మీద బహుశ్రద్ధ వహించారు. ఆపైన రంగాంతాలలో ఒక పోజు యిచ్చి ఫోటో తీయించుకున్న తర్వాతగానీ తెర వాలటం లేదు. మళ్ళీ ఎన్నాళ్ళకు వేషం వేస్తారో ! కనుకనే ఫోటోమీద మోజు! అదొక్కటే నాటకంలో కొంత హాస్య కారణమయింది ఫోటోల మోజు అందరికన్నా ఎక్కువగా శ్రీకృష్ణ పాత్రధారికే లాగుంది. ఆ వేషధారి బాగా పేరున్నవాడే. చక్కగా ఒక్కొక్క పద్యం పది పదిహేను నిమిషాలు పాడుతున్నాడు. కాస్త లావుపాటివాడైనా ఆ వేషానికి చక్కగా సరిపోయాడు. నాటకం రాయబారం సీనుదాకా వచ్చింది. కర్ణాశ్వత్థామ వివాద సన్నివేశం బాగా రక్తి గట్టింది. సంధి సేయించవచ్చిన శ్రీకృష్ణుడు-కర్ణాశ్వత్థామ మధ్య సంధికి పూనుకున్నాడు - పెట్టాల్సిన పెటకమంతా పెట్టి...ఇక ప్రసిద్ధిగాంచిన పద్యాల కోసం ప్రేక్షకు లంతా ఆసక్తి రేకెత్తగా వేచి చూస్తు న్నారు. ఆ పద్యాలు బాగాపాడితే నాటకం విజయవంతం అయినట్లే...శ్రీకృష్ణుడు "చెల్లియో...చెల్లకో..." అంటూ పద్యం ఆరంభించాడు. ఎక్కడి నుంచో పూలదండ వచ్చి మెళ్ళో పడింది.తర్వాత జారి కింద పడబోయిందిగానీ, ఆ శ్రీకృష్ణ మూర్తి-దాన్ని చేత్తో అందిపుచ్చుకుని ఆదరంగా కళ్ళకద్దుకున్నాడు. చిరు నవ్వుతో అందరికీ నమస్కరించాడు. ప్రేక్షకులు చప్పట్లు కొడుతుంటే దాన్ని మెళ్ళో వేసుకున్నాడు. మళ్ళా-

"చెల్లియో చెల్లకో" అంటూ సమధి కోత్సాహంతో పద్యం అందుకున్నాడు. అంతలో...మళ్ళా...

ఒక మూతలేని కొత్త పౌడర్ అట్టపెట్టె ఒకటి సరాసరి కిరీటం మీదకొచ్చి కొట్టు కుంది. మొహంమీద పౌడరంతా ఓడ్చేసి ఒట్టి పెట్టె మళ్ళా చేతిలో పడింది.శ్రీకృష్ణ

పాత్రధారి తొణకలేదు. మళ్ళీ చిరునవ్వులే ఒలకబోశాడు. వెనక్కితిరిగి మొహం మీద వాలికిన పౌడరంతా ఉత్తరీయంతో తుడుచుకుంటున్నాడు. విశాలంగానే వీపు కనిపిస్తోంది ప్రేక్షకులకు. అంతలో మళ్లా...నాజూకైన పాదరక్ష ఒకటి సర్రున ఎగిరి వచ్చింది. తకాలుస పడింది వీపుమీదే!...శ్రీకృష్ణ పాత్రధారిదేంలోపం లేకున్నా నాటకం అభాసు అయింది. ఆ తర్వాత అమ్మడు నాటకం చూడలేదు. గబగబా చెయ్యి పుచ్చుకుని అమృతను హాలు బయటకు లాక్కు వెళ్ళింది. ఓ రిక్షా పిలిచి అమృతను దాంట్లోకి తోసేసింది. అమృత రెండో కాలికున్న చెప్పు అలాగే వుండిపోయింది. తర్వాత రాయబారం నాటకం ఏమయిందోగాని ఇంట్లో ఓ పెద్ద నాటకమే అయింది.

అమ్మడు అమృత చేతులు పట్టుకుని "ఎలా అమృతా నీతో ... ఇటువంటి పనులు చేస్తుంటే నలుగురూ ఏమంటారు? నీకెంత చెడ్డపేరు, నాన్నగారికెంత తలవంపులు ! నలుగురూ ఫలానా వారి అమ్మాయి అంటారు. నువ్వేమో ఎన్ని సార్లు చెప్పినా మాట వినవాయె! మధ్య నేనెలా చచ్చేది !" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. అంతలో సునంద అటు రావటం వల్ల అమ్మలు ఆగిపోయింది. మళ్ళీ కాసేపు ఇద్దరూ మౌనవ్రతం పట్టారు. సునంద ఏమీ గమనించకుండానే ఏవో పాతగుడ్డలు తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ తర్వాత పాత గుడ్డలన్నీ స్టీలు సామానువాడికి వేస్తూ అన్నది శ్రీధరంతో

"అప్ప చెల్లెళ్ళిద్దరూ ఏదో ఘర్షణ పడుతున్నట్లున్నారు. వెళ్ళి చూసి రండి."

శ్రీధరం గూడా ఏదో అనుమానించి లేచి వెళ్ళాడు. మేడమీద అక్క చెల్లెళ్ల గది దగ్గరే నుంచుని వింటున్నాడు.

"ఏం చెయ్య నక్కా. చేతులు వూరుకోవు! ఆ శ్రీకృష్ణడి వీపు బాగావిశాలంగా వుందాయె!"

"నిజమే కానీ పర్యవసానం ఆలోచించు. ఎవ్వరూ చూడలేదు గనక సరిపోయింది. ఎవరయినా ఆ'చెప్పు' నువ్వే వేస్తున్నావని గమనిస్తే ఏమయ్యేది! నానా గోలా అయ్యేది. నలుగురూ నిన్ను నిలబెట్టి అడిగితే ఏమయ్యేది ? ఏం జవాబు చెప్పేదానివి ? ఏం చెప్పినా వాళ్ళూరుకుంటారా ?"

"అలా ఎప్పుడూ జరగలేదుగా!"

"జరుగుతుంది. జరిగేటప్పుడు మనకు చెప్పి జరగదుగా! నీకు దణ్ణం పెడతాను. ఈ అల్లరి పని మానెయ్యి. మానేస్తానంటేనే మనం ఇద్దరం కల్సి ఊళ్ళోకి వెళదాం. లేదా..."

"లేకపోతే...?"

"లేకపోతే నేనూ ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే ఉండిపోతాను".

గదిబయట వున్న శ్రీధరానికీ మాటల్లో కొంత వినిపించింది. కొంత వినిపించలేదు. ఓ సారి గదిలోకి తొంగి చూసాడు. వెంటనే అప్ప చెల్లెళ్లు ఇద్దరూ మాటలా పేశారు.ఆపైన అంతా నిశ్శబ్దమే. లోలోన నవ్వుకుంటూ శ్రీధరం వెళ్ళిపోయాడు కిందికి. కింద సునంద ఎదురు చూస్తోంది.

"ఏదో పిల్లలు! వాళ్లకి రాగద్వేషాలు వస్తుంటాయి; పోతూ వుంటాయి. ఏదో కాలక్షేపం. అది సరేగానీ... ఇక అమ్మలుకి పెళ్ళి ప్రయత్నం చేద్దామా ఏమిటి? ఈడు కూడా వచ్చేసిందిగా!"

"అమ్మలుకా! పెళ్ళా! మరి అమృతకి

తోడెవరూ?"

"అమృతకి తోడుండదు. నిజమే! కాని ఆడపిల్లలకి పెళ్ళిచేయక తప్పదుగా!"

"తప్పదు కానీ...అప్పుడేనా పెళ్ళి!"

"అప్పుడే తొందరలేదు గానీ ఎప్పటి కయినా తప్పదుగా!"

రకరకాల ఆలోచనల్లో దంపతులు మునిగిపోయారు. పిల్లల కప్పుడే పెళ్ళా అనుకుంటూ దిగులులో పడిపోయింది సునంద.

అంతలో పైన క్కొద్దిగా కేకలు వినిపించాయి. దంపతులిద్దరూ అదిరిపడి వినటానికి ప్రయత్నించారు. కాసేపయిన తర్వాత అమ్మల్ని కిందికి పిలిచి అడిగేరాు. ఎంత అడిగినా అమ్మలు అసలు సంగతి చెప్పలేదు. మాట దాటవెయ్యటమే కొనసాగించింది. చివరకు "మేమెంత అడిగినా నువ్వేం చెప్పటం లేదమ్మలూ! ఇంకా మమ్మల్ని పెంపుడు తల్లితండ్రులు గనే చూస్తున్నావా?" అన్నాడు శ్రీధరం.

గొల్లుమన్నది అమ్మలు.

"లేదు నాన్నగారూ! మేమింకా చిన్న పిల్లలం. ఏదో మాటా మాటా వస్తుంది. ఏవో అనుకుంటాం. అంతే. ఇదంతా మీరేం పట్టించుకోకండి" అంటూ పైకి వెళ్ళిపోయింది. తల్లిదండ్రు లిద్దరూ మొహ మొహాలు చూసుకున్నారు.

పైనఅంతా వింటూనే వున్నది అమృత వెయ్యి చెవులు చేసుకుని. తర్వాత చాలా సార్లు "అమ్మలు ఎంత మంచిదో" అనుకుంది.

ఆ రోజు నుంచీ శ్రీధరం అల్లుళ్ళ కోసం వేట ఆరంభించాడనే చెప్పాలి. వీధుల వెంట పోతున్నా సరే, ఆఫీసులో పని చూసుకుంటున్నా సరే, సినిమా హాలుకు వెళ్ళినా సరే పెళ్ళీడు కుర్రాడు కనిపిస్తే చాలు; ఈ కుర్రాడు అమ్మలుకు తగినవాడా కాదా అని ఆలోచించేవాడు. ఎంత తగిన వాడయితే మటుకు ఊరూ పేరూ తెలియని వాడికి కట్టబెట్టి కళ్ళు మూసుకుంటామా అని తనను తను మందలించుకునేవాడు. రోజులు, నెలలు గడచిపోయాయి ఈ వెతుకులాటలో. అలాంటి స్థితిలో ఎదురయ్యాడు శ్యామల రావు.

* * *

శ్యామలరావు మంచి టెన్నిస్ ప్లేయర్. హిందీ సినిమా హీరో లాంటి వాడు. వయసు మిసమిసంతా అతని మొహంలోనే వుంటుంది. చూడగానే ఇతను అమ్మలు లాంటి అమ్మాయికి తగినవాడనుకున్నాడు శ్రీధరం. ఆ తర్వాత అతని గూర్చి ఎంక్వైరీలు చేశాడు. ఎంక్వైరీలో అతను శ్రీనివాసం గారి పుత్రుడని తేలింది. "అబ్బో! ఆయనతో మనం తూగగలమా!" అనుకున్నాడు శ్రీధరం.

శ్రీనివాసంగారు శ్రీమంతుడు. శ్రీధరానికి తెలిసినంతలో ఆయన ఆ వూళ్ళోని పది పదిహేను వ్యాపారాలకు అధిపతి. ఊళ్ళో ఎవరి దగ్గర ఆయన పేరెత్తినా "అబ్బో ఆయనా!" అనే అంటారు. చివరకు ఒకాయన మాత్రం "శుభం... వెళ్ళి అడగండి" అన్నాడు. పైగా "మీరు వెళ్ళి అడగండి. ఆయన కాదంటే అప్పుడు సన్నదగండి" అని కూడా అన్నాడు. ఆయన నోటి వాక్యాన... శ్రీధరం వెళ్ళి అడిగితే, ఆయనగారు కాదనలేదు. శ్రీధరం లాంటి ఉద్యోగస్తుడితో సంబంధం అయినా అభిలషించిందే కాబోలు! "ముందు అబ్బాయీ,

నా భార్యా వచ్చి చూస్తారులెండి. వాళ్ళకి నచ్చితే నాకు నచ్చినట్లే" అన్నాడు.

మొత్తానికి ఒక శుభముహూర్తం పెళ్ళి చూపులకు నిశ్చయమయింది. ఆవేళ శ్రీధరం హడావిడి చెప్పనక్కర్లేదు. పదిహేను రకాల ఫలహారాలు చేయించాడు.

పెళ్ళివారు మరో అరగంటకు వస్తారనగా వచ్చినవారికి అమ్మలుతో బాటు, 'అమృతను' కూడా చూపాలా, వద్దా అనే అనుమానం వచ్చి అది చర్చగా మారింది. కూడదంటుంది భార్య.

ఫర్వాలేదంటుంది అమ్మలు.

అమృత ఏమన్నా అల్లరి చేస్తుందేమోనని శ్రీధరానికి సందేహం. ఏమైనా సరే నేనూ చూడాల్సిందేనంటుంది అమృత. పెళ్ళివారి కార్లు వచ్చేవరకూ ఈ చర్చ సాగుతూనే వుంది. ఆఖరి క్షణంలో అమృతను ఓ గదిలో పెట్టి గడియ పెట్టటానికి ఆ ఆలుమగల మధ్య నిశ్చయం జరిగిపోయింది. ఆ కాసేపూ అమృత ఆ గదిలో బందీ అయిపోయింది. పెళ్ళివారు వచ్చారు. చూశారు.

"వారు కూడా వచ్చి చూస్తారులెండి" అంటూ పెళ్ళికొడుకు తల్లి విమలాంబ పెళ్ళికొడుకుతో పాటు లేచింది.

అందరూ వెళ్ళి బయట చెట్టు కింద వున్న కారులో ఎక్కబోయే సమయంలో ఎలా బందిఖానాలోంచి తప్పించుకుందో! ఎప్పుడా చెట్టు ఎక్కి కూర్చుందో! పట్టు అకస్మాత్తుగా తప్పి సర్రున కిందికి జారి గభాలున విమలాంబ కాళ్ళ ముందు పడింది అమృత.

పదిమందీ గబగబా చుట్టూ మూగారు. ఏమిటేమిటన్నారు ఒక పెట్టున. అమృత ఎంత గభాలున కింద పడిందో అంత త్వరగానూ లేచి, పరుగెత్తుకు వెళ్ళింది. చుట్టూ మూగిన వాళ్ళలో ఒకాయన జరిగిన సంగతంతా విమలాంబకు చెప్పేశాడు. విమలాంబ చిరునవ్వులో అంతా విన్నది. చిరునవ్వుతోనే వెళ్ళి కారెక్కింది.

జరిగిన అల్లరికి ఆ రాత్రి శ్రీధరం దంపతులిద్దరూ చింతిస్తూనే వున్నారు.

మరునాడంతా పెళ్ళివారి దగ్గర్నుంచి కబురొస్తుందని ఎదురు చూస్తూనే వున్నారు. ఆ సాయంకాలానికి కూడా కబురు రాకపోయే సరికింక ఏ కబురూ రాదనే అనుకున్నారు.

కాని ఆ కబురు రెండోరోజు ఉదయం వచ్చింది.

"మీ రెండో అమ్మాయినయితే మా అబ్బాయి ఒప్పుకుంటాడుట!" అనీ, పైగా "ఆలోచించుకుని, మీరేసంగతి కబురు చేయండ"నీ. ఆ పైన...

"కట్నాల ప్రశంస ఏమీ తీసుకురావద్దు... మీరివ్వదలుచుకున్న దేమిటో ఊళ్ళో వున్న అనాథ శరణాలయానికివ్వమనీ"

ఆశ్చర్యంతో తల మునకలయిపోయారు శ్రీధరం దంపతులు. అదిగో...

సరిగ్గా అదే సమయానికి రామిగాడు ఓ రిక్షాలో దిగాడు తన సంచితోసహా. సింహద్వారం వద్ద కనిపించగానే 'రాముడూ' అని అరిచింది అమృత మేడ మీద నించి. ఆ తర్వాత రాముడున్న చోటుకు పరుగెత్తింది అమృత ఛాందసమైన మొహంతో.

అమృత పెళ్ళి అమ్మలు పెళ్ళి కంటే ముందు చెయ్యటమే మంచిదన్న నిశ్చయానికి వచ్చేశాడు శ్రీధరం. ఆ

మాటే అనేసి సందేశం తెచ్చిన వారిని వెనువెంటనే పంపేశాడు కూడా.

రాముడు ఆ రోజంతా అక్కడే వున్నాడు. పెళ్ళి అవుతున్నందుకు చాలా సంతోషించాడు. మరునాడే వెళ్ళిపోయాడు. పెళ్ళికి శుభలేఖలు సమస్తమైన వారికీ అందాయి- ఒక్క రాముడికి తప్ప. వివాహం నిజంగా, ఒక మహోత్సవంగానే జరిగిపోయింది. పెళ్ళి పీటల మీద కూడా పురోహితుణ్ణి కాస్త ఆటలు పట్టించిందమృత.

మొత్తానికి పెళ్ళి ఆడంబరంగానే జరిగిపోయింది. పెళ్ళయిన తర్వాత అమృత కాపరానికి వెళ్ళిపోయింది.




అమృతా శ్యామలరావుల వివాహంలో ఇరు పక్షాలవారూ పోటీపడి ఒకరినొకరు సన్మానించుకున్నారు. సత్కరించుకున్నారు. సునందే నిజానికి వియ్యపురాలు విమలాంబతో పోటీపడలేకపోయింది. అంత మంచి ఇల్లాలు విమలాంబ. ఒకనాటి పెద్ద జమిందారీ ఇంటి ఆడపడచు. ఆ హుందాతనం ఈనాటికీ వుంది.

ప్రప్రథమంగా అమృత అత్తవారింట్లో అడుగు పెట్టిననాడు ఆ ఇంటిని చూసే బెదిరిపోయింది. పెద్ద పెద్ద హాలులు అంతటా తివాసీలు కళ్ళు తిరిగిపోయే అలంకరణ. కన్నులు ఎన్నున్నా చాలని చిత్ర పఠాలు... శిల్పాలు... అందచందాలొలికిపోతున్న సామాను.

అమృత అత్తగారికి నమస్కరించటానికి ఆమె పూజా మందిరంలోకి వెళ్ళి దాదాపు మూర్ఛపోయినంత పనయింది. అది పూజా మందిరంగా కనిపించలేదు. అలవైకుంఠపురంబులో నగరిలో వున్నట్లే వుంది. అంత పవిత్రతతో నిండి వుందా మందిరమంతా.

దేముడికి వెండి పూజా మందిరం. తోటలో పువ్వులన్నీ ఆ గదిలోనే వున్నాయి. స్వచ్ఛమైన కంటికింపైన పులి చర్మాలూ, దీపాల తోరణాలూ, అగరు ధూపాలూ, గోడల మీద రామాయణ గాథలోని ముఖ్య సన్నివేశాల చిత్ర పఠాలూ, మధ్యలో మందిరం. ముందు అతులితమైన దైవ విశ్వాసంతో, కన్నులరమోడ్చి, తనువు మరచి తెల్లని పట్టు చీరలో విమలాంబ.

కుడి అడుగువేసి అమృత పూజా మందిరంలో ప్రవేశించింది. ఆ క్షణంలో ఏదో దిగ్భ్రాంతి ఆ చిన్న మెదడంతటినీ ఆవేశించింది. అంత పవిత్ర భావంతో నిండి వున్న పూజామందిరం ప్రపంచంలో వుంటుందా! ఇంత అందం, ఇంత పరిశుభ్రత, ఇంత మనోహరత్వం, ఇంత తన్మయత్వం అన్యత్రా సాధ్యమా ?

ఇక్కడ తనకు చోటెక్కడ! ఇంత మంది సూర్యుళ్ళు ఒక్కసారిగా వెలిగిపోతే నాకు నిలువ నీడెక్కడ! ఆ అత్తగారెక్కడ, ఈ కొంటె కోణంగి కోడలెక్కడ? ఆ అంత స్థైర్యమెక్కడ, ఆ అడుగునీడల్లో కూడా వుండ ఒదుగలేని నేనెక్కడ?



తనస్థానమేదో కనిపించక, అమృత చంచలించిపోయింది. అడుగు ముందుకు పడని అమృత అడుగు వెనక్కి వేసింది. వెనక్కి... వెనక్కి... ఇంకా వెనక్కి వేసింది. తోడ వచ్చిన అమ్మలు తరుము కొస్తున్నా ఆగకుండా వెనక్కి వెనక్కి వెళ్ళి, గిరుక్కున వెనక్కి తిరిగి పరుగులు తీసింది. గదులు దాటి, కత్తులు పుచ్చుకు బారులు తీర్చివున్న సిపాయీల్లాంటి హాలులోని స్తంభాల పంక్తులు దాటి అలిసిపోయి ఎత్తయిన సింహద్వారపు మండిగం దాటలేక ఆగిపోయింది. అక్కడే వాలిపోయింది.

అందరూ చుట్టూ చేరారు. అంతలో విమలాంబ కూడా లేచి వచ్చింది.

"అమ్మా అమృతా! ఏమయిందమ్మా" అంటూ స్వాంతన వాక్యాలు పలికింది. తల్లిలాగ మెల్లగా తల నిమిరింది. "తప్పమ్మా" అంటూ కన్నీళ్ళు తుడిచేసింది.

"భయపడకమ్మా! నేనూ మీ అమ్మ లాంటి దాన్నే. నేనూ అందరిలాగానే కొడుకును కన్నాను - పదినెలలు మోసి. మూడు రోజులు బాధపెట్టి పేగులు తెంచుకు పుట్టాడు వాడు. కాస్తనొప్పన్నా పుట్టకుండా, కన్నుల పండుగ్గా పుట్టిన

కూతురివి నువ్వు. ఆ కొడుక్కంటే నాకు కోడలే ఎక్కువమ్మా" అంటూ ఊర డించింది విమలాంబ.




శ్యామలరావు తండ్రి శ్రీనివాసంగారిని ఊళ్ళో అందరూ 'బిర్లా' కిందే పరిగ ణిస్తారు. ఆయనకాడఊళ్ళో భాగస్వామ్యం లేని వ్యాపారం లేదనొచ్చు. ఆఖరికి వడ్డీ వ్యాపారం స్మగ్లింగ్ వ్యాపారం కూడా వుంది. ఆదాయం నెలకెంతో – ఆరునెలల తర్వాత గాని తెలియదు.

శ్యామలరావుకు టెన్నిస్ ప్లేయర్ అనే గాక మంచి జల్సా పురుషుడనీ పేరుంది. మంచి కార్డు ప్లేయరనీ పేరుంది. చేతిలో డబ్బుందిగనక ఏది కావాలన్నా కొనెయ్య గలడు. అతని చేతిలో అమృత ఒక ఆటవస్తువైపోయింది. శ్రీధరం గారి లాంటి పెద్ద ఉద్యోగస్తుడి కూతురవటం వేరు–ఆ గౌరవం వేరు. శ్రీనివాసం గారి లాంటి వారి కోడలవటం– ఆ గౌరవమూ వేరు. రెండింటిలో భేదం అమృత కెక్కడి కెళ్ళినా కనిపిస్తోంది. అదివరకెక్కడన్నా మాటల్లో 'యాస'పలికితే అందరూ ఆశ్చ ర్యపడేవారు. ఇప్పుడూఅప్పటికేం అనక పోయినా, తర్వాత ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. అదివరకటి గౌరవంలో భయభక్తులుండేవి. కాని ఇప్పుడీ గౌరవం లాంఛన ప్రాయమయింది.

మొదట్లో ఇద్దరూ కలిసి వచ్చిన సినిమా కల్లా వెళ్ళారు. క్లబ్ ఫంక్షన్లకి వెళ్ళారు. టోర్నమెంట్లకి వెళ్ళారు. అయిదారు నెలలు అయిన తర్వాత ఆ ఊరికో సర్కస్ వచ్చింది. మొదటి రోజునే మొదటి వరసలోనే హాజరయ్యారు అమృతా, శ్యామలరావులు. ప్రక్కనే తోడుగా అమ్మలూనూ.

సర్కస్ సామాన్యంగానే ఆరంభ మయింది ఏనుగుల విఘ్నేశ్వరపూజా తర్వాత లక్ష్మీపూజా ఆతర్వాత చిన్నచిన్న మొగ్గలు ... డాన్సులు... ఆటలు చాలా మందికి ఆనందంగానే ఉన్నాయి. తర్వాత అమృతకే నచ్చటం మానేసింది.

"ఇంతేనా సర్కసంటే" అంది మొదట్లో...... నలుగురమ్మాయిలు సైకిళ్ళమీద వచ్చి నాలుగు రకాలుగా ఫీట్లు చేసి చివరికి సభాసదులకి వయ్యా రంగా వంగి అభివందనం చేసి వెళ్ళి పోతుంటే......

"గొప్పేలే వెళ్ళండి...వెళ్ళండన్నది." 'హుశ్' అని వారించింది అమ్మలు. అలా వారించకపోతే శ్యామలరావు పట్టించుకునేవాడేకాడేమో!

తర్వాత హారిజాంటల్ బార్...ఎంతో ఆసక్తితో చూడటం మొదలెట్టింది అమృత మొదట. కాని తీరాచూస్తే అవన్నీ ఎప్పుడో సింగన్న చేసిన మొగ్గలాటివే.

"ఆ, ఆ కష్టపడ్డావులే! ఇక వెళ్ళెళ్ళు లోపలికి అన్నదమృత. శ్యామలరావు చటుక్కున ఇటు చూసాడు. అమ్మలు చటుక్కున అమృత చెయ్యి నొక్కింది.

"అలా నువ్వు చేయగలవా?" అన్నాడు శ్యామలరావు.




అమృత నవ్వి ఊరుకుంది.

తర్వాత ఉయ్యాల మీద ఫీట్లు కాబోలు పెద్ద వల గట్టారు. నిమషాల మీద లైట్లు ఏర్పాట్లు చేసారు. ఈలోగా బఫూన్లు రకరకాలుగా ప్రేక్షకుల్ని నవ్విస్తున్నారు. అమృత అమాంతం లేచి వెళ్ళింది. 'ఎందుకో' అనుకున్నారు అమ్మలూ శ్యామలరావూ. ఉయ్యాల ఫీట్లు ఆరంభమయినాయి. అంతలోనే అమృత మరి ఇద్దరు అమ్మాయిలతో సర్కస్ 'ఎరీనా'లో ప్రత్యక్ష్యమయింది.

తక్కిన వారందరిలాగే గౌనూ-వేషం! అమృత ఆ ఇద్దరి వెనకే తాడు మీద పైకి వెళ్ళింది. వారిద్దరిమధ్యా నుంచుంది. వారిద్దరిలాగే మొగ్గలు వేసింది వారిద్దరికంటె ఎక్కువ ఉత్సాహంగా వయ్యారాలు ప్రదర్శించింది. వారిద్దరి లాగే గిర్రు గిర్రున పల్టీలు కొడుతూ క్రింద కట్టిన 'నెట్'మీద పడింది. లేచింది. ప్రేక్షకులు అభినందిస్తుంటే తనూ ప్రత్యభివందనం చేసి నిష్క్రమించింది. అంత సేపూ వూపిరి బిగపట్టుకుకూర్చుంది అమ్మలు! కాలి మునివేళ్ళమీద నిలిచి ఉన్నాడు శ్యామలరావు! అమృత మేకప్ కడిగేసుకుని రాగానే "ఇంత సేపూ ఏం చేస్తున్నావ్" అన్నదమ్మలు ఏమీ ఎరగ నట్టు. సర్కస్ మొగ్గలు నేర్చుకుంటోంది అన్నాడు శ్యామలరావు కొరకొర చూస్తూ.

ఏమీ జవాబు చెప్పలేదమృత. మళ్ళా చిన్న ప్పటి ఆ బుంగమూతే జవాబు ఆ పత్తికళ్లే సమాధానం. "ఆ ఎత్తునుంచి కిందపడితే ఏమయ్యేది !"

"కింద వల వుందిగా అందుకే..."

"కళ్లు తిరగవ్ అలా..."

"కళ్ళు తిరగటమంటే!"

"ఎవరన్నా నువ్వు శ్రీనివాసంగారి కోడలివని గుర్తుపడితే ఏమయ్యేది?"

"వేషం మారిపోయిందిగా! ఆ సర్కస్ వాళ్ళే గుర్తుపట్టలేదుగా!" కాని! కాని ఎంత అప్రతిష్ట!"

"అంటే?"

తర్వాత శ్యామలరావు ఏం మాట్లాడ లేదు. ప్రదర్శనానంతరం అమ్మల్ని ఇంటి దగ్గర దింపి అమృతతో ఇంటికి చేరాడు. ఇంటిదగ్గర ఏమీ మాట్లాడలేదు. నిద్ర పట్టేముందు మాత్రం ... "ఇహమాత్రం ఇట్లాంటి పనులెప్పుడూ చెయ్యకు. ఇవ్వా శంటే ఏదో సర్దుకుపోయింది. ఆ సర్కస్ వాళ్ళు ఏదో పొరపాటుపడి ఊరుకు న్నారు. లేకపోతే మెడబట్టి గెంటేసే వాళ్ళు" అన్నాడు.

"లేదు. మాకంటే నువ్వే బాగా చేశా వంటూ మెచ్చుకునేవాళ్లు"

"నోర్మూయ్యి. అప్రతిష్ట తప్పినం దుకు సంతోషించు. నువ్వేం దొమ్మరిదాని వనుకున్నావా? బజార్లలో గెంతటానికి!"

అమృత బుంగమూతి పెట్టేసింది.

శ్యామలరావు కొరకొర చూపులు అమాంతంగా ఆపేసి గట్టిగా కావలించు కుని ముద్దుపెట్టుకున్నాడు.

మరునాడు సాయంకాలం క్లబ్ లో పేకాడుతుంటే ఎవరో అన్నారు. "రాత్రి సర్కస్‌లో ఆ అమ్మాయి ఎవరోగానీ సరిగ్గా మీ ఆవిడలాగే వుందయ్యా. నేనే కాదు; నువ్వయినా పొరబాటు పడతావ్. చక్కగా మొగ్గలు కూడా వేసింది. మీ ఇద్దరూ సర్కస్‌కి వచ్చారుగనుక గానీ లేకపోతే" అన్నాడు ప్రసంగవశాత్తూ.

అప్పటికేం మాట్లాడలేదు. కాని ఆ రాత్రి అమృతను వదిలిపెట్టలేదు శ్యామల రావు "వాడో మెల్లకన్ను వెధవ కనక

ఫ్యాక్టరీ సర్కస్ చూస్తూ నువ్వు సీటులో లేవని గమనించలేదు గనుక ఊళ్లో టాంటాం చెయ్యలేదు. లేకపోతే ఈ పాటికి ఫలానావారి పెళ్ళాం అంటూ..."

అమృత జవాబేం చెప్పలేదు. మళ్ళా చిన్నప్పటి బుంగమూతే పెట్టింది. ఆ బిక్క చూపులే చూసింది. అయినా రోజులా అవేంపని చెయ్యలేదు. ఆ రాత్రంతా రుసరుసలే!

వద్దనుకుంటూనే మరో వారంరోజుల తర్వాత ఇద్దరూ కాఫీ హోటల్‌కి వెళ్లారు. ఆ తర్వాత కొద్దిగా మార్కెటింగ్ చేశాడు, అంతా అయిన తర్వాత సర దాగానే ఇద్దరూ ఇంటికి వచ్చారు. కులా సాగా భోజనాలు కావించారు. ఆ తర్వాత పడకగదిలో యధాలాపంగా శ్యామల రావు అమృత హాండ్‌బాగ్ చూశాడు. అందులో రెండు 'టీ' స్పూనులున్నాయి. సరిగ్గా హోటల్లో చూసినలాంటివే. మరో జత జడకుచ్చు రింగులున్నాయి.

ఇవెప్పుడు కొన్నటీ! ఇవి ఆ హోటల్ లోవా?"

"అమృతా! సాఫీగానే పిలిచాడు శ్యామలరావు.

"ఇవ్వెక్కడివీ ?" సాఫీగానే అడిగాడు.

అమృత అప్పుడే బుంగమూతి పెట్టే సింది.

"నోటమాట రాదేం? చెప్పవేం జవాబు! ఇవి దొంగిలించి తెచ్చావా?"

ఆ కేకకు అదిరిపడి జవాబిచ్చిం దమృత.

"అవును"

"ఎందుకూ ఈ అణాకానీ సరుకు''?

"...ఊరికేనే..."

ఒళ్లు మండిపోయింది శ్యామలరావుకి. గట్టిగా అమృత చెయ్యిపుచ్చుకుని గబ గబా పెద్ద అలమారా దగ్గరకి లాక్కు వెళ్లాడు. తటాలున తలుపుతెరచి డజను చెంచాలు ముందు పడేసి "ఇదిగో నీక్కావాలంటే వెండి చెంచాలింట్లో వున్నాయి చచ్చేటన్ని ... ఆ వెధవ హోటల్ చెంచాలెందుకు?"

జవాబులేదమృత దగ్గర్నుంచీ. ఆ బుంగమూతి ముడుచుకుంటే తెరుచు కోదు. ఈ తడవ అది కోపాన్నే ఎగ దోసింది. గబగబా వెళ్ళి పక్కగదిలో ఇనప్పెట్టె తెరిచాడు. ఒక నగల పెట్టె పట్టుకువచ్చి ముందు పెట్టాడు.

"నీక్కావాలంటే దీన్నిండా నగలే, జూకాలు; జడగంటలు; నాగసరాలు; వజ్రాల చెవిరింగులు. నీకేదికావాలంటే అది తీసుకో" పెట్టె తెరిచి ముందుపడేశాడు. అమృత కళ్లు జిగేలుమన్నాయి.

"ఇవన్నీ బంగారంవేనా"

అసలుసిసలైన బంగారం తీసుకో అవన్నీ నీకోసమే. వేరేపెట్టుకునే వాళ్ళు వరూలేక పెట్టెలోనే ఉండిపోయినాయి. తీసుకో. నీ యిష్టమైనవి పెట్టుకో... అన్నీ చూసిందమృత. ఏదీ తీసుకోలేదు. చేతిలోనే వున్న పావలా ఖరీదన్నా చెయ్యని ఆ జడ కుచ్చు రింగే పెట్టు కున్నది.

దాన్ని లాగి అవతల పారేశాడు శ్యామలరావు. కాసేపాగి. "నీకు మతి ఉందో పోయిందో కూడా తెలియటంలేదు. ఆ అణాకానీ తళుకు బంగారం సరుకు పెట్టుకుంటే శ్రీనివాసం గారి కోడలి కింత కంటే గతిలేదని నవ్వుతారందరూ. అందు లోనూ దాన్ని దొంగిలించి తెచ్చావని తెలిస్తే మీ నాన్న చెప్పుచ్చుకు కొడతాడు.

కొట్టాడా ఎప్పుడన్నా?" "
"కొట్టాడు."
"మరి బుద్ధింకా రాలేదా?"
"రాలే !
"సిగ్గు లేకపోతే సరి."
"ఏదో సరదాపుట్టి...తెచ్చాను."
"సరదాపుడితే డబ్బులిచ్చే తేవచ్చుగా !"
''డబ్బులిచ్చి తెస్తే సరదా ఏముంటుందీ."
"నాకు సరదా పుట్టింది లాగి లెంపకాయ కొట్టనా ఇప్పుడు ?''
"వద్దు.''
"ఏం ?"
అంతలో విమలాంబ గది దగ్గరకు వచ్చింది"
"ఏమిట్రా ఆ కేకలు?''
"చూడమ్మా ! రా లోపలికి. చూడు నీ కోడలేంచేసిందో !"
"నాకు తెలుసులే నువ్వేం చెప్పక్కర్లేదు. దాని సంగతీ తెలుసు. నీ సంగతీ నాకు తెలుసు."
"కాదమ్మా ఇదీ...ఇవ్వాళ బజార్లో..!
''చాలింక నోరుముయ్యి. ఆర్నెల్లకే ఇంత అథారిటీ చెలాయిస్తున్నావా ఏం? నోరు మూసుకుని పడుకోండింక."
ఆమె ఆగలేదిక. సరాసరి వెళ్ళిపోయింది. అడుగుల చప్పుడు అంతరించి పోగానే గబగబా అమృత శ్యామలరావు దగ్గరకొచ్చింది.
''మీకు దణ్ణం పెడతాను. నామీద అత్తగారితో ఏమీ చెప్పకండి. ఆవిడ దేవుడి లాంటి మనిషి. ఆమెగారెప్పుడు 'ఛా' అంటే అప్పుడే నేను చచ్చిపోతాను అంతే''
"ఇక ఎప్పుడూ ఇలా దొంగతనం.."
"చెయ్యను."
''సర్కస్‌లో దొమ్మరాట?"
"ఆడను."
"నేను వద్దన్న పనేదీ...?"
"కావాలంటే ఈ చేతులిపుడే విరగగొట్టుకుంటాను.''
"ఏదీ ఒక్కసారి బుంగమూతి పెట్టు."
అలా కావాలనావేళ అమృతచేత బుంగమూతి బలవంతాన పెట్టించి మరీ ముద్దు పెట్టుకున్నాడు శ్యామలరావు.
ఆ రాత్రంతా అమృత బూరలాగ బుంగమూతి పెడుతూనే ఉంది. పెట్టిన నిముషంలో గాలి పోతూనే వుంది.
రెండు మూడు రోజులకొకసారి అమ్మలూ, సునందా కూతుర్ని చూడటాని కొస్తూనేవున్నారు. అమృతనీ, అల్లుణ్ణీ తమ ఇంటికి ఆహ్వానిస్తూనే ఉన్నారు. వీళ్ళూ వీలు దొరికినప్పుడల్లా వెళ్ళి వస్తూనే ఉన్నారు. ఈ తడవే ఎందుకో సునంద రాలేదు.
అమ్మలే వచ్చింది ఒంటరిగా. అమృతను అవతలకు తీసుకెళ్ళి "ఆవేళ సర్కస్‌లో చేసిన అల్లరికి వారేం అనుకోలేదు గదా!'' అని అడిగిందమ్మలు.
"లేదులే!"
"అంటే కొద్దిగా ఏదో జరిగిందన్నమాట!''
"బుంగమూతి పెట్టేశాను. దానితో పోయింది."
"పోన్లే! ఏదో జరిగిపోయింది. ఆవేళ రాత్రి నాకు నిద్రే పట్టలేదు. ఎంతవరకూ పోతుందో అని..."
అంతలో అక్కడే బల్లమీద పడేసి వున్న జడకుచ్చు రింగులు అమ్మలు

కంటపడ్డాయి. అవి తీసుకుని చూసి అమ్మలు అడగనే అడిగింది.

"అయితే సువ్వింకా ఇలాంటివాటిని.."

అమృత సిగ్గుపడింది.

"ఇంకెప్పుడూ ఆ పని చేయనని అత్త గారిమీద ప్రమాణం చేశాను".

"మంచిపని చేశావ్! కాని చేతులూరు కోవుగా?"

"అందుకనే ఇదుగో...... ఆవేళ ర్రాత్రే..."

చేతులు చూపించిందమృత. కుడి చేతి రెండువేళ్ళూ బాగా వా.చి వున్నా యి.

"ఇదేమిటి చితకకొట్టుకున్నావా ?"

"ఆ తలుపు సందులో పెట్టి నొక్కేశాను."

అమృతను చూస్తూంటే అమ్మలుకు నోటమాటరాలేదు కన్నీళ్లుకారిపోయాయి.

"పోన్లే ఇకనన్నా పొరపాటునన్నా అలా చెయ్యనుగా"

నిజానికమృత ఆ తర్వాతెప్పుడూ అటువంటి పనులు చెయ్యలేదు. అంటే బుద్ధి పుట్టలేదని కాదు. చేతులు దురద పుట్టినప్పుడల్లా 'ఛీ నాకేంకర్మ... మా ఇంట్లో అన్నీ బంగారానివే ఉన్నాయి' అనుకునేది. అసలు వీధిలో అమ్మకం బళ్ళ దగ్గిరికీ, చవకరకపు గాజుల కొట్లకీ వెళ్ళేదేకాదు: అన్నీ దాసదాసీలే తెచ్చిపెట్టేవాళ్ళు. ఎప్పుడన్నా వెళ్ళినా, తను కారు దిగేదేకాదు. షాపులవాళ్ళు అన్నీ కారు దగ్గరకే తెచ్చేవాళ్ళు.

అది కూడా అమ్మలు చెప్పగా విని శ్రీధరం దంపతులు సుఖంగా నిద్రపో గలుగుతున్నారు. ఇక వాళ్ళిద్దరికీ మిగి లిన దిగులు ఒక్కటే.

"అమ్మలు వివాహం"

అమ్మలుక్కూడా శ్రీధరం సంబంధాలు చూస్తూనే ఉన్నాడు. కానీ ఏదీ అంతగా నచ్చటం లేదు. శ్యామలరావుతో పోల్చకపోయినా, తన అంతస్థుకు తగిన సంబంధం రావాలిగదా ! ఒకటి పొసిగితే ఒకటి పొసగని సంబంధాలే అన్నీ.

ఓ రోజున శ్యామలరావు శ్రీధరం దగ్గరకు వచ్చాడు తలవనితలంపుగా. అందులోనూ అమృత వెంటలేకుండా సరాసరి ఆఫీసు గదిలోకే వచ్చి కూర్చున్నాడు. ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ కూర్చున్నారు మామా అల్లుళ్ళు...

"అందరూ అమృతలాంటి అదృష్ట వంతులుండరు. అలాగే మీ నాన్నగారి లాంటి బడా వ్యాపారస్తులూ ఉండరు. కాని నీలాంటి వాణ్ణే ఒక అల్లుణ్ణి చూడాలయ్యా నేను మన అమ్మలుకు. నీకు ఎవరన్నా తెలుస్తే చెప్పు" అన్నాడు శ్రీధరం.

అలాగేనన్నాడు శ్యా మ ల రా వు లాంఛనప్రాయంగా.

"అలాగే అంటే కాదు. పెద్దల్లుడిగా నీకూ ఆ బాధ్యత వుంది"

"అవుననుకోండి..." అని తప్పుకో చూశాడు శ్యామలరావు.

"నాన్నగారు ఓ పనిమీద నన్ను మీ దగ్గరకు పంపారు"

"అలాగా! వ్యాపారం నీకూ కొంత అప్పగిస్తున్నారన్న మాట మంచిదే"

"అలాగేననుకోండి"

"ఇంతకూ ఏమిటది?"

"ఒక ఇన్‌ఫర్మేషన్. బడ్జెట్ వస్తోంది గదా"

"అవును వస్తోంది"

"సిగరెట్‌ల మీద పన్నేమన్నా పెరుగుతోందా అని అడిగిరమ్మన్నారు"

"అదంతా అతిరహస్యం గదా"

"దాన్ని నాన్నగారు అతి రహస్యం గానే ఉంచుతానన్నారు.

ఈ ఒక్క ప్రశ్నతో చాలా విషయం అర్థమయింది శ్రీధరానికి. ఈ ప్రశ్నకు జవాబుతో దేశంలో సిగరెట్లన్నీ బ్లాకు లోకి పోతాయి. పన్ను పెరిగినా పెరక్క పోయినా, బ్లాకులో ఈలోగా లక్షలు సంపాదించవచ్చు. పెరిగితే ఇప్పుడే స్టాకు చెయ్యవచ్చు. అందుకే ఇది అతి రహస్యంగా ఉంచుతారు. అసలు పెద్ద పెద్ద ఆఫీసర్లక్కూడా ఈ రహస్యాలు తెలియనివ్వరు ప్రభుత్వంలో. ఆఫీసర్లకు ఈ విషయం తెలియటం కూడా.. తెలిస్తే ఇన్‌డైరక్టుగానే తెలుస్తుంది. ఊహా మాత్రంగానే అందుతుంది. అలా ఊహా మాత్రంగానే పెంచవచ్చునన్న మాట శ్రీధరానికీ తెలుసు. ఆ మాట తానంటే చాలు శ్రీనివాసంగారు లక్షలార్జిస్తాడు. అటు వియ్యంకుడు, ఇటు ప్రభుత్వం. తన మీదవుంచే నమ్మకం ఇందుకే కాదు గదా శ్రీనివాసంగారంత తేలిగ్గా అమ్మ తను చేసుకోవటానికి ఒప్పుకుంది. గడియారపు పెండ్యులం లాగ వూగిపోయింది శ్రీధరం మనసు.

సగం చచ్చిన కంఠస్వరంతో శ్రీధరం "పెంచవచ్చు" అన్నాడు

తర్వాతేదేదో మాట్లాడి వెళ్ళిపోయాడు శ్యామలరావు ఇంట్లోకి వెళ్ళి సునందను చూడకుండానే.

ఇంటికి వచ్చి తండ్రితో పెంచవచ్చు అన్నారని చెప్పాడు.

మర్నాడే షాపుల్లో ధరలు పెరగ నారంభించాయి.

వారం తిరిగేటప్పటికల్లా వేలకువేలు లాభాలు. నెలా పదిహేను రోజులపాటు సిగరెట్టు కాల్చే బలహీనుల ముక్కులు పిండి కొల్లగొట్టేశారు వ్యాపారస్తులు ఎవ రికి తోచినట్లు వారు వసూలు చేసి. ఆ బలహీనుల్లో శ్రీధరం కూడా ఒకడు. పోతే నెలా పదిహేను రోజుల తర్వాత, పన్ను లెక్కువ చేయగా పెట్టెకు పాత ఖరీదుపైన రెండు పైసలెక్కువ పడింది.




స్వగ్రామంలో రాముడి వ్యాపారం బాగా సాగుతోందనే చెప్పాలి. రాముడిప్పుడు చిన్న బంకులో సిగరెట్ బీడీలేకాక బిస్కెట్స్ బ్లేడులూ సబ్బులూ కూర గాయలు కూడా అమ్ముతున్నాడు. లాభం కూడా బాగానే ఉంటోంది. తల్లీ తనూ తప్ప తినేవాళ్ళెవళ్ళూ లేరు. వ్యాపారం అభివృద్ధికాకేం చేస్తుంది! అందులో నాలుగు ఊళ్ళు తిరిగి నలుగురితో మాట్లాడటం నేర్చినవాడాయె. నలుగురూ ఆ కొట్టు దగ్గరే చేరారు. అక్కడే కొంటారు. అక్కడే చిన్న 'కాలక్షేపం సెంటర్' నడుస్తుంటుంది. రాముడే అన్ని ఊళ్ళ సంగతీ రకరకాలుగా ఉపన్యాసాలిస్తుం టాడు.

"నేను విశాఖపట్నంలో దొమ్మరాట లాడ్తా వున్నపుడు...విశాఖపట్నం అంటే ఏంటో తెలుసా! ఓడలు ఆగేవూరు. మన

ఊరంత అస్పృతి ఉండక్కడ..." అంటూ అందర్నీ చేర్చి తను తిరిగిన ఊళ్ళన్నింటినీ వర్ణించటం వాడికి అలవాటు.

"నేనూ ఓ అమ్మాయీ కలిసి దేశమంతా తిరిగామని చెప్పాగా తెలుసుగా! అమ్మాయంటే అమ్మాయా! కళావాళ్ళ పిల్ల బాగా డాన్సు చేసేది. ఆపిల్ల నాన్నగారే నాకు అయిదొండలు ఇచ్చారు, ప్రెసెంటుగా" అంటూ అమృతను గూర్చి ఆ అనుభూతుల్ని గూర్చి రకరకాలుగా వర్ణించి చెప్పేవాడు.

రాత్రిళ్ళు నిద్రపట్టనపుడు అమృత పెళ్ళి అయివుంటుందా! ఇంకా అలాగే అల్లరి చేస్తోందా! ఆభర్త ఎలాటివాడో!" అనుకుంటూ కలలుకనేవాడు బెంగపడేవాడు.

రోజూ పోస్ట్‌మాన్‌ని కేకేసి, "నాకేమన్నా శుభలేఖ వచ్చిందా?" అని అడిగి చూసేవాడు. రాలేదంటే, విసుక్కునేవాడు. ఆబాధ పడలేక ఆ పోస్ట్‌మాన్ ఆవీధికే రాకుండా తప్పించుకు తిరిగేవాడు.

వెళ్ళాలి. వచ్చేనెలలోనన్నా వెళ్ళి చూసి



రావాలి. పెళ్ళి అయిందో! లేదో! ఆగిపోతే, ఎందుకు ఆగిపోయిందో అయితే ఎంత వైభోగంగా జరిగిందో! అంతా స్వయంగా తెలుసుకురావాలి; ఓ వంద ఖర్చయినాసరే. అనుకుంటూనే నెలల తరబడి గడిచిపోయింది.

అంతలో అతనికి పెళ్ళి సంబంధాలు రాసాగాయి.

ఒకటిగాదు అయిదారు సంబంధాలు చూడటం కూడా జరిగింది. ఒక్క పెళ్ళి కూతురూ అమృతలాంటిది కనిపించలేదు.

ఆ ఆశ అతనికి చాలా కాలం నిరాశ గానే వుండిపోయింది, ఆ విషయం తేలి పోగానే, ఇక అందరు ఆడపిల్లలూ నచ్చ నారంభించారు.

"రత్నం"అనే పిల్లతో పెళ్ళి నిశ్చయ మయింది. రత్నం చాలా ఓర్మిగల పిల్ల. మొగుడికి విధేయత చూపటం తప్ప మరో ఆలోచనే వుండదు ఆ అమ్మాయికి. పుట్టింటివారంతంత మాత్రమే కావటం వల్లనూ, పట్నవాసంగాలి తగలకుండా పెరిగినదవటంవల్లనూ,రాముడి కబుర్లంత ఆసక్తికరంగా వుండటంచేతనూ, రాముడి చిన్నతనపు కథలన్నీ మొదటి నెలలోనే వినేసింది; అమృత వన్నెచిన్నెలన్నీ తెలుసుకున్నది.అమృతంటే ఒక దేవకన్య అన్న భావం ఏర్పడింది. ప్రయత్నమంతా తానూ అలా ఉండాలనే చేయసాగింది శాయశక్తులా.

ఒంటరిగా వున్నప్పుడు నులక కుక్కి మీద రత్నం దగ్గర కూర్చుని కబుర్లు చెబుతుంటే... 'అమృతా నేనూ, ఇలాగే కబుర్లు చెప్పుకునేవాళ్ళం' అనేవాడు.

రత్నం ఎప్పుడన్నా అలిగి బుంగ మూతి పెట్టినపుడు అమృత అలిగినపుడు ఇలాగే బుంగమూతి పెట్టేదనేవాడు.

నిద్రలో ఎప్పుడన్నా రత్నం తనమీద కాళ్ళేస్తే.. "నువ్వేం అమృతనను కున్నావా కాళ్ళెయ్యటానికి?" అంటూ కసిరికొట్టేవాడు.

సానుకూలమైన దాంపత్యమవటంవల్ల అవన్నీ ఎప్పటికప్పుడు సర్దుకుపోయేవి. రోజూ వినీవినీ విసుగు రావటం వల్ల ఓరోజున రత్నమే అన్నది. "పోనీ ఓసారి వెళ్ళిరా...అంత ఇదిగా వుంటే.." అని.

ఇక రాముడికి కాలాగలేదు. కొత్త చొక్కా కుట్టించాడు. వేరుశనగ పప్పుం డలు చేయించాడు. ఊళ్ళో అందరికీ ఊరెళ్తానని 'దండోరా' చేశాడు. అన్నీ మూట గట్టుకుని బయలుదేరాడు. బయలు దేరిన క్షణం నుంచీ రైలు ఎప్పుడు దిగు తానా, అమృతను ఎప్పుడు చూస్తానా అని ఆతురతపడ్డాడు. రైలు దిగి, సరాసరి రిక్షా కట్టించుకుని, శ్రీధరంగారి ఇంటి ముందు దిగాడు.

ఇంట్లో శ్రీధర మొక్కడే ఉన్నాడు. అమ్మలూలేదు, సునందా లేదు. ఇల్లంతా బావురుమంటోంది. శ్రీధరమే అంతా చెప్పేశాడు,

"అమృత పెళ్ళయి చాలా నెల లయింది. అత్తవారింట్లోనే ఉంటోంది."

"ఆరిల్లెక్కడండి."

ఆ అత్తవారిల్లు ఎక్కడో చెప్పటానికి చాలా ఆలోచించాడు శ్రీధరం. చివరికి

"నువ్వక్కడికి వెళ్ళకపోతే ఏం? ఖర్చులు నేనేఇస్తాను ఇంటికి వెళ్తానంటే!"

ఆ మాటవిని హతాశుడైపోయాడు రాముడు.

ఆ మాట అని శ్రీధరమూ బాధ పడ్డాడు. అయినా తప్పదు. అమృత





బాల్యం ఎలా గడిచిందో అత్తవారింట్లో తెలియగూడదు.

"మీ బాల్యం స్నేహం ఎటువంటిదో నాకు తెలుసు రాముడూ! కాని అమృత ఇప్పుడు గొప్పింటి కోడలు. అమృత మామగారు శ్రీనివాసంగారు చాలా గొప్ప వాడు. కోటీశ్వరుడే అనవచ్చు. వారింటికి నువ్వెళ్తే అమృత సంతోషిస్తుంది చాలా. కాని వాళ్ళింట్లో వాళ్ళకి మీ స్నేహం తెలియదుగదా! వాళ్ళింట్లో కుర్చీ మీద నువ్వు కూర్చుంటే వాళ్ళ కుర్చీ మాసి పోతుంది"

"కానీ నేను కుర్చీ మీద కూడా కూర్చోనయ్యా! చెప్తున్నాగా; వాకిట్లోంచి చూసి వాకిట్లోంచే వచ్చేస్తా."

"అయినా వాళ్ళ మామగారికి ఇష్ట ముంటుందో వుండదో! అమృత భర్తకు ఇష్టముంటుందో వుండదో! మేమంటే, మా సంగతి వేరు. అమృత మా పిల్ల! మా పిల్లను రక్షించి మాకు దక్కించిన వాడివి నువ్వు. కాని అది అమృత అత్త వారిల్లు గదా ? మా విశ్వాసం వాళ్ళ కుండదుగదా! నిన్ను ఇంట్లోకి రానిస్తారో లేదో ! రానివ్వకపోతే నీకూ మాకూ అవమానం. అమృత బాధపడుతుంది. కనుక నా సలహా ఏమిటంటే... నువ్వ క్కడికి వెళ్ళటం మంచిదికాదు. ఈతడప అమృతను ఇక్కడికి తీసుకొచ్చినపుడు, టెలిగ్రామ్ ఇస్తాను. అప్పుడురా అమృ తను రెండు రోజులుండి చూసి వెళ్దువు గాని.. ఏమంటావ్!"

"ఆ ఎడ్రస్ ఏదో ఇవ్వండి, ఓసారి ఆ మేడ చూసి తిరిగి వెళ్ళిపోతాను."

"అదీ మంచిది కాదనే నా అభి ప్రాయం. నువ్వు మెదలకుండా ఇంటికి వెళ్ళిపో, ఈ వందా తీసుకుని..."

ఎంత ఎత్తుగానో, ఊహల్లోఎగిరాడు. అంత బొక్కబోర్లా కిందపడ్డాడు. చిన్న మొహం చేసుకుని, తన మూట విప్పి, వేరుశనగ పప్పుండలు బయటికి తీసి "ఇవి అమృతమ్మ కివ్వండి. నేనొచ్చా నని చెప్పండి, అడిగానని చెప్పండి. నాకంతే చాలు. మా ఇంట్లో చేయించి తెచ్చాను అమృతమ్మ కిష్టమని. అవి తింటేచాలు నా మనసు సంతోషిస్తదని చెప్పండి చాలు. నాకంతే చాలు.. చాలు" అంటూ డబ్బు తీసుకోకుండానే వెనక్కి తిరిగాడు.

అతను వద్దంటున్నా వినకుండా, శ్రీధరం వంద రూపాయల నోటు జేబులో కుక్కాడు.

శ్రీధరం భవనం నుండి హతాశుడై రాముడు వెనుదిరిగాడు. కానీ తర్వాత మనస్సు మారింది. జేబులో మరో వంద రూపాయలున్నాయి. శ్రీధరంగారు ఎడ్రస్ ఇవ్వకపోతే ఏం? ఆమాత్రం తెలుసుకోలేడా? ఇంతదూరం వచ్చి అమృతను చూడకుండా వెళ్ళటమా? మళ్ళా ఎప్పటికో తీరిక! మహా మహా శ్రీధరం కోసమే దేశమంతా తిరిగి పట్టుకోగాలేనిది ఇదొక లెక్కా.

లెక్కగాదు నిజమే. ఒకచోట ఆగి ఓ సోడా తాగి ఆ కొట్టువాణ్ని అడిగాడు "శ్రీనివాసంగారిల్లు తెలుసా?" అని.

"శ్రీనివాసంగారంటే?"

"అంటే ఈమధ్య, అదిగో వారింటి పిల్లను తన కొడుక్కి చేసుకున్నారే.. వారూ.. పెద్ద ధనవంతులుట!"

"వారా! ఈ వూరి బిడ్డా! వారిల్లు ఇక్కడెక్కడా! ఊరికి ఆ చివర్న ఉంటుందిగాని"

"ఎక్కడ అది?"

"నువ్వు నడవలేవు. అంత అర్జంటయితే....ఓ ఆటో రిక్షా ఎక్కు. అయిదో ఆరో అవుతుంది...లేదా బస్సుంది. ఆ బస్సు నెంబరు నాకూ తెలియదే" అంటూ గుర్తులు చెప్పాడు వాడు.

రాముడా జవాబుకు తృప్తిపడ్డాడు. మొత్తానికి నడిచీ నడిచీ చీకటి పడే సమయానికి శ్రీనివాసం గారి గోడౌన్స్‌కు చేరాడు. గేటులోనే వందలాది లారీలు కనిపించాయి. అన్నీ శ్రీనివాసంగారివే అనుకున్నాడు లోపలికి వెళ్తుంటే ఎవరూ అడ్డు పెట్టలేదు. లోపల ఎక్కడా మేడే లేదు. వరసలు వరుసలుగా అన్నీ గిడ్డంగులే.! విశాలమైన రోడ్లు!...చెట్లు! శ్రీనివాసంగారి గిడ్డంగులే ఇంతుంటే ఇక ఆయన ఇల్లు...! అందరూ కూలీలే కనిపించారు. కాసేపటికి వాళ్ళూ కనిపించటం మానేశారు. నరసంచారమే అమాంతంగా ఆగిపోయింది లారీలతో పాటు. మరి కాసేపటికి బాగా చీకటిపడి ఇంక ఒంటరిగా తిరగటానికే భయం వేస్తోంది. ఎంత తిరిగినా బయటికి గేటే కనిపించదు. వచ్చిన గేటే...!

రాత్రి తొమ్మిదే అయిందో, పదే అయిందో! తిండి సంగతి దేముడెరుగు బయటికి దోవే దొరకదా? దూరాన ఏవో కేకలు వినిపించాయి. 'అమ్మయ్య' అనుకున్నాడు రాముడు. అటే గబగబా నడిచాడు. లోపల ఎవరో మనుషులు మాట్లాడుతున్నారు. అంతవరకు ఖచ్చితమే. కాని బయట తాళం వేసివుంది. గిడ్డంగి చుట్టూ తిరిగి చూసినా, అన్నీ తలుపులూ మూసే వున్నాయి. మరి లోపల మాటలు స్పష్టంగానే వినపడుతున్నాయి. తలుపులు గిజగిజలాడించి చూశాడు. దబదబా కొట్టి చూశాడు. చేసగలిగిన గోలంతా చేశాడు. తర్వాత ఎప్పుటో నెమ్మదిగా ఓ తలుపు తెరుచుకుంది.

"ఎవరు నువ్వు?"

"ఎందుకొచ్చావ్!"

"ఎట్లా వచ్చావ్?"

అన్నింటికీ జవాబు ఒక్కటే...

"శ్రీనివాసంగారితోమాట్లాడ్డానికివచ్చాను"

దానికందరూ, ఒకటే నవ్వు...

"బిర్లాగారితో మాట్లాడానికి వచ్చాట్ట! ఓ హో హో హో !!"

"అయ్యగారితో మాట్లాడటానికి వచ్చాట్ట! బాగా మర్యాద చెయ్యండిరా!"

అతన్ని అప్పుడు లోపలికి రానిచ్చారు. లోపల చాలామంది స్త్రీలూ, పురుషులు వున్నారు. కొందరు రాముడు మీదపడి చేతులు విరిచేసి ఓ స్తంభానికి కట్టేశారు. రాముడెంత గింజుకొన్నా లాభం లేకపోయింది. ఎన్నివిధాల చెప్పినా వాళ్ళ కర్థంకాలేదు. పైగా వేళాకోళం...

"చాల్లే నోరు ముయ్యి"

రాముడు నోరు మూశాడు. కళ్ళు తెరిచే ఉంచాడు. పనివాళ్ళంతా వాళ్ళ పనిలో నిమగ్నులయిపోయారు. అక్కడ చాలా మిషన్లున్నాయి. లోపలంతా పట్టపగల్లాగా వెలిగిపోతోంది. ఏమిటబ్బా ఈ అర్జంటు !!

ఏం తోచక రాముడు ఒక్కొక్క మిషన్నే పరిశీలనగా చూడసాగాడు. ఓ చోట బియ్యంలో రాళ్ళూ, ఏదో పొడరూ కలుపుతున్నారు. మరోచోట కాఫీ గింజలు, దాన్లో ఈత గింజలు ! ఇంకోచోట కందిపప్పు. దాన్లో మరేదో !

పని జరిగిపోతోంది. దాంతోపాటు సరా గాలూ జరిగిపోతున్నాయి. స్త్రీలతో పరాచకాలాడుతున్నారు. ఒక్కొక్కడు చేసిన పనికి పదిమంది పకాలుస నవ్వు తున్నారు.

అందులో కొందరు 'మేస్త్రీలు' కూడా ఉన్నారు. వాళ్ళందరికీ పనులు పురమా యిస్తున్నారు. 8 + 1 అంటున్నాడోచోట! మరోచోట 5 : 2 అంటున్నాడు మరొ కడు. "కమలా, ఇల్లారాయె కాసేపు" అంటున్నాడు ఇంకొకడు. "రెండయింది టీ పట్టండిరా!" అన్నాడో మేస్త్రీ. అందరికీ అన్ని సదుపాయాలు ఇక్కడే ఉన్నాయన్నమాట!" అనుకున్నాడు రాముడు.

రాముడుకి నిత్యావసర వస్తువుల్లో కల్తీలు జరుపుతుంటారని తెలుసు. కాని అది ఇంత భారీ ఎత్తున జరుగుతుందని తెలియదు. ఇదంతా బిర్లా శ్రీనివాసంగారికి తెలిసే జరుగుతోందా? అన్యాయం ఈ దేశంలో ఇల్లాగే తెల్లారి పోతోందా అను కున్నాడు రాముడు.

తెల్లారిన తర్వాత ఎవడో స్కూటర్ మీద వచ్చి దిగాడు. ఎవడో పరుగెత్తికెళ్ళి ఏదేదో చెప్పి వేలెట్టి రాముడి వంక చూపి స్తున్నాడు. వాడేదో అనుమానంగా ఇటు చూస్తున్నాడు. తర్వాత నేరుగా రాముడి దగ్గరికే వచ్చాడు.

"ఎవరు నువ్వు?"

"నా పేరు రాముడు 'అత్తిలి'నుంచి వచ్చాను. నాకీవూరు కొత్త" అన్నీ ఆలో చించి ఉంచుకున్న జవాబులే.

"ఎందుకొచ్చావిక్కడికి?"

"అమృతమ్మగార్ని కలుసుకుందా మని"

"ఆవిడ నీకెలా తెలుసు?"

"నేనూ, ఆవిడా చిన్నప్పుడు ఆడు కునేవాళ్ళం"

"అయితే వారింటికే వెళ్ళక ఇక్కడి కెందుకొచ్చావ్?"

"ఆరిల్లు కోసమే ఎతుక్కుంటూ ఇక్కడికి వచ్చా"

నదురూ బెదురూ లేకుండా రాముడు జవాబు చెప్తుంటే ఆ పెద్ద మేస్త్రీకి సందేహం వచ్చింది.

"ఆవిడగారు నిన్ను గుర్తుపట్టగలరా"

"ఆ, దూరాన్నుంచే గుర్తుపట్టగలదు"

'చూద్దాం. బాగా ఎరిగి వున్నవాడిలా ఉన్నాడు' అనుకున్నాడాయన.

సరాసరి వెళ్ళి ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడాడు. తర్వాత తిరిగి వచ్చి – "వీణ్ణి లారీలో శ్రీనివాసంగారి దగ్గరకు తీసుకు వెళ్ళండి నలుగురూ కలిసి. జాగ్రత్త! పారిపోయేను! మీరు వెళ్ళండి. నేనక్కడే వుంటాను" అని వెళ్ళిపోయాడు. కొంతసేపటికి స్కూటర్ మోతయింది.

తర్వాత శ్రీనివాసం గారింటికి రాముడి ప్రయాణ సన్నాహాలు యథావిధిగా జరి గాయి. రాముడి చేతి కట్లు మాత్రం అలాగే ఉన్నాయి.

లారీ గేటులోకి తిరగ్గానే రాముడికి అర్థమయింది – అదే శ్రీనివాసంగారి భవంతని. ఇంత పెద్ద భవంతిలో ఉంటుందా అమృత! తన కళ్ళనే నమ్మ లేకపోయాడు రాముడు.

"ఈ సంగతంతా ఇంటికెళ్ళి రత్నంతో చెప్తే నమ్ముతుందా! నమ్మదు; ఓసారి తీసుకొచ్చి చూపించాల్సిందే!"

రాముణ్ని లోపలికి తీసుకెళ్ళారు. ఏదో సినిమా చూస్తున్నట్లే ఉంది.

అక్కడ హాలులోనే ఆ పెద్ద మేస్త్రీ ఉన్నాడు. రాముణ్ని తీసుకురాగానే అతడు లోపలికి వెళ్ళాడు. ఎంతో సేప టికిగాని తిరిగి రాలేదు.

ఎంత సేపు చూసినా అమృత ఎక్కడా కనిపించలేదు. ఎక్కడుందో ? ఇంత పెద్ద భవనంలో గదికీ, గదికీ కూడా ఫోన్ పెట్టుకుని మాట్లాడతారేమో ? లేకపోతే ఎట్లా!

అంతలో శ్యామలరావు చేతిలో టెన్నిస్ రాకెట్‌తో లోపలికొచ్చాడు. అతన్ని చూడగానే అందరూ లేచి నమస్కారం పెట్టారు.

ఆ తర్వాత పెద్దమేస్త్రీ వచ్చి అతన్ని లోపలికి తీసుకెళ్ళాడు. ఆ లోపలే శ్రీనివాసం వున్నాడు. వెంటనే చాలా లైట్లు వెలిగాయి. శ్రీనివాసంగారి సీటు మీద మాత్రం అట్టే లైటు లేదు.

"ఎవరయ్యా నువ్వు?"

"రాముణ్ణండి... చిన్నప్పుడు అమృతమ్మ గారితో ఆడుకునేవాణ్ని. ఆమె గార్ని చూసిపోదామని వచ్చాను."

"రాత్రి గోశవున్‌లో కెందుకెళ్లావ్?"

"అది మీ ఇల్లేననుకుని వెళ్ళానండి."

"సరే! అక్కడ నువ్వేం చూశావ్?"

"అదే మీతో చెబుదామనుకుంటున్నానండి. అక్కడ బియ్యంలో రాళ్ళు కలుపుతున్నారు. మీకు తెలుసో తెలియదో! అదేదో పచ్చటి మట్టి !"

"నోర్ముయ్యి."

"కాదండయ్యా! నిజంగా! సత్తె పెమాణ పూర్తిగా.."

"చావగొట్టి చెవులు మూసి తరిమెయ్యండి వెధవని...!"

గది బయటికి రానిచ్చారో లేదో 'ఢన్' మని పిడిగుద్దు పడింది. వరసగా గుద్దులు. పిడికిలి పోట్లు! బూటు కాలితో తన్నులు!

రాముడి గోడు వినిపించుకునే వాళ్ళే లేరు, ఆ పెద్ద భవనంలో. "అమ్మో ! అమ్మో !" అని అరవగలిగినంత వరకూ అరచినా, ఎవరూ వదల్లేదు. చావ బాత్తున్నారు. మేడమీద గదుల్లోంచి, చుట్టూ పోర్టికోలో, ఎవరెవరో ఈ వింత చూస్తున్నారు. శ్యామలరావు వచ్చాడు. వెనకనే అమృత! విమలాంబ ఇంకో గదిలోంచి! పరిచారకులు చాలామంది.

"రాముడూ!" అరిచింది అమృత.

"అమృతా...నిన్ను...నిన్ను చూడటానికే వచ్చా.కాని ఈళ్లు దొంగనుకుని.."

మరి మాట్లాడకుండా వరసగా పిడిగుద్దులు. పిడికిలి పోట్లు. మరి అమృత పంక చూడనివ్వనేలేదు. "అమృతా... అమృతా... " అంటూండగానే రాముణ్ని భవనం బయటి గేటుదాకా పిడికిలిపోట్లు గెంటేశాయి.

అమృత అలాగే మేడమీద స్తంభాని కానుకుని ఆగిపోయింది.

"వాడు నీకు తెలుసా?" శ్యామలరావు అడిగాడు.

"తెలుసు. వాణ్ణి దొంగనుకుని..."

"ఏడిశావ్ ఊరుకో... ఆ వెధవ నీకు స్నేహితుడా ! చెప్పటానికి సిగ్గు లేదూ? స్నేహితుడయితే 'రాముడూ రాముడూ' అంటూ వెంటపడకపోయావ్!"

"వెంటపడేదాన్నే... కాసేపుంటే ! కాని...!!"

విమలాంబకి విషయం అర్థమయినట్లుంది.

"అవును తల్లీ ! అన్నింటికీ ఈ అంతస్తులే అడ్డం వస్తున్నాయి. ఈ అంతస్తులే లేకపోతే—








రోజులు గడిచిపోతున్నాయి.

రోజులతోపాటు మోజులూ గతించి పోతాయి.

ఆ సూత్ర ప్రకారం శ్యామలరావుకి అమృతతో కాలక్షేపం కంటే, క్లబ్ జీవితమే హాయిగా ఉంది. అదివరకు తొమ్మిది గంటలకే ఇంటికి వచ్చేవాడు. ఇప్పుడు పన్నెండు గంటలయినా ఇంటి మొహం పట్టటంలేదు.

అంతవరకూ అమృత భోజనమన్నా చెయ్యకుండా మేడ మెట్లమీదే కూర్చునేది. ఒక్కోరోజు అక్కడే నిద్రపోయేది కూడా.

అమృత ఈ విషయం అత్తగారితో చెప్పలేదు. మామగారితో చెప్పదలచుకోనూలేదు.

ఓరోజున శ్యామలరావును పిలిచి ఫలానా భాగస్థుడి కివ్వమని యాభైవేల రూపాయలిచ్చాడు శ్రీనివాసం. అలాగేనని శ్యామలరావు డబ్బు తీసుకుని వెళ్ళాడు. కాని ఆ సమయంలో ఆ భాగస్థుడు ఇంట్లో లేడు. తిరిగి వస్తానని చెప్పి, శ్యామలరావు ఆ డబ్బుతోనే 'క్లబ్'కి వెళ్ళాడు. ఆ వెళ్ళటం వెళ్ళటం మూడురోజులు నిద్రాహారాలు మాని క్లబ్‌లోనే ఉండిపోయాడు. చేతిలో డబ్బంతా జారిపోయిన తర్వాత, తప్పని సరై టేబుల్ దగ్గర్నుంచీ లేచాడు. వెర్రి మొహంతో. ఏడుపు మొహంతో అంతా అమృతకి చెప్పాడు. ఆ పూటంతా అమృత అత్తగారితోగూడ ఈ సంగతి చెప్పలేదు. ఆమధ్యాహ్నం శ్యామలరావునే ఒంటరిగా నిలబెట్టి అడిగింది.

"మీరు నన్ను ఆ క్లబ్‌కి తీసికెళ్తారా? ఆ ఆట నేనాడి చూపిస్తాను."

"నీకీ ఆట వచ్చా?"

"వచ్చు నన్ను తీసుకెళ్ళండి మీరోడిన డబ్బు నేనుగెల్చి తెస్తాను."

శ్యామలరావుకు ఆశ్చర్యమేసింది. పేకాటలో గెలుస్తామని ఈధీమా ఏమిటి? అసలు ఆడవాళ్ళకు పేకాట రావటమేమిటి? కాని ఈ పైకం విషయం తండ్రి అడిగితే ఏం చెప్పటం? ఆ భాగస్థుడీ పాటికే ఫోన్ చేసిఉంటే?

ఆ మధ్యాహ్నమే పుట్టింటివారిచ్చిన డబ్బూ, తను దాచి పెట్టుకున్న డబ్బులో అయిదొందలు తీసుకుని, అమృత భర్తతో క్లబ్‌కి వెళ్ళింది. ఆ టేబుల్ దగ్గరే భర్తతో కూర్చుంది. భర్తచేత ఆడించటం మొదలు పెట్టింది. ఒక్క గంటలో శ్యామలరావు అయిదువందలూ అయిదు వేలయింది. మోసం ఎక్కడా కనిపించటంలేదు మళ్ళా.మంచి విన్నింగ్ హాండ్ అనుకున్నారంతా. అంతా జాగ్రత్తగా అమృత వంకే చూడసాగారు. ఎంత పరిశీలనగా చూసినా ఆ బుంగ మూతిలో ఏ భావం కనబడదు. అంతా అమాయకత్వమే.

గంటలు గడుస్తున్నాయి. ఆదాయం పెరుగుతోంది. ఆటలో పట్టుదలలు పెరుగుతున్నాయి. అమృత, శ్యామల

రావుల మీద అనుమానముకొద్దీ నిఘా ఎక్కువయింది. అప్పుడప్పుడూ ఆట పాడేస్తున్నారు కనక ఆట కొనసాగితే గెలుపు ఖాయమన్న మాట అన్న సైకాలజీ మీద చివరికి చిన్న ఆటయినా గెలుపు తప్పిపోవటం లేదు. ఆ సాయంత్రానికే ముప్పైవేలు చేతిలో ఉన్నాయి.

శ్యామలరావు ఆశ్చర్యానికంతు కనబడటంలేదు. ఆనందానికి అవధులులేవు. ఆటగాళ్ళలో కొందరు దివాళాకొట్టిలేచారు. మరి కొందరు వచ్చి జాయిన్ అయ్యారు.

అయినా హాండ్‌కు తిరుగులేదు. విజయం శ్యామలరావుదే ! మరో పదివేలు పెరిగింది.

మరి కాసేపటికి అందరికీ బ్రాందీ సప్లై అయింది. అందరితోబాటు అమృతకీనూ. శ్యామలరావు సందేహిస్తునే చప్పరించాడు. అమృత ముట్టుకోలేదు.

"కమాన్! సొసైటీ లేడీస్‌కు తప్పు లేద"న్నాడు ఒకడు.

అయినా అమృత మాట మాట్లాడలేదు గెలుపు మీదే ధ్యాసంతా,

"అలవాటు లేదేమో!పోనీ కోకోకోలా పట్టండిరా" అన్నాడు మూడో సల్ల కాలర్ ఆటగాడు. కోకోకోలా వచ్చింది.

"కో కో కో లా కేం? తీసుకోండి" అన్నాడు ఒక పెద్దమనిషి.

"నాకేదీ వద్దు" ఆ ఒక్క వాక్యమే టేబిల్ దగ్గర కూర్చున్న తర్వాత అమృత ఆవేళ పైకి అన్నమాట. తక్కిన భావప్రకటనంతా భర్తకు సౌంజ్ఞలే.

"కోకోకోలాకేం తాగు" అన్నాడు శ్యామలరావు బలవంతం చేస్తూ.

"నాకు వద్దు. మీకు తెలియదు, ఊరుకోండి" అన్నది అమృత.



"సరే ఊరికే పోనివ్వటమెందుకు ఇలాతే" అని కోలా బాటిల్ అంది పుచ్చుకుని, గడగడా తాగేశాడు ఓషావు కారు బిడ. ఆ తర్వాత పావుగంట గడిచిందో లేదో వాగిందే వాగుడుగా వాగటం మొదలెట్టాడు. కొందరు మొహమొహాలు చూసుకున్నారు. మరికొందరు లేచి పోయారు.

మరో అరగంటకి యాభై వేలు సహ కూడాయి. వెంటనే లేచిందమృత. "ఇదేమిటి! అప్పుడేనా?" అన్నారందరూ.

"పోనీ సువుండు శ్యామలరావ్. ఆవిడగార్ని పంపించెయ్యి" అన్నాడొక శ్రేయోభిలాషి.

అయినా అమృత కూర్చోలేదు. శ్యామలరావును కూర్చోనివ్వలేదు, లేచే దాకా వదల్లేదు.

ఇద్దరూ కలిసి కారెక్కి సంప్రదించుకుని సరాసరి ఆ భాగస్తుడింటికి వెళ్ళారు. ఆ డబ్బు ఇచ్చేసి ఇంటికి వచ్చేశారు.

ఇంటికి వచ్చిన తర్వాత నిద్రపోయే ముందు అడిగాడు శ్యామలరావు "చూడు అమృతా!"

"చూస్తూనే ఉన్నా చెప్పండి"

"ఆ కోకోకోలాలో ఏదో మత్తుమందు కలిపి ఉన్నట్లుంది కదూ!"

"అలాగే వుంది."

"ఆ అనుమానం నీకెలా కలిగింది!"

"వాళ్ళ బలవంతం చూస్తే కలిగింది"

"పేకాట నువ్వింత బాగా ఆడతావను కోలేదు"

"ఇక ఆసంగతి మరచిపోండి. మీరూ ఆడవద్దు... అదంతా పచ్చిమోసం. ఆ మోసం తెలిసి ఆడితే వాళ్ళ ఆట సాగదు"

"కాని వాళ్ళందరూ పెద్దమనుషులే! మోసాలకు దిగరు"

"మరి క్రితం రోజున యాభై వేలూ ఎలా పోయాయి."

"ఆ వేళ బాగా తాగి వున్నాలే"

"తాగివున్నారా, తాగించేరా"

"ఆం... తాగించారు"

"తాగించారు తాము గెలవటానికి"

మరికాసేపటికి సంభాషణ మరో విషయం మీదికి సాగింది.

మొత్తానికి ఆవేళంతా ముద్దుమురిపాలతోనే గడిచిపోయింది శ్యామలరావుకి. అమృత మాటలన్నీ అంత ముద్దువచ్చాయి. మాటిమాటికీ ముద్దు పెట్టాడు. ఒంటి మీద ముద్దు పెట్టని చోటేలేదు.

* * *

కాని ఆ ముద్దు ఎన్నిరోజులో నిలవలేదు. శ్యామలరావు రోజు రోజుకి మరీ మరీ ఆలస్యంగా వస్తున్నాడు. ఒక్కోసారి వచ్చేటప్పటికి తెలతెలవారి పోతోంది.

రోజు రోజుకి అమృతకు బెంగ కూడా ఎక్కువవుతోంది. వారం రోజులయింది...ఏం చెయ్యాలో తోచటం లేదు !

ఆలోచిస్తూ తెల్లవార్లూ మేలుకుందా రోజున.

రాత్రంతా నిద్ర లేకపోయినా ఉష యాన్నే లేచి, గబగబా స్నానంచేసి, విమలాంబ పూజా మందిరానికి వెళ్ళిం దమృత రోజూలాగే.

పూజానంతరం విమలాంబ కోడల్ని కౌగలించుకుంది ఎప్పటిలాగే.

తర్వాత విమలాంబ అమృతను చూచి ఏదో సందేహించి.. "ఏమమ్మా ఏమన్నా చెప్పాలా?" అని అడిగింది.

"ఊఁ" అంది అమృత.

"ఏమిటి!"





"నాకు ఏమీ తోచటం లేదు. ఇంట్లో అన్నిపనులూ మీరే చూసుకుంటున్నారు. నాకూ ఏమన్నా చెప్పండి."

విమలాంబ చల్లగా నవ్వింది.

"నువ్వు అబ్బాయిని సరిగా చూసుకో. అంతకంటే ఏం కావాలి నాకు?"

"ఒక్కమాట!"

"ఏమిటది!"

"ఆయన ఈమధ్య రాత్రి పన్నెండు గంటలదాకా ఇంటికి రావటం లేదు."

"మీ మామగారూ అంతే..'' విమలాంబ మళ్ళా చల్లగానే నవ్వింది.

"కాని ఈయన...!" అర్ధోక్తిలోనే ఆపిందమృత..!

"మొగుడి గుణగణాలేవైనా సరిదిద్దాల్సింది భార్యేనమ్మా!.. ఇతరులతో చెప్పి ఏం లాభం!"

"సరిదిద్దుకోమంటారా? సరిపుచ్చుకోమంటారా?"

"సరిదిద్దు. ప్రతి ఆడదాని విధీ అది. సరిపుచ్చుకున్నంత కాలం భారత నారి జీవితం దుఃఖమయమే అవకతప్పదు."

ద్రౌపది ఏం చేసింది? భర్తల కెదురు తిరగకుండానే తన శపథం తాను నెరవేర్చుకుంది.

సావిత్రి ఏం చేసింది. తన భర్త కోసం విధినే ఎదిరించి వెంటాడింది; వేటాడింది.

"అలాగా !" అనుకుంది అమృత.

విమలాంబ వరండాలో నడుస్తూనే మాట్లాడి వంట ఇంటికి దోవతీసింది. అమృత ఆ గుమ్మం దగ్గర ఆగిపోయింది. ఇంటినిండా పనిమనుషులున్నారు. కాని వంట వాళ్ళెవ్వరూ లేరు. విమలాంబకు మొదట్నించీ తానొండి పెట్టటమే అలవాటు తానొండి అందరికీ పెడితేనే తాను తింటుంది.

అమృత మేడమీదికి తనగదికి వచ్చేసింది.

* * *

ఆ సాయంకాలం టెన్నిస్ రాకెట్‌తో క్లబ్‌కు వెళ్ళాడు శ్యామలరావు. అందరూ రోజు కంటె ఉత్సాహంతో ఆహ్వానించారు.

"హలో శ్యాం! మీ ఆవిణ్ణి కూడా తీసుకువస్తావనుకున్నానే! ఆవిడగారికి 'టెన్నిస్' ఇంకారాలేదా!" అని పలకరించాడొకాయన.

''లేదులే! ముందు పేకాటలో ట్రెయినింగ్ కానియ్యి" అన్నాడు మరొకాయన. కొంచెం ఒళ్ళుమండి ఆ గదిలోంచే వెళ్ళిపోయాడు శ్యామలరావు. కాని అవతల గదిలో కూడా రాత్రి పేకాటలో వున్న ఇద్దరు తటస్థ పడ్డారు.

"మొత్తానికి ఆమెహాన్ని మెచ్చుకోవాలయ్యా...ఆటలో ఎంత అనుభవముండో ఒక్క ఎక్స్ప్రెషన్ కనిపించదు. ఒక్క రోజులో యాభైవేలు ! శ్రీనివాసంగారి సంపాదన అందులో ఏ మూల అవుతుందో!". ఆ గదిలోనూ ఆగలేదు శ్యామలరావు. ఏమీ విననట్లే సరాసరి వెళ్ళిపోయాడు బయట వున్న పోర్టికోలోకి..

"తప్పేమిటయ్యా ? ఆడవాళ్ళు పేకాడితే నన్నడిగితే మొగాళ్ళే మానేసి ఆడవాళ్ళ చేతే ఆడించాలంటాను. మొగాళ్ళు అన్నాసక్తితో ఉంటారు గనుకా; అటువంటివేవీ ఆడవాళ్ళకుండవ్ కనకా...!"

శ్యామలరావు సరాసరి అక్కణ్ణించి టెన్నిస్ కోర్టుకు వెళ్ళాడు. తనలో రేగిన కోపాన్ని టెన్నిస్ బంతిమీద చూపెట్టాడు

టెన్నిస్ క్రికెట్ లాగా ఆడాడు. అన్ని బంతులూ "బౌండరీ"లే

ఆటలో ఓడిపోయినా కోపం పోలేదు.

ఆ కోపంతోనే ఇంటికి వచ్చాడు. "తక్కువ ఇంటి పిల్లను చేసుకుంటే ఫలితం ఇంతగాక మరెంత? ఛీ..ఛీ.." అనుకుంటూనే స్నానాదులు చేసి మళ్ళా డ్రెస్ కునిచేసు బయలుదేరాడు.

రెండు నోట్ల కట్టలు జేబులో వేసుకుంటోంటే చూసి అడిగింది అమృత-

"మళ్ళీ పేకాటకా?"

"ఏం వస్తావా ఓ గౌ నె స ం చీ పుచ్చుకుని?"

"ఇక మీరు రమ్మన్నారాను. కాని"

"కానీ?"

"ఎక్కడికో చెప్పండి"

"బార్‌కి. సరేనా"

ఒక్క తోపుతో అమృత వెళ్ళి సోఫా మీద పడింది. మేడమెట్లు దిగుతున్న అడుగుల శబ్దం వినిపిస్తూనే ఉంది. పాదాలతో తన గుండెలమీద నడుస్తున్నట్లే వుంది ఆ కాసేపూ. ఎందుకి కోపం? క్లబ్‌కి వెళ్ళి పేకాటలో యాభై వేలు సంపాదించి పెట్టినందుకేనా ఈ ఉక్రోషం?

అ వెళ్ళటం, గెలవటం తనతప్పేనా?

అపుడు సంతోషించాడే! ఇప్పుడిదేమిటి మళ్ళీ..."

ఎన్నెన్నో ఆలోచనలు! అన్నన్ని కన్నీళ్ళు.

అర్ధరాత్రి దాకా అదే కాలక్షేపం. అర్ధరాత్రివేళ తలుపు చప్పుడేదో అయింది. వచ్చాడు కాబోలని ఎదురువెళ్ళింది మేడ మెట్లదాకా మేడ మెట్లకిందే నిలబడి ఉన్నాడు శ్యామలరావు.

"అమృతా" అరిచాడు. అదిరిపోయింది. అంత కోపమా? చంపుతాడా ఏం కుత్తుక దాకా తాగి తూలుతూ మెట్లెక్కి వస్తున్నాడు శ్యాం. సగం దాకా వచ్చాడు. ఇక రాలేక అక్కడే పడిపోయాడు. పనివాడి సాయంతో అమృత అతన్ని పక్కమీద చేర్చి పక్కనే కూర్చుంది.

"భగవాన్ ఇంత ఐశ్వర్యం ఉన్నా జీవితం ఇంతేనా? చిన్నప్పుడెంత హాయిగా ఉండేది" అంటూ ఆలోచించింది. అత్తగారు సరిదిద్దుకోమన్నది గదా? అలాగే సరిదిద్దుకుంటాను అని ఓ నిశ్చయాని కొచ్చింది.




ఆ రాత్రి మొదలు పగలంతా బాగానే ఉండేవాడు శ్యామలరావు. బాగానే మాట్లాడేవాడు. "రాత్రి నేనేం అల్లరి చేయలేదుగా!" అనేవాడు. ఇక మానేస్తాలెమ్మనేవాడు. మారిపోయాడనే అనుకునేది ఒక ప్రక్క- కానిరాత్రికి తెగతాగి వచ్చేవాడు. కర్ణకఠోరంగా మాట్లాడేవాడు. అనరాని మాటలన్నీ అనేవాడు.

ఎవరికీ చెప్పుకోలేని హృదయభారంతో కుంగిపోయిందమృత. తల్లి దండ్రులకి చెప్పుకోలేక అటు అత్తమామలకూ చెప్పుకోలేక చివరికోరోజున అమ్మలు వస్తే అంతా అమ్మలుకు చెప్పుకున్నది.




"నన్నేంచెయ్యమంటావు?తాగి ఆయన చిన్న పిల్లాడిలాగ వాగుతుంటే, నవ్వొస్తుంది కిందపడి దొర్లుతుంటే జాలి వేస్తుంది.. తిడుతుంటే ఒళ్ళు మండిపోతుంది. మళ్ళా ఉదయం పశ్చాత్తప పడుతుంటే- పోన్లే- నన్ను తిట్టటానికైనా ఇంకెవరున్నారనిపిస్తుంది. అత్తగారు ఒక దేవత. మామగారికెంత సేపటికీ ఆయన సంపాదనయేమొ, ఆయనేమొ! భగవంతుడన్నీ ఇచ్చాడు.కాని మా ఇద్దరికీ సఖ్యతే రాసిపెట్టలేదేమో! ఇక ఈ జన్మ కింతేనేమొ!"

అమ్మలు మాత్రం ఏం చెబుతుంది! అన్నీ విని విచారంగా ఇంటికెళ్ళిపోయింది. అంతా సునందకు చెప్పింది. సునంద ఆరాత్రి శ్రీధరానికి చెప్పింది. చేసేదిలేక నిస్సహాయులైన ఆదంపతులు సరిగా భోజనాలే చెయ్యలేదు.

అమృత భర్తచేత ఎలాగన్నా ఈ తాగుడు మానిపించాలని ఉపాయాలు వెతుకుతూనేవుంది. విమలాంబ అన్నమాట ఆ చెవుల్లో మారుమోగుతూనే ఉంది. భర్తను సరిదిద్దుకోవాలి. తను సరిపుచ్చుకోకూడదు.కాని భర్తరోజురోజుకూ పశువైపోతుంటే ఏంచెయ్యగలదు? ఓ రోజున అతని పర్సుతీసి దాచేసింది.

ఆ రోజున మామూలుగానే శ్యామలరావు బార్‌కి వెళ్లాడు. తెగతాగేశాడు. బిల్లు ఇవ్వటానికి పర్సు వెతుక్కున్నాడు. అదెక్కడా కనిపించలేదు. అప్పుగా రాసుకోమనవచ్చు. కాని శ్రీనివాసంగారి సుపుత్రుడు అప్పు రాయమనటమా? ఎవరు తీసి వుంటారు తనపర్సు? అమృతా...? అమృతే! కాక తప్పదు. అమృత జూదరి... ఆటకత్తె... దొంగ కూడా. ఆ తర్వాత క్లబ్‌కి వెళ్ళాడు. అక్కడ మామగారు శ్రీధరం ఎవరో స్నేహితుల్తో కూర్చుని కబుర్లాడుతున్నాడు... "హల్లో... మామగారూ! గుడ్‌మార్నింగ్. అహోహోహో... ఎంత గొప్ప పిల్లను కన్నారండి నామెడకి కట్టటానికి... ప్రత్యేకంగా నాకోసం... మీకు తెలుసో తెలియదో చెప్తావినండి. మీ అమ్మాయ్ పేకాటలో ఛాంపియన్. సర్కస్‌లో, దొమ్మరాటలో ఫస్ట్‌క్లాస్! జేబు దొంగతనంలో అందెవేసిన చెయ్యి!... కావాలని ఎన్ని విద్యలు నేర్పించారండి... ఒక దానిమీద ఒకటి"

స్నేహితులు ఎంత పట్టుకున్నా ఆగలేదు శ్యామలరావు. శ్రీధరానికి కోపం వచ్చి చివాలునలేచి వెళ్ళబోయినా ఆగలేదు. క్లబ్‌లో జనమంతా చుట్టూమూగారు స్తబ్ధులై చూస్తూ నిలబడిపోయారు. అందులో ఎందరు పెద్దపెద్ద ఆఫీసర్లో! శ్రీధరానికి ప్రభుత్వోద్యోగుల్లో పెద్ద పేరే వుంది. ఫోన్లో పిలిస్తే పోలీసులునిమిషంలో వస్తారు. మరునిమిషంలో అల్లుణ్ణి మూసేస్తారు. తర్వాత శ్రీనివాసం అంతటివాడి తరంగూడాకాదు విడిపించటానికి. కాని అమృత సంగతి? రేపు పేపర్లలో వార్తల సంగతి?

శ్యామలరావు వాగుతూనే ఉన్నాడు. సీసాఒకటి జేబులోనేఉంది. తీసి మళ్ళా తాగుతూనే ఉన్నాడు. చాలా మందెవరెవరో అతన్ని ఆపటానికి చూశారు. అతను లొంగలేదు. చివరకు శ్రీధరాన్నే మాటలు చెప్పి తీసుకెళ్ళి కారు ఎక్కించారు. కారు కదిలేదాకా వెంటవచ్చి వాగుతూనే ఉన్నాడు శ్యాం.

కారులోనసరాసరి శ్రీధరం శ్రీనివాసంగారింటికే వెళ్ళాడు. అమృతను యోగక్షే

మాలు అడిగాడు.ఎంత గుచ్చి గుచ్చి అడిగినా భర్తమీద ఏ ఫిర్యాదు చెప్ప లేదు అమృత. కాని అమ్మలు చెప్పిన మాటలు విన్నాకా, ఇవాళ శ్యామలరావు ప్రవర్తన కళ్ళారా చూసిన తర్వాతా అమృతచేత చెప్పించటమెందుకు దండగ అనిపించి చివరకు అన్నాడు-

"నువ్వేమీ దాచిపెట్టక్కరలేదమ్మా. అంతా నాకు తెలుసు. ముఖ్యంగా ఈ మాట చెప్పిపోదామనే వచ్చాను. మాటలు పడ్తూ, దెబ్బలు తింటూ ఇక్కడే పడి వుండాల్సిన ఖర్మ నీకేంలేదు. కూతురుకు అన్నం పెట్టలేక నీకు నేను పెళ్ళి చెయ్యలేదు. కనుక కష్టపడుతూ నువ్విక్కడ వుండక్కర్లేదు. నువ్వెప్పుడు ఫోన్ చేసినా కారు పంపిస్తాను. వచ్చెయ్యి వచ్చు. నిన్నేంఅనను" అని చెప్పేసి ఇక అక్కడ ఉండలేక వెళ్ళిపోయాడు- శ్రీనివాసంగార్ని,విమలాంబగార్ని కలుసుకోకుండానే.

తర్వాత ఎప్పుడూ అమృత గదిలోకి రాని విమలాంబ ఆ గదిలోకి వచ్చింది.

"మీ నాన్నగారు వచ్చారటగా! ఏరమ్మా?"

"వెళ్ళిపోయారు"

"ఏం?"

"............"

"నాకు కబురు చేయకపోయావా?"

"............"

"ఏం చెప్పారు"

"ఏం చెప్పలేదు"

"పిచ్చిపిల్లా. నాతో చెప్పటానికేం. సరేలే! రా నేనే నీకివ్వాళ జడవేస్తాను. రా" అంటూ బలవంతానతీసుకువెళ్ళింది. కూర్చోబెట్టి తలదువ్వి జడవేసింది. తన చేత్తో పువ్వులు బెట్టింది. తనే కొత్త పట్టు చీర తీసి కట్టుకోమని ఇచ్చింది. తర్వాత నగల ఇనప్పెట్టె దగ్గరకు తీసుకెళ్ళి "నీకేం నగలు నచ్చితే ఆ నగలు తీసి పెట్టుకో" అని తాళం తీసి దగ్గర నుంచుంది.

ఇనప్పెట్టెనిండా నగలే ఉన్నాయి. రకరకాల నగలు. లేని రకమంటూ లేదు. అన్నీ రాళ్ళవి. కొన్ని వజ్రాలవి. అందులోనే ఒక మూల పడివుందో జడబిళ్ళ. నగిలీ జడబిళ్ళ. అదితీసి పెట్టుకుంది అమృత. అది దాన్లో ఉండటం చూసి తెల్లబోయింది విమలాంబ! "ఇంత పిచ్చిపిల్లవా!" అంటూ తనకు నచ్చినవన్నీ తీసి అమృతకు పెట్టింది. ఆవేళంతా కోడల్ని చూస్తూ మురిసిపోయింది.

ఆలోచించినంతసేపూ ఆలోచించి, సందేహించినంతసేపూ సందేహించి ఆఖరికి అమృత సాహసించి అన్నది-

"నేను మీ అబ్బాయిని సరిదిద్దుకోలేకపోతున్నాను!"

విమలాంబ మళ్ళీ నవ్వుతూనే సమాధానం చెప్పింది-

"ప్రయత్నించు. ప్రయత్నిస్తే సాధించలేనిదేదీ ఉండదు"

"ఆయన తాగకుండా ఒక్క నిమిషం ఉండటంలేదు. నేనేం చెయ్యను?"

విమలాంబ నవ్వలేదు. సమాధానం చెప్పలేదు.

"మామగారితో మీరు చెప్పి కేకలేయిస్తేసన్నా..."

విమలాంబ ఉత్సాహం ఏదీ కనబరచలేదు. "చెప్పి చూస్తాను" అని మాత్రం అన్నది.

ఆ రాత్రి కూడా పొద్దుపోయిన తర్వాతెప్పుడో వచ్చాడు శ్యామలరావు.

 

అప్పుడు కాస్త మోతాదులోనే ఉన్నాడు. ఎప్పుడూ లేనిదావేళ విమలాంబా, శ్రీనివాసం కనిపెట్టుకునే ఉన్నారులాగుంది. సరాసరి అమృత గదిలోకే వచ్చారు. కొడుకుని చూసి "అర్ధరాత్రిదాకా ఊళ్ళో తిరుగుతూ ఇదేన్రోయ్ నువ్వు చేస్తున్న నిర్వాకం" అన్నాడు తండ్రి.

ఇవాళనుంచీ వీడికి రోజుకో ఇరవై కంటే ఎక్కువ ఇవ్వకండి" అంటూ వెనక్కి తిరిగాడాయన. అదొక సుగ్రీవాజ్ఞ. సుగ్రీవుడు ఆజ్ఞ ఇస్తే దాన్ని ఉల్లంఘించినవారికిశిక్ష తలతీసెయ్యటమే. అంత పని చేసి చూపిస్తాడు శ్రీనివాసం.

తల్లిదండ్రులు వెళ్ళిపోయిన తర్వాత కసిగా అమృత వంక చూశాడు. "అయితే అమ్మకీ, నాన్నకూ చెప్పావన్నమాట!"

"నేను చెప్పలేదు. మా నాన్నగారే వచ్చి...."

"వచ్చారా? వచ్చి...?"

"వచ్చి చెప్తుంటే విన్నారు అత్తయ్యగారు!"

"సరే అయితే! నాకు డబ్బు పుట్టకుండా చేస్తే నేనేం చేస్తానో చూద్దువు గాని..."

"ఏదో ఆయన కోపంలో అన్నారు. మీరు తాగుడు మానేస్తే...!

"మానెయ్యకపోతే డబ్బు ఇవ్వరన్నమాట. తాగుడు మానేసి నేనేం చేసినా ఫర్వాలేదన్న మాట !"

"ఫర్వాలేదు"

"వొట్టెయ్యి"

వొట్టేసింది అమృత

"అయితే ఇకనుంచీ రోజుకో భోగం దాన్ని ఇంటికి తీసుకు వస్తాను. ఆ బిల్లు నాన్నగారికి నువ్వే తీసుకు వెళ్ళి ఇద్దువు గాని..."

ఇదెక్కడి ఖర్మ అనుకుని హడలి పోయింది అమృత. "ఆ! ఈ తాగుబోతు మాటలకేంలే" అనుకుంది.

కాని నిజంగానే తాగుడు తగ్గించేశాడు.

నిజంగానే అమ్మాయిలతో తిరగటం మొదలు పెట్టాడు శ్యామలరావు.

* * *

శ్యామలరావు తాగుడుతగ్గించేశాడన్న విషయం కళ్ళకే కనిపిస్తోందమృతకు. దానికి పెద్దగా పరిశోధన అక్కర లేకుండానే తెలిసిపోయింది. కాని అమ్మాయిలతో తిరుగుతున్నాడనటానికి దాఖలాలేవీ దొరకలేదు— చాలా రోజులు, నెలల పాటు.

ఇదివరకు ఏ అర్ధరాత్రో ఇంటికి వచ్చే శ్యామలరావు ఇప్పుడు తెల్లవార్లూ ఇంటికి రావటమే లేదు. వస్తే ఏ తెల్లవారుఝామునో రావటం, ఆ తర్వాత మధ్యాహ్నందాకా నిద్ర.

అంతసేపూ అమృత మేలుకునే వుండేది. మేడమెట్ల మీదే కునుకిపాట్లు పడేది అన్నమన్నా తినకుండా. అతను వచ్చినా అన్నం తినే వచ్చేవాడు. ఇంట్లో అన్నం తినకుండానే పడుకునేవాడు. అప్పుడేం చేస్తాంలే అని అమృత భోంచెయ్యకుండానే ఆకలితో నిద్ర పోయేది.

"ఇదంతా విమలాంబకు ముందే తెలుసా?తెలిసే నీ మొగుణ్ణి నువ్వే దిద్దుకో అన్నాదా? ఏమో"

అంత మంచి మనసుగల తల్లి అలా చేస్తుందా?

తాగుబోతువాళ్ళనిదివరకు చాలా

మందిని చూసింది అమృత. శోభనాద్రి తాగేవాడు. అప్పుడప్పుడు సింగన్నా తాగి వచ్చేవాడు. కాని ఈ నాగరికులు ఇదేమిటి, ఇంత అల్లరేమిటి అనుకునేది— శ్యామలరావు తాగడం మొదలెట్టిన కొత్తల్లో... కాని ఇప్పుడు అదే నయమనుకునే స్థితికి వచ్చింది.

శ్యామలరావు అప్పటికే అమృతను బెదిరించీ, అదిలించీ ఆమె నగల్లో ఒక్కొక్కటే ఖర్చు పెట్టేశాడు. అదీ భరించింది అమృత. కానీ, ఈ సంగతి బయటపడితే?

"తానే ఖర్చు చేసిందనరూ?"

"ముందే చెప్పక్కర్లేదా అనరూ"

అంటారు.

పోనీ పుట్టింటి వారికి చెప్పుకుని బాధోపశమనం చేసుకుందామా అంటే చులకనయిపోదూ?

తల్లిదండ్రులతో ఈ విషయం ఎట్లా చెప్పటం. మీ అల్లుడు ముండల్ని మరిగాడు అని చెప్పటమా? తానున్న స్థితి ఏది తగిన పనేనా?

శ్రీధరం దంపతులు అదివరకే రావటం మానేశారు. అమ్మలే వస్తుండేది వారానికోసారి. ఓ గంట కూర్చుని వెళ్ళిపోతూ ఉండేది. ఈ సారి అమ్మలు వచ్చి



నపుడు వేస్తే... అనుకున్నది. కాని ఆనాడే ..

శ్యామలరావు పాత చొక్కాలో కొత్త ఫోటో ఒకటి దొరికింది. అదిచూస్తుంటే ఒళ్లు మండిపోయిందమృతకు. శ్యామల రావుతో ఓ పిల్ల నగ్నంగా కలియపడి తీయించుకున్న ఫోటో అది. ఛీ...ఛీ.. ఇటువంటి ఫోటోలు తీయుంచుకోటానికి



ఆ అమ్మాయిలకెట్లా సిగ్గులేదో అను కుంది. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. దీనికి ముందు మొదట్లో నవ్వులాటల్తో ఆలస్యమయిందేం అని అడిగితే శ్యామల రావే నాన్నగారి గోడౌన్సులో ఫొటో స్టూడియోలో ఉన్నానని చెప్పేవాడు.

మర్నాడెప్పుడో తెల్లారుఝామున వచ్చి పడుకున్నాడు. ఇక మధ్యాహ్నం దాకా లేవడు. ఇదే సమయమనుకుంది. అమృత అతని తాళం చెవులగుత్తిని వెతికి తీసుకుని బయటకు పరుగెత్తింది.

"చిన్నయ్యగారు రాత్రిళ్ళువుండే గది ఉందటగా గోడౌన్ల దగ్గర..!" డ్రైవర్ని అడిగిందమృత.

"అవునమ్మా... నేనూ ఓసారక్క డికి వెళ్ళాను"

"అక్కడికి పద"

కారు పరుగెత్తింది.




కారు హారన్ వినగానే వాచ్‌మన్ వచ్చి గేటు బార్లా తెరిచాడు. కారు సరా సరి ఒక గోడవున్ దగ్గర ఆగింది. అక్కడున్న ఒక గదిమీద శ్యామలరావు పేరుగల బోర్డు వుంది.

"ఇప్పుడే వచ్చేస్తానాగు" అంటూ, అమృత తన దగ్గరున్న తాళాల గుత్తితో ఆ గది తాళం తీసింది. లోపలికెళ్ళి స్విచ్‌లు నొక్కింది.

అమాంతమూ గదంతా ధగధగాయ మానమై పోయింది. గది విశాలమైందే. అంతా సినిమా సెట్‌లాగుంది. ఖరీదైన తెరలు, అందమైన అలంకరణలు, పెద్ద మంచం, కుర్చీలు...!

గది అంతటా..నేలమీదా, బల్లలపైనా, మంచంకిందా, పైనా ఎక్కడ పడితే అక్కడ...ఎక్కడ చూసినా ఫొటోలు.. ఒళ్ళు మండిపోయే ఫొటోలు!!

అన్నింటిలోనూ ఉన్నాడు శ్యామల రావు. శ్యామలరావు పక్కన అసహ్య మైన దుస్తులతో, అసలు దుస్తులులేకుండా ఆడపిల్లలు ఒకళ్ళుకాదు, నలుగురు కాదు..

ఒక ఫొటోలో ముద్దులాడుతున్న ఇద్దరు ఆడవాళ్ళతో ఉన్నాడు శ్యామల రావు. ఒక ఫొటోలో తనే ముద్దులు రుద్దుతున్నాడు. మరొక ఫొటోలో... ఇంకొక ఫొటోలో...

శ్యామలరావంటేనే అసహ్యమేసింది అమృతకు.

'ఛీ ఆ మొహమన్నా చూడకూడదిక' అనుకుంది.

రెండు ఫొటోలు మాత్రం తీసి తన హేండ్‌బాగ్‌లో ఉంచుకుని బయటికి వచ్చే సింది. వెంటనే కారులో ఇంటికి బయలు దేరింది.

దారిలో ఒక గోడౌన్ దగ్గర ఏదో ఘర్షణ జరుగుతోంది. చాలామంది కూలీలు గుమిగూడి వున్నారు. అందులో చాలా మంది స్త్రీలు. వీరిలో ఎవరన్నా ఆ ఫొటోలలోవారు ఉన్నారా? కారాపించి దిగింది అమృత.

అమృతను చూడగానే ఆ ఘర్షణ ఆగిపోయింది.

'అమ్మాయిగారు! శ్రీనివాసంగారి

కోడలుగారు!' ఏవేవో గుసగుసలు ఆరంభ మయినాయి. అందరూ ఎవరి పనులకు వారు తప్పుకున్నారు. మళ్ళా గోడవున్లలో మిషన్లు పని చెయ్యటం మొదలెట్టాయి.

"ఇదేమిటి! రాళ్ళూ, నూ క లూ కలుపుతున్నారు. అందులోనూ పళ్ళు విరిగి పోయే పలుగు రాళ్లు"

అడిగిందో మేస్త్రీని.

"అలా కలిపితేగాని బియ్యానికి బరువు రాదు గదండీ !"

"మరి ఆ మట్టి ?"

"అది పాలిష్ రావటానికిలెండి, బియ్యం తెల్లగా వుంటాయి. బియ్యం కడిగేయటంలో అది నీళ్ళలో కలిసి పోతుందిలెండి"

"కాని బస్తాకి ఇంత మట్టా...?"

మరోచోట కాఫీ గింజల్లో ఈత గింజలు...!!

ఇంకో చోట—

"మీకు తెలియదేమో అమ్మగారూ! బజార్లో దొరికే మందులన్నింటికీ మన గోడవున్లలోనే నకిలీ మందులు తయారవు తున్నాయి. ఆ ఫొటో స్టూడియో ఉన్న గోడౌనంతా నకిలీ మందులదే..."

"మరట్లా నకిలీ మందులుంటే ప్రాణాలు పోవూ..."

"పోతాయి; కాని లాభాలు రావటం ఎలా?"

మరి మాట్లాడలేదమృత.నిలిచిమాట్లాడు తున్నంత సేపూ చుట్టూ ఉన్న స్త్రీలంద రినీ గమనించింది. ఒకళ్లూ ఆ ఫొటోలలో వాళ్ళు కనిపించలేదు. అంటే వాటిలోని వాళ్ళు అందరూ వ్యభిచారిణులన్నమాట. వెలవెలదులేనన్న మాట! సరాసరి వచ్చి కారు ఎక్కింది. కారు పెద్ద పెద్ద షెడ్ల చుట్టూ తిరుగుతూ నడిచింది. ఒక షెడ్‌కు ఖద్దరు పరిశ్రమ అని ఉన్నది. ఇదీ నకిలీదేనేమో! ఎంత మోసం !

ఇంటిముందు ఆగింది అమృత కారు. శ్రీనివాసంగారి ఆఫీసు గదిలో ఎవ్వరూ లేరు. ఇదే సమయమనుకుంది. గదిలో కెళ్ళి తను తెచ్చిన ఫొటోలున్న రెండు కవర్లలో ఒకటి ఆయన టేబుల్ మీద పెట్టింది.

రెండోది...

పూజా మందిరంలో విమలాంబ పూర్తిగా తన్మయత్వంలో వుంది. చుట్టు పక్కలా ఎవ్వరూలేరు. నిశ్శబ్దంగా ఆ గదిలోకి జారవిడిచింది. మెదలకుండా మేడమీదతన గదిలోకి వెళ్ళిపోయింది. ఇక ఏమవుతుందా అని ఆలోచిస్తూ పక్క మీద వాలింది. ఎప్పుడు పట్టిందో నిద్ర పట్టింది.

నిద్రలేచేసరికి...కింద కేకలు వినిపిం చాయి.

"ఈ ఫొటో నా గదిలో పెట్టిం దెవరు?" శ్రీనివాసంగారు రుద్రుడై పరిచా రకులందర్నీ నిలబెట్టి అడుగుతున్నాడు.

ఎవ్వరూ ఏం సమాధానం చెప్పటం లేదు.

"ఎవ్వరికీ తెలియకుండా ఈ కవరు నా బల్లమీది కెలా వచ్చింది ?"

అందరూ కిమిన్నాస్తి.

ఆయన పూజామందిరంలో కెళ్ళాడు.

"విమలా" అన్నాడు.

విమలాంబ అక్కడే కళ్ళ నీళ్ళతో చేతిలో ఒక కవరుతో నిలిచి ఉంది.

"చూశావా నీ కొడుకు నిర్వాకం!"

"చూశాను" అంటూ విమలాంబ చేతిలో కవరు జారవిడిచింది. అదీ తీసి చేశాడు శ్రీనివాసం...

అదీ అంత అసహ్యంగానూ ఉంది.

"ఎవరో వాడంటే గిట్టనివాళ్ళే ఇది చేసి వుండాలి, గుట్టుగా!"

ఇలాంటిదే కోడలికూడా రాలేదు గదా?

విమలాంబ ఖంగారు పడింది.

గబగబా నడిచి ఇద్దరూ మేడమీదికి వెళ్ళారు.

అమృత అక్కడ మంచంమీద దొంగ నిద్రపోతోంది.

"బంగారంలాంటి పిల్ల కిలాంటి అగచాట్లు. ఈ పిల్ల నా కొడుక్కి తగినదేనా !'' అని ఆలోచించానుగాని... 'నా కొడుకు ఈ పిల్లకు తగినవాడేనా' అని ఆలోచించలేదు" అనేసింది విమలాంబ దుఃఖభారంతో.

"సరేలే. సరేపద. గదిలో ఎక్కడా ఏ కవరూ లేదు. పద, నేను భోజనం చెయ్యాలి."

ఇద్దరూ వెళ్ళిపోయారు డైనింగ్ హాలులోకి. విమలాంబ వడ్డిస్తుంటే ఆయన భోజనమారంభించాడు. అందులో అమాంతం ఒక పలుగురాయి పంటి కింద కొచ్చింది.

"ఏమిటి బియ్యంలో రాళ్ళు? తింటున్న వాళ్ళు మనుషులా దున్నపోతులా?" గయ్యిమని లేచాడు శ్రీనివాసం.

"పిలు ఆ వంట రాముణ్ని" కేకలు మేడ మీదకూడా వినిపించాయి. మేడ వరండాలోకి వచ్చి చూసిందమృత. అక్కడికి స్పష్టంగా మాటలు వినిపిస్తున్నాయి.

'ఏదో పొరపాటంటూ' విమలాంబ సర్దబోయింది.

"ఇవాళ పొరబాటని వూరుకుంటే రేపు తెళ్ళు జెర్రులు కూడా వస్తాయి. చెప్పు వాడికి. ఇలాగయితే వీళ్ళందర్నీ పని మానిపించేస్తాననీ, ఇంట్లోంచే గెంటేస్తానని చెప్పు."

అమృత వెంటనే అనుకుంది. మరిప్పుడు కొడుకుని గెంటించేస్తారా? ఇంకా స్తూరం ఆలోచిస్తే ఇంట్లోంచి తనూ వెళ్ళి పోవాలిగా? దేశంలోంచే వెళ్ళిపోవాలిగా? అంధరూ తినే బియ్యంలో రాళ్ళు కలిపిస్తున్నందుకూ?

ఆ సాయంత్రం దాకా అమృతకిదే ఆలోచన.

విమలాంబకు జరుగుతున్నదంతా తెలుసా? అందరి నోళ్ళళ్ళో మట్టిగొట్టి తామింత గొప్పవాళ్ళ మవుతున్నామనీ తెలుసా? తను తింటున్నదీ ఆ పాపపు కూడేననీ తెలుసా?

ఆ రాత్రి ధైర్యం చేసి అడిగేసిందా మాట!

"మామగారికేవేం వ్యాపారాలున్నాయి."

"చాలా వున్నాయి. ఏం? ఎన్ని వుంటే ఏం?"

"అన్నీ న్యాయమైనవీ ధర్మమైనవేనా అని?"

"కాదు."

"మరి మామగారు అన్నంలో మట్టిగడ్డలొచ్చాయని కేకలేశారు? ఆ బియ్యం మన ఫ్యాక్టరీల్లోంచి వచ్చినవేగా."

"అదా! మనకు వ్యాపారం బియ్యంరావు. వేరే ప్రత్యేకం వస్తాయి. వాటిని పనివాళ్ళు మళ్ళా బాగుచేస్తారుగూడా.... మీ మామగారు అందుకు కోప్పడలేదు. రాయి పంటి కిందపడి కదులుతున్న పన్ను ఊడింది. ఆ నొప్పితో అంత కోపం వచ్చింది."

ఆ సమాధానం ఏమీ తృప్తి కలిగించ

లేదు అమృతకు.

"నేనూ ఓ సంగతి చెప్పాలనుకుంటున్నాను" అంది తర్వాత విమలాంబ.

"ఏమిటి!...చెప్పండి."

"ప్రపంచంలో ఎప్పుడూ ఎల్ల కాలాల్లోనూ మంచీ ఉంటుంది, చెడూ వుంటుంది సమానంగా. చెడును తుడిచేసి మంచినే ప్రతిష్ఠించాలన్న ప్రయత్నం ఎప్పుడూ జరుగుతున్నదే. కాని ఏ మహాత్ముడి వల్లా అది సాధ్యం కాలేదు.... కనక..?"

"కనక?"

"కనక ఆ మహాత్కార్యం మన వల్లా కాదు."

"అంటే కళ్ళు మూసుకోవాలంటారా?"

"కాదు. ప్రపంచంలో మంచి ఉండాలని కోరుకుంటూనే, మనకు మనం 'మంచి' గా ఉండాలి. అదొక్కటే మార్గం".

"అంటే, చెడును చూసినా పట్టించుకోవద్దంటారా?"

"ఇప్పటికి నీకు నేనదే చెప్పగలిగింది" అంటూ గంభీరంగా విమలాంబ వెళ్ళిపోయింది.

అమృత ఆలోచిస్తూ ఆగిపోయింది.

ఎవరికోసం ఈ మాటలీమె చెప్పటం? శ్యామలరావును గూర్చా? భర్త శ్రీనివాసం గార్ని గూర్చా? ఎందుకీ హితోపదేశం?

మర్నాటిదాకా అదే ఆలోచన. మర్నాడు అమ్మలు వచ్చింది. అమ్మల్ని ఒంటరిగా గదిలో కూర్చోబెట్టి అంతా చెప్పిందిఅమృత. అంతా విని ఆశ్చర్యపోయింది అమ్మలు. భోగభాగ్యాలున్న ఇంట్లోపడి అమృత సుఖపడుతోందని అందరూ భావిస్తున్నారు. శ్రీనివాసం గారి కోడలని చాలామంది ఈర్ష్య పడుతున్నారు. కాని నిజానికా భోగమంతా చర్మగత భోగమేనా?... అమృత ఇంత 'కుత కుత' లాడిపోతోందా?

వాళ్ళిద్దరూఅలా చాలా సేపు మాట్లాడుకున్నారు. చీకటి పడిపోయిందికూడా.! అంతలో నిశ్శబ్దంగా శ్యామలరావు గదిలోకి వచ్చాడు అనుకోకుండా. శ్యామలరావంత పెందరాళే ఈ మధ్య ఎప్పుడూ రాలేదు. మరావేళ అంత..!! అదో ఆశ్చర్యం. అమ్మల్ని అతను చూసికూడా చాలా కాలమయింది!. అదొక విస్మయం; ఇరు పక్షాలవారికీ...!

"అమ్మలు కాస్త ఒళ్ళొచ్చినట్లుందే!" అన్నాడు శ్యామలరావు.

ఆ పలకరింపులోనే కొంత శృంగారం. అమ్మలు ఒళ్ళంతా జలదరించిపోయింది.

"కాస్త కాఫీ తెచ్చిపెట్టు అమృతా" అన్నాడు శ్యామలరావు ఆప్యాయంగా. అదొక వింతల్లోవింత. ఎంతోసంతోషంగా అమృత కాఫీ కోసం బయటికి వెళ్ళింది. వెళ్ళి మేడమీదనుంచే ఓ కేకవేసి తిరిగి లోపలకొచ్చేసరికి......

బలవంతాన అమ్మల్ని ముద్దుపెట్టుకోబోతున్నాడు శ్యామలరావు.

నిర్జీవ ప్రతిమలాగ నిలిచిపోయింది అమృత. గిజగిజలాడిపోతోంది అమ్మలు. ఏదో మరదలితో వేళాకోళం ఆడినట్లు పకపకా నవ్వుతున్నాడు శ్యామలరావు.

* * *

ఆ రోజు నుంచీ తిరిగి అమృతను చూడటానికి రావటమే మానేసింది అమ్మలు. ఆ రోజు నుంచీ భర్త మొహం చూడటమే

మానేసిందమృత. పగలు వెళ్ళి విమలాంబ పక్కలో, తల్లి పక్కలో పిల్లలాగా పడుకునేది. రాత్రిళ్లు ఒంటరిగా తన గదిలోనే. భర్త కోసం ఎదురు చూస్తూ ఉండటం మానేసింది. శ్యామలరావు వస్తే ఎప్పుడో వచ్చేవాడు. ఎప్పుడో పడుకుని నిద్రపోయేవాడు.

అమ్మలు వెళ్ళే 'లేడీస్ క్లబ్' వారందరూ కలిసి ఒక పిక్నిక్ ఏర్పాటు చేశారు. అంతా బస్‌లో ముప్పై మైళ్లు వెళ్ళి ఒక ఫారెస్ట్ ఏరియా చూసి రావటం కార్యక్రమం. 'దానికి వెళ్ళి వస్తానని' అమ్మలు తల్లిదండ్రుల అనుమతి నడిగింది.

"అమృతకు ఫోన్‌చెయ్యి. వస్తానంటే దాన్నిగూడా తీసుకెళ్ళమంది సునంద."

''ఇద్దరూ వెళ్ళిరండి సరదాగా" అన్నాడు శ్రీధర.

అమ్మలు అమృతకు ఫోన్ చేసింది. అమృత గూడా అత్తగారినడిగి అనుజ్ఞ తీసుకుని 'సరే'నన్నది. ఏదో కొంత మార్పుగా వుంటుందిగా అని బయలు దేరింది.

అందరూ పెద్ద బస్సులో పిక్నిక్ వెళ్లారు. సరదాగా రోజంతా గడిపి. రాత్రి ఎనిమిది గంటలవేళ తిరిగివచ్చారు.

దారిలో ఓ చోట ఆగినపుడు చాలామంది జనం అది ప్రయివేటు బస్ అని తెలియక ఎగబడ్డారు. అందులో జేబుదొంగ ఒకడు 'జానకమ్మ' మెళ్ళో రవ్వల నెక్లెస్ కొట్టేశాడు; ఎలా లాగేశాడోగాని. మరు క్షణంలో ఆమె కేకలు పెట్టింది.అందులో సబ్‌జడ్జిగారి భార్య గనుక, వెంటనే పదిమందీ గూడారు. అందులో ఒకణ్ణి చావదన్నారు. అందులో ఒక మీసాల ఎనుబోతు మరీ తన్నాడు వాణ్ణి.

'లేదు బాబో' అని వాడు ఒకటే గోల!

అంతా చూస్తూ అమృత చుట్టూ అంతా కలియ వెతికింది.

"వీడుకాదు. వాణ్ణే! వాణ్ణి వెతకండి!" అంటూ వేరొక దిక్కు చూపించింది. అక్కడొక తోడుదొంగ తచ్చాడుతున్నాడు. పది మంది ఎగబడి మొత్తానికి వాణ్ణి పట్టుకున్నారు.కొట్టలేదుగాని జేబులు వెతికారు. నగ మాసిన చొక్కా పక్క జేబులోనే వుంది.

"వీడు తీసి వాడికిచ్చాడు కాబోలు!" అన్నారంతా.

"భలే తెలివైన పిల్ల. నిమిషంలో పట్టేసింది " అన్నాడు ఒకడు.

"అనుభవం! అనుభవమయ్యా అదీ.. అనుభవస్తురాలన్న మాట !" అన్నాడు మరో అనుభవైక వైద్యుడు.

మొత్తానికి ఊళ్ళో పెద్ద గాలి దుమారం లేచింది.

"శ్రీనివాసంగారి కోడలుకి పూర్వాశ్రమంలో జేబుదొంగల్తో అనుభవం వుంద'ని కొందరూ,

అసలు వాళ్ళల్లోనే పుట్టి పెరిగిందట" అని కొందరూ!

అలా ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు వాగుతున్నారు.

ఈ మాటలన్నీ శ్రీనివాసంగారి దగ్గర కూడా వెళ్ళాయి. ఆయన విమలాంబతో చెప్పాడు.

"పిల్ల బుద్ధిమంతురాలు. కనబడ్తూనే వుంది గదా! ఇక అడగట మెందుకూ?" అన్నది.

"అవునో కాదో తెలుసుకోవటానికి."

"అవునంటే పిల్లను వదిలేద్దామం

 

టారా."

"వదిలేయటం మనవల్ల కానేకాదు.ఇక ఆ పిల్లను బయటకు పంపటమన్నా మానేద్దాం."

"అలాగే బయటికి పంపద్దు. సరిపోలే! ఇక అడగటమెందుకూ?"

"సరేకానియ్యి. నీ ఇష్టం నీ కోడలు. నాకెందుకు? అసలే చస్తుంటే"

నిజానికి అంత ధనవంతుడయిన శ్రీనివాసం ఈమధ్య బాగా సతమతమవు తున్నాడు. మళ్ళా ఎలక్షన్లు అంటున్నారు. తను అధికార పక్షంవాడు. అదే పాలక పక్షంగా రావటం ఈతడవ ఒట్టిదే అంటు న్నారు. ప్రతిపక్షంవారు అధికారంలోకి వస్తే..తనపని గల్లంతే! వచ్చే ప్రతి పక్షం తన చేతి కిందికి రావటానికి మళ్ళా నెలలూ, సంవత్సరాలూ పడ్తుంది. ఈ లోగానే ఇబ్బంది అంతా! నిజానికాయనకీ తడవ తడవకీ పార్టీ మార్చటం ఇష్టం లేదు. కాని వ్యాపారరీత్యా అది అవసర మౌతోంది.

శ్రీనివాసం వెళ్ళిపోయాడు.విమలాంబ అమృత దగ్గర కెళ్ళింది.

"బస్ దిగుతుంటే ఏదో గొడవ జరి గిందట! ఏమిటమ్మా?"

అత్తగారికి కథంతా అమృత చెప్పే సింది. ఆ తర్వాత అత్తగారిని "దొంగను గుర్తించి పట్టివ్వటం తప్పా" అన్నది.

"కాదు; కాని అలా ఎంతమందిని పట్టిస్తావ్ ? మరి మీ మామగారిని కూడా పట్టిస్తావా?'' అన్నది.

నిర్ఘాంతపోయిందమృత. "తనకు తెలి సిందంతా ఈమెగారికి కూడా తెలుసా ? అంతా గరళంలాగ కంఠంలోనే పెట్టుకుని మిన్నకుంటోందా ఈమె? అత్తగారింత ఓర్చుకుందా?" ఒట్టినే చమటలు పట్టి పోయాయి అమృతకు.

తనది తప్పేననుకున్నా..కోడలు చిన్న తప్పుచేస్తే వచ్చి అడుగుతున్నారే ? కొడుకు ఎన్ని తప్పులు చేసినా తప్పు బట్టరేం? కళవళలాడిందమృత.

నిజానికావసరం లేదు. శ్రీనివాసం తగిన కట్టుదిట్టాలన్నీ చేశాడు ఇప్పుడు. శ్యామలరావు చేతికంతగా డబ్బు అంద టంలేదు. వ్యాపారం బాధ్యత కొంత మీద వేశాడు గనుక దుబారాగా తిరిగే అవకాశం తగ్గిపోయింది. శ్యామలరావుకు ఫొటో స్టూడియోకి వెళ్ళే పనేమీ లేకుండా చూసి కత్రీ మందుల కంపెనీని మేనేజ్ చెయ్య మన్నారు. సూటూ బూటూ వేసుకుని అక్కడ కూర్చుంటే చాలుక త్రీమందులు అవే తయారయిపోతాయి. డబ్బు మాత్రం చేతి కందనివ్వటంలేదు. అడి గితే తండ్రి పది ప్రశ్నలడిగి అడిగిన దానికి కొంత తగ్గించి ఇస్తున్నాడు. విమ లాంబతో చెప్పినా లాభం లేకపోయింది. గుమాస్తాల నడగటం తనకు పరువు తక్కువ. ఇకపోతే అమృతనే అడగ వలసి వస్తోంది. దగ్గర చేరి అమృతచేత విమలాంబ నడిగించాల్సివస్తోంది.

అలా అడుగుతూనే ఉన్నాడు శ్యామలరావు ఎదో కొంత రాలుతూనే ఉంది. అయినా ఆ బుద్ధి ఊరుకోలేదు. పోనీ, వెలవెలదులుకాకపోతే ఫ్యాక్టరీలో కొందరు కొలువు వనితలున్నారుగా అను కుని కొన్నాళ్ళు వాళ్ళందరినీ చూసి సంతోషించాడు. ఆ తర్వాత వాళ్ళల్లో కొందర్ని అనవసరంగా పిలిపించి ప్రశ్నలువేసి అవస్థలు పెట్టాడు. కడుపు కక్కుర్తికి ఉద్యోగంలో చేరినవాళ్ళేగనక ఆ ఆడవాళ్ళు నవ్వి వెళ్లిపోయే వాళ్ళు.

కాని ఆ రోజున ఓ అమ్మాయి చెయ్యి పట్టుకుని దగ్గరకు లాక్కోబోతే ఛటా లున వచ్చి చెయ్యి గూబకు తగిలింది. ఏం జరిగిందో తెలియకుండా కళ్ళు తిరి గాయి. తర్వాతెప్పుడో తెలిసింది. ఆ అమ్మాయి తాలింఖానాలో తయారయిన అమ్మాయనీ, ఇది వరలో కొందరికి చెంప పగిలిపోయిందనీ.

"నాకు ముందే ఎందుకు చెప్పలేదు" అంటూ ఆ కొందర్నీ కేకలేశాడు.

అందరూ చెంపలు తడుముకున్నారే గాని సమాధానం చెప్పలేదు.

ఆ అమ్మాయిని వెంటనే డిస్‌మిస్ చేస్తూ ఆర్డర్లు వేశాడు. కాని ఆ అమ్మాయి రోజూ పనిలోకి వస్తూనే వుంది.

ఇదేమిటంటే "నాన్నగారి దగ్గర్నుంచి ఆర్డర్లు రాలేదుగా" అన్నాడు పెద్ద గుమాస్తా.

ఆర్డర్లు ఆ వారంలోనూ రాలేదు. ఆ నెలలోనూ రాలేదు. ఆ తర్వాత నెమ్మ దిగా తెలిసింది తన ఆర్డర్లకంటె ముందే ఆ అమ్మాయి తండ్రి వెళ్ళి నాన్నగారితో చెప్పివచ్చాట్ట!

అప్పుడు తెలిసి వచ్చింది శ్యామల రావుకు తానెవరో, తనస్థితి ఏమిటో...!

అప్పట్నించీ శ్యామలరావు ఆ ఆడ పిల్లలకు కాస్త దూరంగానే ఉంటు



న్నాడు.

* * *

శ్రీనివాసం మొగ్గు జూపిన అధికార పార్టీ ప్రభుత్వాన్ని అమాంతం తల్ల క్రిందులు చేసారు ప్రజలు. నిన్నటి మంత్రి ఇవాళ భికారి అయ్యాడు.

కొత్త మంత్రివర్గం అధికారాన్ని అధిష్ఠించగానే శ్రీనివాసాన్నో 'ఆట' పట్టించింది.

మొత్తానికి శ్రీనివాసం చేస్తున్న అధిక లాభాల వ్యాపారాలన్నీ మూతపడి



పోయాయి. రాబడిపన్ను ఒక్కసారిగా లక్షల్లో కట్టవలసి వచ్చింది. మహారాజు లాగ బ్రతికిన శ్రీనివాసం, బ్రతికిచెడిన వాడయ్యాడు. ఇప్పుడు ఆత్మరక్షణార్థం పాటుపడుతున్నాడు శ్రీనివాసం. ఎప్పు డన్నా అరెస్ట్ చేస్తారేమోనని, ముందే 'ఏంటిసి పేటరీ బెయిల్' కూడా సిద్ధం చేసుకున్నాడు. ప్రభుత్వం అతన్ని ఆ స్థితిలోనే ఉంచేసింది. జైలుకయితే వెళ్ళ లేదు కాని గర్వం మాత్రం అణిగింది.

నిరంతర భయం. దానితో బి.పి. పెరిగిపోయాయి.

విమలాంబ మాత్రం నిండుకుండలాగ రోజులు దైవప్రార్థనతో దొర్లిస్తోంది.

ఇక శ్యామలరావు ఆటకట్టినట్టే అయింది. అన్ని ఆటలూ ఇంట్లోనే, పడకగదిలోనే...!

అలా ఉండగా ఓ రోజున మళ్ళా అమ్మలు వచ్చింది. అమ్మలు వచ్చిన దగ్గర్నుంచీ ఆ చుట్టుపక్కల్నే తిరుగు తున్నాడు శ్యాం. అప్పుడప్పుడూ ఏవో అసహ్యమైన 'జోక్సు' వేస్తూనేఉన్నాడు. వాటికి అమ్మలు నవ్వటంలేదు. ఏ విధమైన ఉత్సాహం చూపటంలేదు. అమృత చూసీ చూడనట్లూ, పట్టీపట్టనట్లు ప్రవర్తిస్తోంది. అయినా శ్యామలరావు 'జోక్సు' వేస్తూనే ఉన్నాడు.

సాయకాలం నాలుగయింది.

"ఇవ్వాళ అమ్మలు కూడా వచ్చింది గనుక ముగ్గురం సినిమాకు వెళ్ళవల సిందే" అన్నాడు శ్యామలరావు.

"నాకు వీలుండదు; వద్దన్న"ది అమృత.

"అయితే మేమిద్దరమే వెళ్తాం. ఏం అమ్మలూ?" అన్నాడు శ్యాం.

"అమృత రాకపోతే నేనూ రాను" అంది అమ్మలు.

శ్యామలరావుకి సమాధానం అను కూలంగానే కనిపించింది.

మరింత విజృంభించాడు.

"కానివ్వండయితే! వెళ్ళి ఫోన్‌లో టిక్కెట్లు బుక్‌చేసి వస్తాను. ఇంతలో మీ ఇద్దరూ తయారవండి" అంటూ శ్యామలరావు వెళ్ళిపోయాడు.

అతని పంతం అమ్మలుకు ఇబ్బందిగానే వుంది. అమృతకీ ఇబ్బందిగానే వుంది. ఒంటరిగా తనువెళ్తే అమృత ఏమను కుంటుందో, తర్వాత ఏమవుతుందోనని అమ్మలుకు సందేహం.

తనూ వెళ్తే ఏమవుతుందో, వెళ్ళక పోతే ఏమౌతుందోనని అమృతకు సందేహం!

"సరేకానియ్యి! దైవం ఎలా తలిస్తే అలా" అనుకుంది అమృత.

ఇంతలో శ్యామలరావు మూడు టిక్కెట్లూ బుక్‌చేసి పైకి వచ్చేశాడు.

"కానివ్వండి, తయారవండి. ముందు హోటలుకు, ఆ తర్వాత సినిమా" అన్నాడు.

అమ్మలు ఆరోజు చక్కగానే తయారై వచ్చింది.

కాని చాలా సేపటిగ్గాని అమృత స్నానా నికి వెళ్ళలేదు. శ్యామలరావు తొందర వల్ల చివరకు వెళ్ళక తప్పనూలేదు.

గదిలో ఒంటరిగా అమ్మలు ఒక్కతే వుంది.

బాత్‌రూంలో కుళాయి నీటిశబ్దం విన బడుతోంది.

శ్యాం చూపులు శూలాల్లా గుచ్చుకుంటు న్నాయి అమ్మలుకు.

నిశ్శబ్దం రాజ్యమేలుతోంది.

 

శ్యామలరావు చూపుల్ని భరించలేక పోతోందమ్మలు.

తటాలున అమ్మలు లేచి గది బయటికి చరచరా నడిచింది. శ్యాం అదిరిపడ్డాడు. గట్టిగా పట్టుకున్నాడు - మాట్లాడటాని క్కూడా వీల్లేకుండా వుక్కిరిబిక్కిరయ్యేట్లు.

అంతలో అతని వెనకే తలుపు తెరుచుకుంది.

ఆ వాకిట్లో విమలాంబ!

స్నానాల గదిలో కుళాయి నీరు జారుతూనేఉంది నిర్విరామంగా. విమలాంబ ఆశ్చర్యంతో షాక్ తిన్నా వెంటనే తలుపు మూసేసింది. అవతల ఎవరో పరిచారకులమీద తన ఆగ్రహం వెళ్ళగక్కుతోంది.

అమ్మలు శ్యాంను వదిలించుకుని దూరంగా వెళ్ళి బుగ్గల్ని టవల్ తో తుడుచుకుంటుంటే... "ఫర్వాలేదు ! ముద్దేగా" అన్నాడు సవిలాసంగా.

మరి కాసేపటికి అమృత స్నానంచేసి వచ్చింది.

ముగ్గురూ బయలుదేరారు.

"ఎక్కడికిరా బయలుదేరారు?"

విమలాంబ కర్కశంగానే అడిగింది.

"ఇక్కడికే- సినిమాకు" తేలిగ్గా జవాబు చెప్పాడు.

"అమ్మలు కూడానా?"

"ఆఁ మాతో అమ్మలుకూడా."

"వాళ్ళ ఇంట్లో చెప్పివచ్చిందా మరి!"

"వెళ్తూ చెప్పేవెళ్తాం."

"వాళ్ళ అమ్మగారు పంపితేనే వెళ్ళండి."

"అలాగే!"

"తిరిగి వచ్చేటప్పుడు... మళ్ళా అక్కడే దింపి రండి. మళ్ళా పొద్దుపోతుంది."

"అలాగే!"

"అలాగే అంటేకాదు."

"అలాగే, అలాగే..."

విమలాంబ నిస్సహాయంగా నిల్చుండిపోయింది. కారు సరాసరి సినిమాహాలు లోనే ఆగింది. "మరి ఇంటిదగ్గర చెప్పవద్దా?" అంటే శ్యామలరావు "డ్రైవర్ తో కబురుచేద్దాంలే" అన్నాడు అమృతతో. కాని అసలు చేసినట్లే లేదా కబురు. ముగ్గురూ వెళ్ళి హాల్లో కూర్చున్నారు. అదో మలయాళీ సినిమా. అంతా సెక్సీగా గడిచిపోతోంది. ఇద్దరి మధ్యలో అమృత కూర్చుని ఉంది. కాని అమృత మీద వేసిన శ్యామలరావు హస్తం, అమృత మీదుగా పోయి, అమ్మలు భుజంమీద సరాగాలాడుతోంది. ఏంచేసినా హాలులో అల్లరిగదా అని అప్పచెల్లెళ్ళిద్దరూ మిన్నకున్నారు.

సినిమా అయిపోయింది. ఆ 'రష్'లో శ్యామలరావు 'అమ్మల్ని' ఒరుసుకుంటూనే కిందికి నడిచాడు - అమ్మలు ఎంత తప్పుకు నడుస్తున్నా.

కారులో శ్యామలరావు డ్రైవర్ని అడిగాడు-

"అమ్మలమ్మగారు మాతో సినిమాకు వెళ్ళారని వారింట్లో చెప్పావా?"

"చెప్పాను సార్!"

"ఏమన్నారు?"

"సరే లెమ్మన్నారు."

"సరాసరి ఇంటికే పద. అమ్మలు కూడా మాతోనే భోంచేసుంది."

"అమ్మల్ని ఇంటివద్దే దింపేద్దాం" అనుకున్నది అమృత. కాని పైకి ఆమాట అసలేదు. అంటే అమ్మలు ఏమను

కుంటుందో—

అదొక మొహమాటం.

అందరూ ఇంటికి చేరారు.

హాలులో ఎదురుగా విమలాంబ!! ఆమె ఇంకా మేలుకునే వున్నదే! అందరూ అమితంగా ఆశ్చర్యపోయారు. సరాసరి మేడమీదకే నడిచారు.

అక్కడే భోజనాలయినాయి.

అంతవరకూ విమలాంబ మేలుకునే వుంది. ఆతర్వాత పూజామందిరంలోకి వెళ్ళింది. తన ఇష్ట దైవానికి పదే పదే నమస్కరించింది. తర్వాత తన గది లోకి వెళ్ళిపోయింది. అంతా భగవదను గ్రహం అనుకున్నదేమో!

అమ్మలుకు వేరే గదిలో పక్క ఏర్పాటు చేశారు. అమ్మలు నిద్ర కూడా పోయింది. తర్వాత ఆ మేడంతా గాఢాంధ కారంలోనే మునిగిపోయింది — ఒక్క అమృత గదిలో తప్ప.

అక్కడ శ్యామలరావే మాట్లాడు తున్నాడు—

"మంచిదానివి కదూ!అమృతం లాంటి దానివి. ఒక్కసారి గదిలోకి అమ్మల్ని పిలు"

అమృతను మరీ లాలించసాగాడు శ్యామలరావు. "నా ముద్దుల అమృతవి కదూ? ఈ ఒక్కసారే! తర్వాత అమ్మలు పేరెత్తితే అప్పుడను. అమ్మ మీద ఒట్టు ...ఏం పిలుస్తావా... పిలవ్వా? నువ్వు పిలిస్తే అమ్మలు వద్దనదు. ఇదివరకే ఒప్పుకున్నది. నీదే ఆలస్యం"

ఇది నిజమేనేమో అనుకుని భయ పడింది అమృత. అయినా మాట్లాడలేదు.

"ఈ ఒక్కసారీ నా మాట వింటే జన్మాంతం నీ మాట నేను వింటాను. ఏం... పిలవ్వు. ఒక్కసారి"

ఈ అనునయానికి ఒళ్ళు మండి పోతోంది. అయినా మాట్లాడలేదు అమృత.

"ఇవి చేతులు కావు. కాళ్ళు..." నాలుగు ముద్దులు పెట్టాడు శ్యాం.

అయినా అమృత మాట్లాడలేదు.

"సరే పిలవ్వు కదూ!... సరేలే! ఇహ ఇంతే మన ఇద్దరికీ. ఇంతేనా మరి?"

"ఇంతే ఇంతే ఇంతే" అనుకుంది అమృత. పైకి కాదు, లోపల.

అల్లాగే మరో అయిదు నిమిషాలు.

అమాంతం లేచి కూర్చున్నాడు శ్యామలరావు.

అదిరిపడి వెనక్కి తిరిగింది అమృత.

వెకిలిగా నవ్వి మీదపడ్డాడు శ్యామల రావు. కాసేపటికి మళ్ళా మొదలెట్టాడు. "అమ్మలు మీద నాకేం మమకారం లేదు. నేనెందరో అమ్మాయిల్నెరుగుదును. నేన డిగేదల్లా ఒక్క ముద్దు. అమ్మల్ని నేనే మన్నా బలవంతం చేస్తే అప్పుడను".

అప్పటికీ అమృత ఏమీ అనలేదు. అటు తిరిగి పడుకుంది.

"ఇదెక్కడి రంపపు కోతరా భగవంతుడా"

అనుకుంది.

"సరే! నీకంత కోపంగా వుంటే... నేనేం చేస్తాను?" అంటూ శ్యామలరావు మరో పక్కకు తిరిగి పడుకున్నాడు. మరో అయిదు నిమిషాల తర్వాత నెమ్మ దిగా లేచాడు. అమృత నిద్ర పోయిందను కున్నాడు. నెమ్మదిగా పక్క వదిలి బయ టికి నడిచాడు. మరో అయిదు నిముషాలు గడిచినా...

శ్యామలరావు తిరిగి రాలేదు.

అమృత ఓపిక నశించింది.

ఏమయితే అయిందనుకుని లేచింది. సరాసరి నడిచింది బయటకు.

తర్వాత...

అమ్మలు ఉన్న కిటికీ దగ్గర నిలబడి వింటున్నది. మొదట ఏమీ అర్థం కాలేదు. తర్వాత శ్యామలరావు లోపలే ఉన్నట్లు అర్థమయింది.

"అమృతకు తెలిస్తే...!!" అంటోంది అమ్మలు.

"తెలుసు"

"తెలుసా?"

"ఆఁ!"

"ఏమనుకుంటుందో!"

"ఏమీ అనుకోదులే; ఫర్వాలేదు."

అమృత అరికాలు మంట నెత్తికెక్కిపోయింది. అగ్నిజ్వాలలా వెలిగి పోయింది. గబగబా తనగదిలోకి వెళ్ళిపోయింది. ఇక భరించలేక పోయింది. ఈ పనికి అమ్మలుకూడా అభ్యంతరం లేదా?

ఆ ముందు సంగతి ఊహించలేక పోయింది.

పక్కమీద పడి ఏడ్చింది. మరి ఏడప లేకపోయింది ఆవేశంగా లేచి సర్రున మేడకిందికి పరుగెత్తింది.

హాలులో ఇల్లంతా అదిరిపోయేట్లు ధన ధనా నడిచింది. ఇక సింహద్వారం దాటి బయటపడితే...

మళ్ళా ఈ గుమ్మం తొక్కనక్కర్లేదు.

తొక్కితే ఒట్టు. తన భర్త తన కళ్ళ ముందే తన చెల్లెల్ని......

కాని సింహద్వారం దగ్గర...

ఎదురుగా అత్తగారు!!విమలాంబ... అడ్డంగా నిలిచి వుంది!!

ఈవిడ మేలుకొనే వుందా!!

"అత్తయ్యగారూ" అంటూ ఆ కాళ్ళ మీద పడిపోయింది.

మృదువుగా అత్తగారి హస్తాలు అమృత భుజాలమీద వాలాయి.

"ఆ మాట నేనిప్పుడు అనలేనమ్మా. ఏ మాట అనటానికీ నాకు నోరు రావటం లేదు. ఆ దుర్మార్గుణ్ని కన్నతల్లిగా, నేను నిన్నేమీ అనలేను, ఇక నీ ఇష్టం. ఈ ఇంట్లో ఉన్నా సరే, ఈ వాకిలి దాటి వెళ్ళినా సరే!" అంటూ వాకిలి తలుపులు బార్లా తన చేతుల్తోనే తీసి పెట్టింది. తను పక్కకు తొలిగి నిలిచింది.

ఒక్క నిమిషం తటపటాయించిందమృత ! బయటకు వెళ్ళిపోవటమా? వెనక్కు తిరిగి వెళ్ళిపడి ఉండటమా?... కాని అది ఒక్క నిమిషం.. వెనక్కి తిరిగి మేడగది వైపు చూసినంత వరకే. వెంటనే ఆవేశం...ఆక్రోశం...!!అమృత సింహద్వారం దాటి బయటికి అడుగు వేసేసింది.

మరి వెనక్కి తిరగలేదు.

మరో నిమిషం ఆ ఆవరణలో ఆగలేదు.

వెనకనే నెమ్మదిగా తలుపులు మూసుకున్న సంగతీ గమనించలేదు.

* * *

అమృత సరాసరి శ్రీధరం ఇంటికి ఆ అర్ధరాత్రి వేళ నడిచే వెళ్ళింది.

ఎక్కడో కుక్కలు అరుస్తున్నాయి. అప్పుడోకారూ, అప్పుడో మోటార్ సైకిలూ రొద పెడుతూ దూసుకుపోతున్నాయి.కాని అంతకంటె పెద్ద రొద పెడుతోందా వయసు పిల్ల హృదయం. శ్రీధరం భవంతి గేటుదాటి వెళ్ళింది లోపలికి. అక్కడ మొదట నెమ్మదిగా తలుపు

కొట్టింది. తర్వాత కాలింగ్‌బెల్ గణగణ లాడించింది.

శ్రీధరమే తలుపులు తెరుస్తూ కనిపించాడు. ఆ వెనకనే సునంద.

"ఇదేమిటి అమృతా... ఇంత అర్ధ రాత్రి...!!

"ఇక నేనాయనతో కాపరం చెయ్యలేను. నేనింక ఇక్కడే వుంటాను" అంది అమృత తండ్రితో.

"ఆగు!"

"లోపలికి రానివ్వండి. ఏమిటో కనుక్కుందాం" అంది సునంద. వెనకనుండి

"అక్కరలేదు. ఏదో అల్లరి పని చేసి వుంటుంది. వాళ్ళు తిట్టివుంటారు. ఇది పరుగెత్తుకొచ్చి ఉంటుంది"

"అదేదో చెప్పనివ్వండి ముందు"

"పెళ్ళయిన పిల్ల అత్తవారింట్లోనే ఉండాలి. అదే మర్యాద...అదే గౌరవం అందరికీ"

దభాలున తలుపులు మూసేశాడు శ్రీధరం. మూసేశాడే గానీ దుఃఖం ఆపుకున్నా ఆగలేదు.



బయట పొద పొదలుగా వెలుతురు వున్న వాకిట్లో ఒంటరిగా అమృత.

నెమ్మదిగా వెనక్కడుగులు వేసింది అమృత.

రోడ్డుమీద నిలబడింది ఒంటరిగా... కట్టుకున్న బట్టలతో. ఇక ఆలోచించటానికూడా ఏమీ మిగలలేదు.

నిర్మానుష్యమైన ప్రపంచంలో నిర్మానుష్యమైన రోడ్డు వెంట నడుస్తోంది అమృత.

నడుస్తూనే వుంది.

ఎక్కడికి,ఎట్లా అన్న ప్రశ్నలు లేవు. నడవటమే పని.

"రాముడు కనిపిస్తే ఎంత బాగుండును! కాని... రాముడిప్పుడు ఎట్లా కనిపిస్తాడు?"

ఏదో కారు ఎదురువచ్చింది. లైట్లు కళ్ళమీదే పడి కళ్ళు జిగేలుమన్నాయి.

కారు—

దాని వెనకనే మరో కారు.. ఆవెనకనే ఇంకొకటి. వరసగా వెళ్తున్న కార్ల లైట్లన్నీ అమృత కళ్ళ ముందుగా, కళ్ళ మీదుగానే పోతున్నాయి జిగేలుమంటూ. లైట్లెక్కడ! కార్లెక్కడ! కార్ల ముందు కళ్ళెక్కడ! కళ్ళ ముందు కార్లెక్కడ! లైట్లెక్కడ! చీకట్లెక్కడ? కళ్ళు తిరిగి తిరిగి పడిపోయింది రోడ్డు మీద... గంట తర్వాత ఎవరో కారులో వెళ్తూ వెళ్తూ చూసి ఆగారు. దిగి చూశారు.

"ఎవరో గొప్పింటి పిల్లలాగేవుంది."

"అవును పాపం ఏమిటీఖర్మ.!"

"ఏక్సిడెంటేదో జరిగినట్లుంది!"

"పోనీ- హాస్పటల్‌కు తీసికెళ్ళి..."

అంతలో కాస్త కళ్ళుతెరిచిందిఅమృత.

"ఎవరమ్మా మీరు?"

"........."

"ఖంగారు పెట్టకండి... నెమ్మదిగా

"అడగండి."

"ఎవరమ్మా మీరు?"

"ఏవూరమ్మా మీదీ?"

"నీ పేరు ఏమిటమ్మా?"

అమృత నెమ్మదిగా మెళ్ళో బంగారు గొలుసుల్ని సర్దుకుంది. అవి వున్నాయింకా ఓపిక కూడదీసుకుని చేతులెత్తి సమస్కారం చేసింది. తర్వాత "మావూరు అత్తిలి... మీకు దయవుంటే... దయతలిస్తే ఆ వూరికి చేర్చండి..."

మాటలు స్పష్టంగానే ఉన్నాయి.

తెలిలి తేటగానే వుంది.

నీరసమే నిలువెల్లా. అల్లాగే ఓపిక చేసుకుని అమృతమెళ్ళో గొలుసుతీసి వారికివ్వబోయింది.

అందులో ఇద్దరు ఆడవాళ్ళు-ఇద్దరు మగాళ్ళున్నారు. ఆడవాళ్ళు జాలిపడ్డారు. మగవాళ్ళిద్దరూ మెత్తబడ్డారు.

పోనీడ్రైవర్నిచ్చిఅత్తిలికి పంపిద్దామా?

అలాగేనంటే అల్లాగేనన్నారందరూ.

నలుగురూ సాయంబట్టి అమృతను కార్లో పడుకోబెట్టారు. నలుగురూ ఇంటి వద్దదిగిపోయారు డ్రైవర్‌తో మాట్లాడారు. తెల్లవారేసరికి కారు హైదరాబాద్ విడిచి చాలాదూరం వచ్చేసింది.

మళ్ళా పొద్దు కూకేటప్పటికి కారు అత్తిలి చేరుకుంది.

కళ్ళు తెరచి చూసిందమృత.

అవే, చెరువులు చెరువులనిండా తెల్ల తామరపువ్వులు. తన చీరవంక చూసుకుంది.

తెల్లని చీరే! మాసిపోయివుంది.

అతి కష్టంమీద ఆ డ్రైవర్ కారు రాముడింటి ముందు ఆపాడు. తెల్లబోయివాళ్ళందరూ కారు కిరుప్రక్కలాచేరారు. రాముడు కూడా గుర్తించాడు.

"అమృతా" అంటూ వెర్రిమొహంతో కేకనేశాడు. మరింత ఆశ్చర్యపోయారు చుట్టూవున్నజనం. వెంటనేపక్కఏర్పాటు చేసిఅమృతనుమోసుకొచ్చిపడుకోబెట్టారు నెమ్మదిగా! "పాలుతాగుతావా!" అడిగాడు రాముడు." తులసితీర్థం పోద్దువుగాని... అంది అమృత.

నెమ్మదిగా తనమెళ్ళోగొలుసు ఒకటి తీసి ఆ డ్రైవర్‌కిచ్చి వెళ్ళిపొమ్మంది.

మరింత నెమ్మదిగా తన గాజులు తీసి చుట్టూ చూస్తూ "నీ పెళ్ళాం ఏదీ" అన్నది రత్నం దగ్గరకు వస్తే- రత్నానికి ఆ గాజులు తొడిగింది. తర్వాత మంగళసూత్రాలు తీసి రాముడికిస్తూ..."ఖర్చులకి కావల్సివస్తాయిఉంచు" అన్నది.

గొల్లుమనిఏడ్చాడు రాముడు. అమృతక్కూడా నీరసంలో కన్నీళ్ళు వచ్చాయి. "రాముడూ...రాముడూ! ఏడవకు. ఏడవటానిక్కాదు నేను వచ్చింది. నిన్నుచూసి పోవటానికి... నాకు పెళ్ళయిందని... తగల బెడ్తారేమో!...వద్దు...నాకు పెళ్ళే కాలేదు రాముడూ... పూడ్చే పెట్టండి."

"కాదు...అమృతా నిన్ను... హాస్పటల్లో చేర్చి..."

"నేను బ్రతికి ఇక్కడకు రాలేదు రాముడూ. చచ్చే నిన్ను చూడాలని వచ్చాను. చిన్నప్పుడు నా తల ఒళ్ళో పెట్టుకుని, పాడేవాడివే పాట! ఆ పాట పాడు ఒకసారి... వింటూ ఆనందంగా కళ్ళు మూస్తాను"

ఆ మాటలకు రత్నానికి కూడా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

రాముడు సందేహిస్తుంటే రత్నమే అమృత తల రాముడి ఒళ్ళోకెత్తి పెట్టింది.

అమృత నిద్రపోయింది శాశ్వతంగా.

*

# కలప ఉత్సవాలు



అమెరికాలో జూన్ రెండో తారీకునుంచి జులై నెలాఖరిదాకా కలప పండగలు జరుగుతాయి దేశమంతటా. అడవులు ఆ దేశంలో ఎక్కువ. కలప పరిశ్రమమీద ఆధారపడ్డవాళ్ళు సంతోషంగా ఈ పండగ జరుపుకుని రకరకాల పందాలలో పాల్గొంటారు.

'జాక్ అండ్ జిల్' అనే పందెంలో ఓ పొడుగాటి కలపదుంగ మధ్య ఓ గీత




పెడతారు. అటువైపు ఇద్దరు, ఇటువైపు ఇద్దరు పెద్ద రంపం పట్టుకుని తమ తమ భాగాలని రంపంతో కోసి చిన్న చిన్న ముక్కలు చెయ్యాలి ఆ దుంగని. ఎవరు తక్కువ కాలంలో ఎక్కువ ముక్కలు చేయగలిగితే వారిది గెలుపు. ఈ పందెంలో పాల్గొనే ఆటగాళ్ళు మొగ ఆడ, మొగ ఆడ అయివుంటారు సాధారణంగా.

మరోపోటీ వందడుగులకన్నా ఎత్తుగా వుండే రెండు చెక్క స్థంభాలమీదకి, చేతిలో రంపాలతో పోటీ చేసేవాళ్ళు ఎక్కాలి. ఎవరు ముందు ఎక్కితే వాళ్ళు గెలిచినట్లు. ఎక్కాక ముందర పెట్టిన గుర్తు దగ్గర రంపంతో చివరి భాగాన్ని కోసి త్వరగా కిందకి దిగాలి. ఇది మరో పోటీ!

మరో పోటీలో గొడ్డళ్ళతో ఒకే పరిమాణంలోవున్న కలప దుంగలను ఎవరు త్వరగా మధ్యకి పగలగొట్టగలరో వాళ్ళు గెలిచినట్లు. అరనిమిషంలో 14 అంగుళాల దుంగని పగలకొట్టి ఒక ఆటగాడు బహుమతి పొందాడు.

మరో పోటీలో నీళ్ళలో ఓ పెద్ద దుంగని వేస్తారు. పోటీలో పాల్గొనే ఇద్దరు ఆటగాళ్ళు నీటిలో తేలే ఆ దుంగ మీద నిలబడి తను పడిపోకుండా రెండో వ్యక్తి పడిపోయేలా ప్రయత్నించాలి. నీటిలో పడిపోయిన వ్యక్తి ఓడిపోయినట్లు.

మరో పోటీలో అడ్డంగా రకరకాల పరిమాణాలలో వుంచబడ్డ దుంగలని, కలపని దాటుకుంటూ వెళ్ళి ఓ చోట పాతిన కర్రని కోసి తిరిగి ఆ అడ్డంకులు దాటుకుంటూ బయలుదేరిన చోటికి చేరాలి.

ఈ పోటీలలో చాలామంది ఎంతో వుత్సాహంగా పాల్గొంటారు. దేశం నలుమూలలనించే కాక విదేశాలనించి కూడా చాలామంది వస్తుంటారు. ఈ పండగ ఆరంభ దినాన పెద్ద ఎత్తున వూరేగింపు జరుగుతుంది. మనుషులు రకరకాల వాయిద్యాలు వాయిస్తూ మార్చ్ చేస్తారు. గెలిచిన వాళ్ళకి బహుమతిగా ఇవ్వబడే కలపని వాహనాల్లో వూరేగిస్తారు. గుర్రాల మీద




## ప్రపంచం

కొంతమంది ఆ వూరేగింపులో పాల్గొంటారు. నృత్యాలు, తాడుని ఇరుపక్షాల వారు లాగే టగ్‌ఆఫ్ వార్ ఆట, కప్పల పందెం, నీళ్ళలో పోట్లాటలు మొదలైనవన్నీ అయ్యాక పోటీలు జరుగుతాయి. ఈ పోటీలని చూడటానికి కొన్నివేల మంది వస్తారు.

ఈతకొలనులో దూకడానికి వుపయోగించే స్ప్రింగ్ బోర్డ్‌ని ఓ చోట బిగించి, దాని మీద నించుంటే అందేలా ఓ దుంగని అమరుస్తారు. దాని మీద నిలబడి గొడ్డలితో ఆ దుంగని నరకాలి. ప్రతీ దెబ్బకి నిలబడ్డ ఆ స్ప్రింగ్‌బోర్డ్ కదులుతుంటుంది.

ఈ పోటీల గురించిన వివరాలు ముందరే ప్రకటిస్తారు. దేశం మొత్తం మీద కొన్ని వందల చోట్ల ఈ పండగ జూన్, జూలై నెలల్లో జరుగుతుంది

## మృత్యువు వరించని వ్యక్తి

ఇంగ్లండ్‌లోని ఎక్సటర్ నగరంలో 1895 ఫిబ్రవరిలో ఓ రోజు ఉదయం జైలు అధికారులు జాన్‌లీ అనే నేరస్థుడిని వురి కంబానికి తీసుకువచ్చారు. దాదాపు వందమంది అతను ఉరి తీయబడటంచూడటానికి చుట్టూచేరారు.

వురి తీసే వ్యక్తి అతని తలకి నల్ల సంచీని తొడిగి బలంగా లాగాడు. అప్పుడు జాన్‌లీ కాళ్ళకిందవున్న తలుపు తెరుచుకొని అతను లోపలకి పడిపోవాలి. దానితో అతని కంఠం చుట్టూవున్న తాడు బిగుసుకొని అతను మరణించాలి.

కాని అలా జరగలేదు. అందుమీదట వురి తీసేవాడు విసుక్కుంటూ వచ్చి జాన్‌లీని పక్కకి జరిపి అతని కాళ్ళకింద తలుపుని పరీక్షించాడు అది సరిగానే వుంది.

లీవర్ లాగిచూస్తే తలుపు తెరచుకుంది మామూలుగానే. మళ్ళీ జాన్‌లీ కంఠం చుట్టూ తాడు ముడి తొడిగి అతన్ని ట్రాప్ డోర్ మీద నించోబెట్టి లివర్ లాగాడు.

ఆశ్చర్యం! ఈసారి కూడా తలుపు



తెరుచుకోలేదు. దానితో చూడటానికి వచ్చినవాళ్ళు అసహనంగా త్వరగా వురి కార్యక్రమం పూర్తి చేయమని అరిచారు మరోసారి ప్రయత్నించారు. జాన్‌లీ పక్కకు తప్పుకున్నాక లివర్ లాగగానే ట్రాప్‌డోర్ తెరచుకుంది. ఈసారి ఆ డోర్స్ మీద వుంచిన ఓ బరువుగల ఇటుకలు లోపలకు పడిపోయాయి. మళ్ళీ జాన్‌లీని ఆ తలుపుమీద నించోబెట్టి లివర్ లాగారు గట్టిగా.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యవంతమైన గట్టి పళ్ళు



# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంటే, కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




DC.G.74 TL

మూడోసారి కూడా తలుపు తెరచుకోలేదు. జాన్‌లీ వురి తీయబడకుండా అలాగే నించుని వున్నాడు.

వురితీసే వాడిలో ఆదుర్దా పెరిగి పెరిగింది. ట్రాప్‌డోర్ మడత బందీలకి నూనె రాసి మరోసారి ప్రయత్నించాడు.

ఊహుఁ

ఈసారి కూడా జాన్‌లీ కాళ్ళ కింద ట్రాప్‌డోర్ తెరచుకోలేదు.

జాన్‌లీని ఉరితీయడం అసాధ్యం అయిపోయింది. చూడటానికి వచ్చినవాళ్లు విసుక్కోసాగారు.

జాన్‌లీని వురితీయడం ఆపేసాడు జైలర్. తన పై అధికారులకి జరిగింది వివరిస్తూ రిపోర్ట్ పంపాడు. అది హోమ్ సెక్రెటరీకి చేరింది అంచెలంచెలుగా.

జాన్‌లీ వురి సమయంలో మానసికంగా బాగా బాధపడి వుంటాడు కాబట్టి ఆ శిక్ష యావజ్జీవ కారాగార శిక్షకి తగ్గించబడింది. కొన్ని సంవత్సరాల తర్వాత ఆ శిక్షని ఇంకా తగ్గించడంతో జాన్‌లీ విడుదల చేయబడ్డాడు.

కొన్ని సంవత్సరాలు జాన్‌లీ ఐరోపాలోని అన్ని దేశాలు, అమెరికా టూర్‌చేసి 'ఉరితీయబడలేని వ్యక్తి' గా ప్రజల ముందు దర్శనమిచ్చాడు.

అప్పట్లో ఆ ట్రాప్‌డోర్ అలా పని చేయకపోవడానికి సరయిన కారణం ఎవరూ చెప్పలేకపోయారు. దాన్ని ఎంతో మంది పరీక్షించి చూశారు. అయినా జాన్‌లీకి కూడా తెలియదు ఆ కారణం.

## ఓరియంటల్ ఎక్స్‌ప్రెస్

ఓరియంట్ ఎక్స్‌ప్రెస్ 1883 అక్టోబరులో మొట్టమొదటిసారిగా పేరిస్ నుంచి బుడాపెస్ట్ దాకా నడిచింది- రెండు స్లీపర్ కోచ్‌లు, రెండు లగేజ్ కోచ్‌లు, ఒక డైనింగ్ కార్‌తో. అప్పట్లో ఆవిరి ఇంజన్‌తో నడిచే దాని ప్రయాణ కాలం 81 గంటల 40 నిముషాలు.

బెల్జియం ఇంజనీర్ జార్జెస్ నేగెల్ మేకర్స్ దీనిని వూహించి అప్పటి బెల్జియం రాజు కింగ్‌లియోపోర్డ్‌కి వివరించాడు. ఆయనకి నచ్చడంతో 1876లో ఓ రైల్వే కంపెనీ స్థాపించబడింది. 40 లక్షల బెల్జియన్ ఫ్రాంకుల ఖర్చుతో 7 సంవత్సరాల తర్వాత ఓరియంటల్ ఎక్స్‌ప్రెస్ తయారు చేయబడింది.




1888లో దీనిమార్గాన్ని మార్చారు. దాంతో ప్రయాణకాలం 14 గంటలు తగ్గింది.

1899 నుంచి ఓరియంటల్ ఎక్స్‌ప్రెస్ బుడాపెస్ట్‌నుంచి స్టీమర్‌లో సముద్రందాటి టర్కీ దేశంలోని కాన్‌స్టాంటినోపుల్ దాకా ప్రయాణం చేయటం ఆరంభించింది.

1919లో జరిగిన ఓ ఒప్పంద ఫలి




చట్టబద్ధమైన హెచ్చరిక:
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం 1 రూపాయికి 10*
STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH
*గరిష్ఠ ధర స్థానిక పన్నులను అనుసరించి
CASVS-238-182 TEL
మెయిన్ డీలర్: సుల్తాన్ అబ్దుల్ హమీద్ అండ్ కో; మహబూబ్ నగర్

తంగా ఇది స్విట్జర్లాండ్‌లోని సింప్లన్ సొరంగంలోంచి ప్రయాణంచేసి సొరంగం చివర వున్న ఇటలీ ద్వారా గమ్యస్థానం చేరసారంభించింది. దాంతో, మరి కాస్త సమయం కలిసి వచ్చింది. దీని పేరు సింప్లన్ ఓరియెంట్ ఎక్స్‌ప్రెస్‌గా మార్చారు. ఆ సొరంగం పొడుగు 12 మైళ్ళు

ఫ్రాన్స్ నించి స్విట్జర్లేండ్, ఇటలీ, యుగొస్లేవియా, బెల్‌గ్రేడ్ చేరుకుంటుంది. వివిధ దేశాల నుంచి వచ్చే రైలు పెట్టెలు అక్కడ ఆ బండికి అమర్చబడతాయి.

రెండు పగళ్ళు, మూడు రాత్రుల్లో ఎనిమిది దేశాలను దాటాక ఓరియంటల్ ఎక్స్‌ప్రెస్ టర్కీలోని ఇస్తాన్‌బుల్ నగరం చేరుకుంటుంది

ఇందులో అనేకమంది ప్రపంచ ప్రసిద్ధులు ప్రయాణించారు. రచయితలలో అగాథాక్రిష్టీ,సోమర్ సెట్ మామ్,ఇయాన్ ఫ్లెమింగ్, గ్రాహంగ్రీన్ మొదలయిన వాళ్ళు, చిత్రసీమలోని వాళ్ళలో సీన్ కానరీ, ఆల్‌ఫ్రెడ్‌హిచ్‌కాక్, గ్రేటాగార్బొ మొదలయినవాళ్ళు, ఆగాఖాన్, 12వ పోప్ వంటి ప్రముఖులు ఇందులో ప్రయాణించారు.

అగాథాక్రిష్టీ ఈ రైలు నాధారంగా చేసుకుని 'మర్డర్ ఆన్ ఓరియంట్ ఎక్స్‌ప్రెస్' అనే అపరాధ పరిశోధక నవలని రాసింది. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో దీంట్లో గూఢచారులు అధికంగా ప్రయాణం చేయడంతో ఈ రైలు నాధారంగా చేసుకుని అనేక గూఢచారి నవలలు రాసారు చాలామంది రచయితలు. ఆ నవలలు సినిమాలుగా చిత్రీకరింపబడటంతో ఈ ఓరియంట్ ఎక్స్‌ప్రెస్ చాలా చిత్రాల్లో ప్రధాన పాత్ర వహించింది.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం వల్ల ఇది నిలిపేసారు. తిరిగి సెప్టెంబరు 1945 నించి ఇది నడవసాగింది. ప్రతీ కండక్టర్‌కి కనీసం 3 భాషలు వస్తాయి–ప్రయాణీకులతో మాట్లడటానికి. ప్రతి ప్రయాణికుడికి చిన్న గది, పెంపుడు కుక్కలు వుంచడానికి ప్రత్యేక సదుపాయాలు, స్నానాల గదుల్లో షవర్స్, ఖరీదయిన కార్పెట్ మొదలయిన సదుపాయాలున్నా, అందరికీ విమానయానం మీద మోజు పెరగడంతో ఇది నష్టంతో నడవసాగింది. దాంతో 1977 మే 22న ఆఖరిసారి ఇది ఇస్తాన్‌బుల్‌కు బయలు దేరింది. ఆ మర్నాటినుంచి ఓరియంట్ ఎక్స్‌ప్రెస్‌ను ఆపేసారు. 94 సంవత్సరాల పాటు విజయవంతంగా నడిచిన దీని చరిత్ర ఆ విధంగా ముగిసింది.

## కుర్చీలమ్మిన ఆడిటోరియం

లండన్‌లోని రాయల్ ఆల్బర్ట్ హాల్ ప్రపంచంలోని అతి పెద్ద ఆడిటోరియం. కోడిగుడ్డు ఆకారంలో వుండేదీంట్లో 7,000మంది కూర్చోవచ్చు. దీంట్లో గాన కచేరీలు, కుస్తీ పోటీలు, ప్రార్థనలు, నృత్యాలు, రాజకీయవేత్తల విమర్శలు మొదలైనవి అనేకం జరిగాయి. కనీసం 12 కోట్ల మంది ప్రేక్షకులు ఇది కట్టినప్పట్నుంచీ దీంట్లో కూర్చుని రకరకాల కార్యక్రమాలు చూసేరనిఅంచనా.

రాయల్ ఇంజనీర్స్ సైనిక దళానికి



తెలుగు సినీ పత్రికారంగంలో సంచలనం!

వారం వారం 7,00,000 మందిని తన్మయుల్ని

చేస్తున్న **జ్యోతిచిత్ర**

అనన్య ప్రచారంకలిగిన సినీ వారపత్రిక

ఉత్తమాభిరుచులకు-
తాజా వార్తలకు-

'ఆంధ్రజ్యోతి' వారు

అందిస్తున్న
రంగు రంగుల
రసమయ
రాగమాలిక







ఉమా

చెందిన కెప్టెన్ ఫ్రాన్సిస్ ఫోక్ అనేవ్యక్తి అతిపెద్ద ఆడిటోరియానికి ప్లాన్ తయారు చేసి, దాని కట్టడాన్ని చేపట్టాడు. అతను మధ్యలో మరణిస్తే, కల్నల్ స్కాట్ అనే వ్యక్తి ఆధ్వర్యంలో ఇది 1860లో పూర్తయింది.

అప్పటి బ్రిటిష్ రాణి విక్టోరియా దీనికి శంకుస్థాపన చేసింది. దాని ప్రారంభోత్సవం కూడా ఆమే చేసింది 1871 మార్చిలో. 1961లో మరణించిన తన భర్త ఆల్బర్ట్ పేరు ఆవిడే పెట్టి 'రాయల్ ఆల్బర్ట్ హాల్'గా పిలిచింది.



ఆ పేరే స్థిరపడిపోయింది.

దీంట్లో కుర్చీలు గుండ్రంగావుంటాయి. మూడు గేలరీలు, బాల్కనీ కూడా వున్నాయి. దీంట్లో ఒకటింపావు మైళ్ళ పొడవు గల కారిడార్లు, చలికాలంలో లోపల వెచ్చగా వుండటానికి క్షణాలలో ఎలక్ట్రిసిటీతో వెలిగించగల 11,000 గేస్ పొయ్యిలు వున్నాయి.

ప్రేక్షకుల సౌకర్యం కోసం దీంట్లో 11 బార్లు, 30 మంది పనిచేసే వంటగది మొదలైనవి వున్నాయి. ప్రేక్షకులని తమ సీట్ల దగ్గరికి తీసుకువెళ్ళటానికి 70 మంది ఉద్యోగులు పనిచేస్తున్నారు ఈ ఉద్యోగులు నెలజీతం మీద పని చేయరు. ఉపాధ్యాయులు, రిటయిరయిన సైనికులు, కంపెనీ డైరక్టర్లు మొదలైన వాళ్లు సరదాగా పని చేస్తారు. ప్రతి ప్రదర్శనకీ వాళ్ళకి రెండు టిక్కెట్లు, చిన్న వెండి రంగు బేడ్జ్ ఇవ్వబడ్తాయి.

సంవత్సరానికి 20 లక్షల టిక్కెట్లు అమ్ముడవుతూంటాయి.

ఈ బిల్డింగ్‌కి డబ్బు సేకరించిన విధంలో ఓ కొత్తదనం వుంది. అప్పట్లో 42 లక్షల రూపాయలు తక్కువ అయితే '2,100 రూపాయలు ఇచ్చిన ప్రతివారూ 999 సంవత్సరాలపాటు ఏ ప్రదర్శన కయినా వుచితంగా రావచ్చ'ని ప్రకటించడంతో 1300 మంది ముందుకు వచ్చారు. ఇప్పటికీ సీట్లని ఆ విధంగా కొన్నవాళ్ళ పిల్లలు, మనుమలు ఆ హక్కుని అనుభవిస్తున్నారు. కొంతమంది ఆ హక్కుని ఆస్తిలాగ ఇతరులకి అమ్మటం కూడా జరిగింది. సరాసరి రోజుకి రెండు కుర్చీలు పాడయిపోయి వాటి స్థానంలో కొత్తవి వేయబడుతుంటాయి. ఈ బిల్డింగ్‌లో 828 తలుపులున్నాయి. ఈ హాల్‌ని ఊడ్చటం కష్టకరమే! అయినా ఆ పని సక్రమంగా రోజూజరుగుతోంది.

# చేపల ఫారాలు

అమెరికాలో చేపలపెంపకం పెద్ద ఎత్తున జరుగుతోంది. కృత్రిమంగా చేయబడ్డ చిన్న చిన్న సరస్సులలో కేట్‌ఫిష్ అనే ఓరకం చేపని విరివిగా పెంచుతున్నారు. ఇవి పెరిగాక పట్టుకుని ప్రజలకి ఆహారంగా

అమ్ముతున్నారు. నదులలో దొరికేచేపలు అమెరికా దేశప్రజలకి చాలడంలేదు. పైగా నదులలోకి ఫేక్టరీలలో పనికిరానిపదార్థాలు నెట్టబడటంతో, ఆ రసాయనిక పదార్థాల ఫలితంగా చేపలు తినడానికి పనికిరానివిగా మారుతున్నాయి. 1960లో గుడ్లకోసం కోళ్లను పెంచినట్లు, పాలకోసం పశువులను పెంచినట్లు ఆహారంకోసం చేపల పెంపకం చేబట్టారు అనేకమంది. లాభదాయకంగా కనబడటంతో ఈ పరిశ్రమ బాగా అభివృద్ధిచెందింది.

80 హెక్టార్ల విస్తీర్ణంగల సరస్సులలో



సంవత్సరానికి 90వేల కిలోల చేపలు పెంచి అమ్మగలుగుతున్నారు. 1970లో 21,600 హెక్టార్ల విస్తీర్ణంగల కృత్రిమ సరస్సులలో 90 లక్షల కిలోల కేట్ ఫిష్‌ని పెంచగలిగారు. వీటి ఖరీదు 20 కోట్ల 21 లక్షల రూపాయలకు సమానం.

రెండడుగులకి మించివుండని నీటిలో వీటి పెంపకం జరుగుతోంది. కేట్ ఫిష్ దగ్గరదగ్గరగావుంటే ఆడ మొగ కలుస్తాయి. అవి కలసే కాలంలో మిల్క్ కేన్స్‌ని నీటిలోముంచి వాటిలోకి చేపలకు రావడానికి ఆహారం వుంచుతారు. చేపలు ఆ కేన్‌లలో దగ్గర అవడంతో సంపర్కం జరుగుతుంది. చేపలు గుడ్లుపెట్టి అవి పిల్లలయాక కేన్స్‌ని పైకితీసి వాటిని వేరే సరస్సుల్లోవేసి పెంచుతారు. అవి పన్నెండున్నర నించి 15 సెంటి మీటర్ల పొడవు ఎదిగేదాకా ఆగి వాటిని పట్టుకుంటారు. చేపలు కదలకుండా సరస్సుల్లో ఇనప వైర్ జల్లెడలని అక్కడక్కడా వుంచడంతో చేపలు త్వరగా బలపడం జరుగుతుంది. సరస్సుల్లోని నీటిని లారీల కుండే టేంకుల లోకి ఎలక్ట్రిక్ పంపుద్వారా నింపుతారు. నీటితోపాటు చేపలుకూడా ఆ టేంకులలోకి వెళ్తాయి.

దగ్గరేవున్న ప్రాసెసింగ్‌ప్లాంట్‌లో ఆ నీటిని టేంక్‌లోంచి మరో పంపుద్వారా తీసేసారు. టేంక్‌లో మిగిలిన చేపలన్నీ ఓ కన్వేయర్ బెల్ట్‌మీద పోస్తారు. అవి వెంటనే మరణించడానికి వాటికి స్వల్పంగా ఎలక్ట్రిక్ షాక్‌ని ఇస్తారు. పనివాళ్ళువాటి చర్మాన్ని తీసి శుద్ధిచేసారు. తూకంవేసి ప్లాస్టిక్ సంచులలో పేక్‌చేసి హోల్ సేలర్లకి, రీటెయిలర్లకి కేట్ ఫిష్‌ని వండేహోటళ్ళకి పంపుతారు. మిగతాది శీతలీకరణ పద్ధతిలో భద్రపరచి సూపర్ మార్కెట్లకి పంపుతారు.

ఇటీవల ఆటోమేటిక్‌గా పనిచేసే అనేకయంత్రాలని చేర్చారు ఈప్లాంట్‌లలో. స్వచ్ఛమైన నీటిలో సరిపడ ఆహారంతో పెంచబడటంతో ఇలా పెంచబడే చేపలు నదులలోని అపరిశుద్ధ నీటిలో పెరిగే చేపలకన్నా రుచిగా వుంటాయి.

ఒక హెక్టారు నేలలో సంవత్సరానికి 1350 కిలోల చేపలని తీసి అమ్మవచ్చు.





# పోలీసు కుక్కలు

వాసనని బట్టి దోషినిపట్టుకునే కుక్కల్ని ఇప్పుడు ప్రపంచంలోని అన్ని పోలీసు సంస్థలు వాడుతున్నాయి. 1938 లోనే స్కాట్ లెండ్ యార్డ్‌లో కుక్కల విభాగం ఏర్పరచబడింది.

ఆల్సేషియన్, లెబ్రడర్, డోబర్ మెన్ అనే మూడు జాతులకి చెందిన కుక్కలనే పోలీసు కుక్కలుగా శిక్షణ ఇస్తారు. లండన్‌లోని బకింహేం పేలస్‌ని ఇవే కాపలా కాస్తున్నాయి. ప్రస్తుతం లండన్ పోలీసుల విభాగంలో 200 జాతి కుక్కలు వున్నాయి. వాటిలో చాలా భాగం నగర పౌరులచే బహుమతిగా ఇవ్వబడ్డవే.

వీటికి ఒక సంవత్సరం వయసులోనే శిక్షణ ఇవ్వడం ప్రారంభిస్తారు. అది మోయలేని బరువయిన వస్తువుని నోటితో పట్టుకుని దానికి శిక్షణ ఇచ్చే వ్యక్తి దగ్గరకి తీసుకురావడంతో ప్రారంభం అవుతుంది శిక్షణ. ఇందువల్ల దాని మెడ గట్టి పడుతుంది. తర్వాత దాని సహజ గుణమైన వాసనని పసికట్టడం నేర్పుతారు. ఎలాంటి వాతావరణంలోనైనా పొలాల్లో, రోడ్లమీద, నగరంలోని వివిధ ప్రాంతాలలో మనిషి వాసనను బట్టి, ఆ వాసన వెంట ప్రయాణం చేసి ఆ మనిషిని పట్టుకోవడం నేర్పుతారు. పెద్ద భవంతిని ప్రతీ గదీ, ప్రతీ అంతస్తు వెదకడం నేర్చుకుంటుంది ఈ శిక్షణలో. శిక్షణలో ముఖ్య భాగమయిన విషయం నేరస్తుడు కనబడగానే అతని మీదకి దూకి కుడి చేతి మణికట్టుని పట్టుకోవడం శిక్షణ ఇచ్చే వ్యక్తి సూచన ఇచ్చినప్పుడే నేరస్తుడి చేతిని పట్టుకోవడం, నేరస్తుడు పారిపోయే ప్రయత్నం చేస్తే సూచన లేకపోయినా పట్టుకోవడం నేర్పుతారు. గట్టిగా మొరిగి పళ్ళని బయట పెట్టడం ఇవి అనుభవం మీద నేర్చుకుంటాయి. నేరస్తులు దాన్ని చూడటంతో భయం కలిగి పారిపోలేరు.

సాధారణంగా చక్కటి శిక్షణ పొందిన పోలీసు కుక్కలు నేరస్తులకి హాని చెయ్యవు. అతన్ని పట్టుకోమనే సూచన వచ్చేదాకా నేరస్తుడి చుట్టూ తిరుగుతూ గట్టిగా మొరుగుతూ పారిపోకుండా



కాపలా కాస్తాయి.

కుక్కలని అపరాధ పరిశోధకులుగా తీర్చిదిద్దిన బ్రిటిష్ దేశస్తులు ప్రపంచంలోని మిగతా పోలీసు సంస్థలకు మార్గదర్శకులుగా చెప్పచ్చు. బ్రిటన్‌లోని కెంట్ నగరంలోని మెట్రోపాలిటన్ పోలీసు డాగ్ ట్రెయినింగ్ ఎస్టాబ్లిష్‌మెంట్‌కి తమ కుక్కలని శిక్షణకి అనేకా దేశాలు పంపుతున్నాయి.

పోలీసు కుక్కలవల్ల కొన్ని వేలమంది హంతకులు, దొంగలు, ఇతర నేరస్తులు పట్టుబడ్డారు. లండన్‌లోని హైడ్‌పార్క్‌లో ఇతర చోట్ల పోలీసులు వీటిని కాపలా కుక్కలుగా వాడుతున్నారు. చీకట్లో చెట్ల మధ్య దాక్కున్న మనుషులని ఇవి ఇట్టే పసికట్టగలవు.

## ఫైవ్ స్టార్స్

**హో**టల్స్‌కి అవి సమకూర్చే సౌకర్యాలని బట్టి మూడు లేక ఐదు స్టార్స్ ఇవ్వబడతాయి. ఫైవ్ స్టార్ హోటల్‌లో లభ్యమయ్యే సౌకర్యాలు చాలా వుంటాయి. సాధారణంగా వీటిల్లోని గదుల అద్దె నూటయాభై నుంచి ఐదు వందల్దాకా వుంటుంది.

హోటల్‌కి చేరుకోగానే, రిసెప్షనిస్టు దగ్గర తాళం చెవి తీసుకుని సామాను అక్కడే వదిలేసి లిఫ్ట్‌లో గదికి చేరుకోవచ్చు. హోటల్‌లో ప్రత్యేకంగా వుండే, 'బెల్ బాయిస్' అనబడేవాళ్లు సామానుని గదికి తీసుకు వస్తారు.

ప్రతిగదిలో 'గార్బేజ్ డిస్పోజల్ బేగ్'లని వుంచుతారు. ఆ కాగితం సంచీలలో పారేయవలసిన చెత్తని వేసి స్టేపిల్ చేసి చెత్త డబ్బాలో పడేయాలి.

న్యూస్‌పేపరు పరిమాణంలో వుండే 'లాండ్రీ బేగ్'లో వుతకాల్సిన బట్టల్ని వుంచితే ఓ నిర్ణీత సమయంలో గది శుభ్రం చెయ్యడానికి వచ్చే బోయ్ దాన్ని తీసికెళ్ళి, ఎనిమిది గంటల్లో వాట్ని వుతికించి, ఇస్త్రీ చేసి గదికి తీసుకొస్తాడు.

ప్రతీగదీ ఎయిర్‌కండిషన్డ్ చేయబడి వుంటుంది. అటాచ్డ్ బాత్‌రూంలో రోజూ ఓ కొత్త సబ్బు వుంచుతారు. క్రితం రోజు వుపయోగించిన సబ్బుని ఇంకా అరగకపోయినా తీసి పారేస్తారు. చిన్న ప్లాస్టిక్ పాకెట్లలో జుట్టుకి వాడే షాంపూ, పేపర్ కర్చీఫ్స్ ఉడుకులాంలో ముంచి తయారు చేసిన కర్చీఫులుండే తగరపు పాకెట్లు వుంటాయి స్టెరిలైజ్ చేసిన రెండు గాజు గ్లాసులు కూడా వుంచుతారు-టూత్ పేస్ట్ బ్రష్ మొదలయినవి వుంచడానికి.

ఓ కస్టమర్ గది ఖాళీచేసి ఇంకొకరు




రాబోయే ముందు టాయిలెట్ పేన్‌ని శుభ్రంగా కడిగి దానిమీద పెద్ద సెలిఫోన్ పేపరు తొడుగుని వుంచుతారు.

నేప్‌కిన్స్, రెండు టవల్స్, బాత్‌టబ్ విధిగా వుంటాయి. ఇరవై నాలుగ్గంటలూ వేడి నీళ్ళు, చన్నీళ్ళు వస్తూంటాయి.

ఆ హోటల్ ఎంబ్లెమ్ వేసిన అగ్గిపెట్టెలు గదిలో ఏష్‌ట్రే పక్కనే వుంచబడతాయి. ప్రతి ఫైవ్ స్టార్ హోటల్‌లో స్విమ్మింగ్ పూల్, బార్, మూడు భోజనశాలలు, ట్రావెల్ ఏజెన్సీ, విదేశీ

మారక వ్యవహారాలు చూసే బేంక్, బ్యూటీ పార్లర్, రెండు కాన్ఫరెన్స్ హాల్స్ టాక్సీ ఏజెన్సీ వుంటాయి. ప్రతి గదిలోంచి సరాసరిగా లోకల్ కాల్స్ చెయ్యొచ్చు. ఆపరేటర్ అవసరం లేదు. టెలిఫోన్ ద్వారా భోజనం, కూల్, హాట్ డ్రింక్స్, టేక్సీలు, సిగరెట్లు, పోస్టల్ స్టేషనరీ మొదలైనవి ఆర్డర్ చెయ్యవచ్చు. బెల్ కొట్టి బాయ్‌ని పిలిచి అడిగే అవసరం ఉండదు.

ప్రతి గదిలో కవర్లు, లెటర్ హెడ్స్ ఉంటాయి. ఉత్తరాలని రిసెప్షన్ దగ్గరుండే బాక్స్‌లో పడేస్తే వాటిని మేనేజ్‌మెంట్ పోస్ట్ చేస్తుంది. దాదాపుగా రాజభోగాలన్నీ ఫైవ్ స్టార్స్ హోటల్స్‌లో అమరుతాయి.

# వింత దొంగలు

దొంగలొచ్చారనగానే బంగారమో, డబ్బో, విలువైన వస్తువులో ఎత్తుకుపోడానికి వచ్చేరనుకోవటం సహజం.

కానీ పోలీసుల సహాయంతోనే ముగ్గురు దొంగలు న్యూజెర్సీ నగరంలోని ఒక రోడ్డుని దొంగతనం చేసేరు.

ట్రాఫిక్ పోలీసు వాహనాలు రోడు మీదకి రాకుండా జాగ్రత్త పడుతుంటే రోడ్డుని మరమ్మత్తుచేసే వుద్యోగుల వేషంలో వచ్చిన ముగ్గురు దొంగలు రోడ్డుమీద పరచిన 50 వేల రాళ్ళని లారీలలోకి ఎక్కించుకుని చక్కా పోయారు.

ఫ్రాన్సులో 1961లో చాలా కాలంగా ఉపయోగించకుండా వుంచిన రైలుపట్టాలు పనికివస్తాయో, లేదో చూద్దామని అధికారులు వచ్చి చూస్తే 60 కిలోమీటర్ల పొడవుగల ఆ రైలుపట్టాలు అక్కడ లేవు. ఎప్పుడు, ఎవరు ఎత్తుకెళ్ళారో ఇప్పటికీ తెలియదు.

1965లో ఇంగ్లండులో స్టేఫోర్డ్ షైర్ అనేచోట 4 మైళ్ళ పొడవుగల రైలు పట్టాలని ఎవరో దొంగిలించారు. వాటి ఖరీదు 10,300 పౌండ్లు. మరో 280 గజాల పట్టాలని దొంగిలిస్తుండగా ఆ దొంగని పట్టుకున్నారు.

అమెరికాలోని అలబామాలో 8 టన్నుల బరువుగల బ్రిడ్జికి కావలసిన సామాను మొత్తం ఓ గోడౌన్‌లోంచి మాయమైపోయింది.



మొరాకోలో కట్టబడ్డ రైల్వే బ్రిడ్జిని ఎవరో రాత్రికి రాత్రే దొంగిలించేశారు. ఇటలీలో 200 టన్నుల బరువుగల ఓ బ్రిడ్జి 1971లో దొంగిలింపబడింది.

కెయిరో నగరంలోని ఓ పెద్ద భవనం నుంచి రాత్రికిరాత్రే ఎనిమిదిమంది ప్రయాణించడానికి అనువుగా వుండే ఎలక్ట్రిక్ లిఫ్ట్‌ని దొంగిలించారు.

ఫ్రాన్సులో 74 ఎకరాల అడవిలో గల 6000 పైన్ వృక్షాలని పడగొట్టి

ఎత్తుకుపోయారు. ఈ దేశంలోనే 1954లో 30 టన్నుల బరువుగల ఇనప తలుపులని ఎత్తుకెళ్ళిపోయాడో మహానుభావుడు. ఆ దొంగ ఎవరో ఇంతదాకా కనుక్కోలేక పోయారు.

# స్పీడ్ లిఫ్టులు

అమెరికా లాంటి ఐశ్వర్యవంతమైన దేశాలలో చాలా భవనాల్లో 30 నుంచి 40 దాకా అంతస్థులుంటాయి. కాబట్టి లిఫ్టులు తప్పనిసరి.

మూడు, నాలుగు అంతస్థుల భవనంలో వుండే లాంటి లిఫ్టులు పనికి రావు వీటికి. ఎలక్ట్రానిక్ పరికరాల్తో నడిచే ఇవి అమిత వేగంతో పైకి, కిందకీ తిరుగుతూ వుంటాయి.

ఈ ఆటోమాటిక్ లిఫ్టలలో నడిపేందుకు ప్రత్యేకంగా మనుషులు వుండరు. ఎవరు పడితే వాళ్ళు బటన్స్ నొక్కి కావలసిన చోటికి వెళ్ళే విధంగా లిఫ్ట్‌లో మీటలు వుంటాయి. ఎప్పుడూ అలాంటి లిఫ్ట్‌లోకి రాని కొత్తవాళ్ళు కూడా తేలికగా నడపొచ్చు వాటిని.

లోపలికి వచ్చి ఏ అంతస్థుకి వెళ్లాలో ఆ బటన్ నొక్కకపోతే "ఇది ఆటోమాటిక్ లిఫ్ట్. బటన్‌ని నొక్కండి" అనే మాటలు లిఫ్ట్‌లోనివాళ్ళకి వినపడుతాయి.

లిఫ్ట్ తలుపులు మూసుకుంటూండగా మరొకరు లోపలికి వస్తూ వాటి మధ్య చిక్కుకుంటే, తలుపులు రెండూ మనిషి స్పర్శ తగిలిన మరుక్షణం వేగంగా వెనక్కి వెళ్లిపోయి, కొద్దిక్షణాల తర్వాత మళ్ళీ మూసుకుంటాయి. తలుపుల చివర రబ్బరు తొడుగులు వుండటం చేత మనిషికి ఎలాంటి దెబ్బలూ తగలవు. తలుపుల మధ్య నిలబడి లిఫ్ట్‌ని ఆపి, లిఫ్ట్‌లోని తన స్నేహితులతో ఎవరైనా మాట్లాడితే కొద్దిసేపటి తర్వాత "తలుపు దగ్గర్నుంచి దయచేసి జరగండి" అన్న మాటలు వినపడతాయి.

లిఫ్ట్‌లోని వివిధ వ్యక్తులు, తాము వెళ్ళాల్సిన అంతస్థుల నెంబర్లు నొక్కితే ఆయా అంతస్థులలో లిఫ్ట్ ఆగుతుంది. అంతస్థు నెంబరు వినబడుతుంది ఆగిన చోటల్లా. ముందర ఒకరు 44




నంబరు బటన్, తర్వాత ఒకరు 33, తర్వాత 22 నంబరు బటన్స్ నొక్కితే లిఫ్ట్ పైకి వెళుతూ చివరిసారి నొక్కబడ్డా ముందర 22వ అంతస్థులో ఆగుతుంది. తర్వాత 33, ఆ తర్వాత 44వ అంతస్థులో ఆగుతుంది. అంతేకాని పైకి వెళ్ళి కిందకి రాదు.

ఒక్కో భవనంలో 10 నుంచి 20 దాకా లిఫ్ట్ లుంటాయి. ఇవి నిమిషానికి 1400 అడుగుల వేగంతో ప్రయాణం చేస్తాయి.

కొన్ని లిఫ్ట్‌లు కింద నుంచి మధ్యలో ఎక్కడా ఆగకుండా చివరి అంతస్థుకి




వెళ్తాయి. లిఫ్ట్‌లోకి అందులో సరిపడా మనుషులు రాగానే యాంత్రికంగా తలుపులు మూసుకుని చివరి అంతస్థుకి చేరుకుంటాయి. కొన్ని లిఫ్టులు ప్రతీ పదో అంతస్థులో ఆగుతూ వెళ్తాయి.

ఈ ఎలక్ట్రానిక్ లిఫ్టలని కంప్యూటర్ బ్రెయిన్ కంట్రోల్ చేస్తుంటుంది.

# సూపర్ ట్రెయిన్

న్యూయార్క్ నించి చికాగో నగరం మీదుగా సేంటాఫే దాకా అమెరికాలో నడిచే రైలు 'సెంచరీ' గంటకి 90 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తుంది. ఇది ఆ దేశంలోని సూపర్ ట్రెయిన్. శనివారం తప్ప మిగతా ఆరు రోజుల్లో ఆరు బళ్ళు నడుస్తాయి.

ఈ రైళ్ళని 'నడిచే హోటళ్ళు'గా కూడా పేర్కొంటారు. ప్రతీరైల్లో క్షవరశాల, లాండ్రీ, ప్రపంచంలోని ఏ మారుమూల ప్రాంతానికయినా మాట్లాడే సౌకర్యంగల వైర్‌లెస్ టెలిఫోన్, రైల్లోనే ముద్రించబడే వార్తాపత్రిక, ప్రయివేట్ డైనింగ్‌రూం, ప్రతీ కేబిన్‌లో వినబడే సంగీతం మొదలయిన సౌకర్యాలుంటాయి. రైలు మొత్తం ఏర్‌కండిషన్ చేయబడి వుంటుంది.

ఉదయం 9.30కి న్యూయార్క్ స్టేషన్‌కి ఈ రైలు రాగానే ప్రతీ పెట్టెనీ సబ్బు నీటితో బయట భాగాన్ని కడుగుతారు. సాధారణంగా ఈ రైలుకి 15 పెట్టెలుంటాయి. వాటిలో 2 తపాలా సంచులు తీసుకువెళ్ళేవి. ఒకటి కిచెన్ కార్. ఒకటి డైనింగ్ కార్. ప్రతీ పెట్టెకి వుండే జెనరేటర్ సరిగ్గా వుందో లేదో తణిఖీ చేస్తారు. ఏర్‌కండిషనర్స్ సరిగ్గా పనిచేస్తున్నాయో లేదో కూడా తణిఖీ చేస్తారు. అక్కడక్కడా ఏర్పడ్డ గీతల మీద మళ్ళీ రంగు వేస్తారు.

పెట్టెలన్నిటినీ లోపలి భాగంలో తుడిచి శుభ్రపరుస్తారు. ప్రతీ పెట్టెలో కార్పెట్‌లు పరిచివుంటాయి.

కిచెన్‌లో వంట చెరుకుగా రంపపు పొట్టుని వుపయోగిస్తారు. తెల్లవారుఝామున రెండు గంటలకే వంట గదిలో పనిచేసేవాళ్ళు పొయ్యిని రాజేస్తారు. మాంసంతో అన్ని రకాల వంటలూ వండుతారు.




ఉదయం 4.50 కల్లా న్యూయార్క్‌లోని గ్రాండ్ సెంట్రల్ స్టేషన్‌కి చేరుకుంటుంది సెంచరీ. ప్లాట్‌ఫారం మీద 260 అడుగుల పొడవు అరటన్ను బరువుగల ఎర్రటి కార్పెట్‌ని పరుస్తారు. ప్రయాణీకులకి స్వాగతం చెప్పే విధం అది.

ప్రతీరోజు ఉదయం 6.01 కల్లా 'సెంచరీ' రైలు బయలుదేరుతుంది.

6000 హార్స్ పవర్ గల లోకోమోటివ్ ఎలక్ట్రిక్ ఇంజను దీన్ని నడుపుతుంది. మర్నాడు వుదయం 7.45కి చికాగో నగరంలోని లాసేల్లె స్ట్రీట్ రైల్వే స్టేషన్‌కి చేరుకుంటుంది.

# ప్రపంచ భాషలు

ఈ లోకంలో ప్రతి వ్యక్తికీ మాతృ భాష అంటూ ఒకటుంది. ప్రపంచంలో 2,796 భాషలున్నాయి. వాటిలో గ్రీక్, సంస్కృతం, లాటిన్, హిటైట్ లాంటి అనేక భాషలు పూర్తిగా మరణించాయనే చెప్పొచ్చు. అవి ఎంత మాత్రం వాడుకలో లేవు.

ఇప్పుడు ప్రపంచంలో అత్యధిక జనాభా మాట్లాడే భాష చైనీస్. 80 కోట్ల మందికి అది మాతృ భాష. తర్వాతి స్థానం హిందీ, ఉర్దూలదే. ఈ రెంటికీ అతి దగ్గరి సంబంధం వుంది. 29 కోట్ల మంది వీటిని మాట్లాడుతున్నారు.

ఇంగ్లీషది మూడో స్థానం. 26 కోట్ల మందికి ఇది మాతృ భాషే అయినా, ప్రపంచంలో అధిక భాగం ప్రజలు దీన్ని మాట్లాడగలుగుతున్నారు. లేదా అర్థం చేసుకోగలుగుతున్నారు. స్పానిష్ భాష 16 కోట్ల మందికి, రష్యన్‌భాష 14 కోట్ల మందికి మాతృభాష.

ఈ విధంగా చూసుకుంటే ఆ తర్వాతి స్థానాలు జర్మన్ భాషకి (11 కోట్లమంది) జపనీస్ (11 కోట్లు), ఫ్రెంచ్ (9కోట్లు), ఇండోనీషియా (9 కోట్లు), పోర్చుగీస్ (9 కోట్లు), అరబిక్ (8కోట్లు), బెంగాలీ (7 కోట్లు), ఇటాలియన్ (7 కోట్లు).

ప్రపంచంలో 2,796 భాషలున్నా మూడింట రెండువంతుల మంది మాట్లాడే భాషల మొత్తం పైనపేర్కొన్న పదమూడు మాత్రమే. ఈ పదమూడు భాషలు 65 దేశాల్లో అధికార భాషలుగా చలామణి అవుతున్నాయి. వీటిలో అత్యధిక ప్రాధాన్యత గల భాష ఇంగ్లీష్. ప్రపంచంలో ప్రతి నలుగురిలో ఒకరు సగటున మాట్లాడే భాష చైనీస్. కాని ఇంగ్లీషకున్న ప్రాధాన్యత చైనీస్‌కి కాని, హిందీ, ఉర్దూలకి కాని లేదు. కారణం




ఇంగ్లీషు అంతర్జాతీయ భాష. అలాగే జర్మన్, ఫ్రెంచ్, స్పానిష్ భాషలు కూడా అంతర్జాతీయాలే. ఈ నాలుగు భాషలు వస్తే ప్రపంచంలో ఏ ప్రాంతానికి వెళ్ళినా భాషా సమస్య వుండదు. కమ్యూనిస్టు దేశాలలో అయితే రష్యన్ భాష తప్పనిసరిగా తెలిసి వుండాలి.

# సాహసం

అట్లాంటిక్ మహాసముద్రాన్ని అనేక మంది సాహసవంతులు అనేక విధాలుగా




దాటారు. 1917లో మొట్టమొదటిసారిగా విమానంలో దాన్ని ఓ అమెరికన్ దాటాడు.

40ఏళ్ళ చెకొస్లోవేకియా దేశస్థుడు జరోమీర్ వేగ్నర్ విమానంలో కూర్చోకుండా, విమానం టాపుమీద నించుని ఇటీవల అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటాడు.

ఇతను పశ్చిమ జర్మనీలోని ఫ్రేంక్ఫర్టనించి అమెరికాలోని న్యూయార్క్ దాకా ఆ విధంగా విమానంమీద నిలబడి ప్రయాణంచేశాడు.




ఓ విమానాల కంపెనీ ఇందునిమిత్తం వేగ్నర్‌కి రెండు ఇంజన్లు గల విమానాన్ని సరఫరా చేసింది. అది గంటకి 170మైళ్ళ వేగంతో నడుస్తుంది.దారిలోనాలుగు చోట్ల ఇంధనం కోసం ఆగాలి. తుఫానులు, మంచు, వర్షం, చలి తననేం చేయకుండా ఓ ప్రత్యేకమయిన సూట్‌ని ధరించాడతను ఆ ప్రయాణకాలంలో. ఆ ప్రయాణానికి ముందు అనేక నెలలుగా వంద మైళ్ళ వేగంతో నడిచే కారుమీద పడిపోకుండా కదలకుండా కట్టేసుకుని నించుని ఆ వేగానికి అలవాటు పడ్డాడు. అంత వేగంగా వీచే గాలిలో వూపిరి పీల్చుకోవడం కష్టం. అయినా క్రమంగా ఉచ్ఛ్వాస నిశ్వాసలు ప్రతిబంధకం కాకుండా అలవాటు చేసుకున్నాడు. 10 వేల అడుగుల ఎత్తుని మించి ఎగరలేదు అతను నిలబడి ప్రయాణం చేసిన విమానం. ఆ ఎత్తు దాటితే గాలిలో ఆక్సిజన్ తక్కువగా వుంటుంది.

అతని భార్య మేరియా అనేక విధాలుగా అతన్ని ఈ సాహసంనించి విరమింప చేయడానికి ప్రయత్నించి విఫలమయింది.

## చంద్రనౌక

**1969లో** మానవుడు మెట్టమొదటిసారిగా చంద్రుడి మీద కాలు పెట్టాడు. వారిని తీసుకెళ్ళిన అపోలో రాకెట్ నిర్మాణం వెనక కొన్నివేల మంది కృషి వుంది. 1961నుంచి అదితయారీలోవుంది. దానికి కావలసిన భాగాలని 20 వేల ఫాక్టరీలు తయారుచేశాయి. 200 యూనివర్సిటీ కాలేజీ ప్రొఫెసర్లు దాన్ని రూపొందించడానికి సాంకేతిక సలహాలు, సహకారాలు అందించారు. అపోలోని తయారుచేయడానికి 37 కోట్ల 50లక్షల డాలర్లు ఖర్చయ్యాయి. కాని దాని రీశర్చికి ఇంకా ఎక్కువ ఖర్చయింది. ఆ మొత్తం 2,400 కోట్ల డాలర్లు!

చంద్రుడి మీద ఉదయం ఉండే 243 డిగ్రీల వేడిని, రాత్రివుండే 279 డిగ్రీల చలిని తట్టుకోవడానికి అనువుగా వుండే లోహాన్ని వాడారు.దీని తయారీకి చంద్రుడి

మీద వాతావరణానికి సరిపడే దుస్తులు, తినడానికి ఆహారం, ఆ వాతావరణంలో రాలిపోని విధంగా తయారుచేయబడ్డ రంగు కుదించబడ్డ ఎలక్ట్రానిక్ పరికరాలు మొద లయిన విభాగాల్లో ప్రగతి సాధించారు.

అపోలోలో మొత్తం 91 ఇంజన్లు, 6 కోట్ల 10 లక్షల భాగాలు వున్నాయి. ప్రతీభాగం కొన్నివందలసార్లు పరీక్ష చేయబడింది లేబొరేటరీలో. ఇది మధ్యలో పాడయిపోతే అపోలో నడవటం ఆగి పోతుందా? అయితే వెంటనే దీనిబదులు మరోభాగం పనిచేసే విధంగా దీనికి



మరోభాగం జోడించొచ్చా? అనిప్రశ్నించు కుని ప్రతి భాగం తయారుచేయబడింది. ఒకోసారి అలా రెండుభాగాలు చెడి పోయినా వాటి స్థానంలో వెంటనే మూడోది పనిచేసే విధంగా అపోలోలోని భాగాలని తయారుచేసి అమర్చారు.

అపోలో చంద్రుడిమీదకి వెళ్ళి తిరిగి వచ్చాక పరీక్షిస్తే 6కోట్ల 10లక్షలభాగాల్లో కేవలం అయిదు భాగాలు మాత్రమే చెడిపోయాయని గుర్తించారు. మానవ పురోభివృద్ధినంతా అపోలో 8లో చూడొచ్చనడంలో అతిశయోక్తిలేదు.

## బోయింగ్ 747

ప్రపంచంలోని అన్ని విమాన సంస్థలు వుపయోగిస్తున్న జంబోజెట్ విమానం బోయింగ్ 747 ఇంతదాకా నిర్మించబడ్డ విమానాలన్నిటిలోకి పెద్దది. 350 టన్నుల బరువుండే దీని ఖరీదు 2 కోట్ల 10 లక్షల డాలర్లు. పైలట్ విమానాని కుండే మూడో అంతస్థులోని కేబిన్‌లో కూర్చుంటాడు. అయిదంతస్థుల భవనం అంత ఎత్తుంటుంది దాని తోక.

ప్రతీ బోయింగ్ 747లో 375 సీట్లు వుంటాయి. ఇవి అయిదు విభాగాలుగా విభజించబడ్డాయి. ఒకో విభాగం 20 అడుగుల వెడల్పు వుంటుంది. ప్రయా ణీకులకి ఏ విభాగంలో కేటాయించ బడిందో తెలియడానికి అయిదు విభాగా లకి అయిదు రకాల రంగుల సీట్లకవర్లు వుంటాయి. వారి టిక్కెట్లమీద తమ విభాగానికి చెందిన రంగు ముద్రించబడి వుంటుంది. ప్రతీ విభాగానికి ప్రత్యేకంగా టాయ్‌లెట్ లుంటాయి. లోపలికి ఎక్క డానికి నాలుగు జతల తలుపులుంటాయి. 15 మంది ఏర్ హోస్టెస్‌లుంటారు.

ఫస్ట్ క్లాస్ విభాగం నుంచి తిరిగే మెట్ల మీదుగా పైకి ఎక్కితే చిన్న లౌంజ్‌ని చేరుకోవచ్చు. అక్కడ పిల్ల లతో ఆడుకోవచ్చు. మీటింగ్ జరుపుకో వచ్చు. పడుకుని కునుకుతీయచ్చు.

విమానం బయలుదేరాక సీట్లో కూర్చుని సినిమా హాల్లోలాగా సినిమా




లేదా టెలివిజన్ చూడచ్చు. స్టీరియో మ్యూజిక్, వార్తలు వినచ్చు.

ఏడు దేశాలలోని 50 వేల మంది పనిచేస్తున్నారు. ఒక్కో బోయింగ్ 747 నిర్మాణానికి. మొట్టమొదటి బోయింగ్ 747 అక్టోబర్ 1, 1968న తయారయింది అమెరికాలో. 1969 నుంచి ప్రయాణీకుల కోసం వుపయోగించబడుతోంది. 1972 నించి మన దేశం కూడా వీటిని వుపయోగిస్తోంది.ఇది గంటకి 625 మైళ్ళవేగంతో ప్రయాణం చేస్తుంది. 110టన్నుల సామానుని ప్రయాణీకులతో



పాటు చేరవేస్తుంది. మామూలు విమానాల కన్నా దీన్ని 30 నుంచి 35 శాతం తక్కువ ఖర్చుతో నడపచ్చు కాబట్టి ఎక్కువ ప్రయాణీకులుగల రూట్లలో అధికంగా వుపయోగిస్తున్నారు. ముఖ్యంగా దేశాల మధ్య జరిగే రవాణాకి ఇది ఎంతో వుపయోగబడుతోంది.

దీనిలోకి సామాను, ప్రయాణీకుల సూట్‌కేస్‌లు అరగంటలో ఆటోమాటిక్ యంత్రాల సహాయంతో దించచ్చు, ఎక్కించచ్చు.

2,500 మంది ఇంజనీర్లు కలసి కోటి గంటలు వెచ్చించి, 100కోట్ల డాలర్లు రీసెర్చ్ మీద ఖర్చు చేసి అయిదు సంవత్సరాల్లో దీనిని రూపొందించారు. మొట్టమొదటగా పాన్ అమెరికన్ వరల్డ్ ఇర్‌వేస్ 25 విమానాలకి ఆర్డర్ఇచ్చింది. ఏప్పటికి వెయ్యి విమానాలపైనే అమ్ముడయ్యాయి. 2 లక్షల 73 వేల విడి భాగాలతో నిర్మించబడే ఈ విమానం, 6,000 మైళ్ళు ఎక్కడా ఆగకుండా 50 వేలగేలన్ల ఇంధనంతో ప్రయాణించగలదు.

## పాము మాంసం అమ్మే హోటల్

జపాన్ రాజధాని టోక్యోలో 'బుంక్ యుడో' అనే మాంసాహార హోటల్ ఒకటి వుంది. ఇందులో దొరికే మాంసాహారం ప్రపంచంలో మరే హోటల్‌లో దొరకదు. వివిధ రోగాలతో బాధపడే వాళ్ళు చికిత్సకోసం ఇక్కడ రకరకాల మాంసాహారం మందులా తినడానికి వస్తూంటారు.

తలకాయ నొప్పికి ఖడ్గమృగం కొమ్ము పొడి, వానపాములు; రక్తపుపోటుకి నక్క నాలుక; కిడ్నీ వ్యాధులకి ఓట్టర్ మాంసం ఇలా అనేక మృగాల మాంసం ఇక్కడ దొరుకుతుంది.

అన్నిటికన్నా ఎక్కువగా ఇక్కడ దొరికేది, అందరూ ఇష్టపడేది పాము మాంసం. ఇది మగతనాన్ని, వీర్యాభివృద్ధిని కలిగిస్తుంది. కొత్తగా ఆ

హోటల్‌కి వచ్చినవాళ్ళు పాము మాంసం అడిగితే 'మీకు పెళ్ళయిందా?' అని అడుగుతారు సర్వర్‌లు.

రకరకాల పాములు హోటల్ బయట అద్దాల పెట్టెల్లో వుంటాయి. కస్టమర్స్ వాటిలో తమకి నచ్చినదాన్ని చూపిస్తే వంటవాడు దాన్ని జాగ్రత్తగా తీసి కస్టమర్ ముందే మెడ విరిచి చంపేస్తాడు. ఆ పాము రక్తాన్ని వైన్‌లో కలుపుతాడు కొన్ని సుగంధ ద్రవ్యాలతోపాటు.

కస్టమర్ ముందే పాము తోలుని వలిచి, మాంసాన్ని చిన్న చిన్న ముక్క-



లుగా కోసి కస్టమర్‌కి నచ్చే రీతిలో, అతని రుచికి అనుగుణంగా వండుతాడు. పాము మాంసంతో చేసే వంటకాలకి ఇది ప్రాముఖ్యత వహించింది కాబట్టి దీన్ని 'స్నేక్ షాప్'గా వ్యవహరిస్తారు. పాము మాంసాన్ని నిప్పుల మీద కాల్చి, నూనెలో వేయించి లేదా ఆవిరిలో వండి ఇలా రకరకాలుగా తయారు చేస్తారు.

పచ్చి మాంసాన్నే ఇష్టపడేవారు సోయాబీన్స్ రసంలో ముంచి అల్లం ముక్కలు చల్లి పచ్చి మాంసమే తింటారు.

ఇక్కడికి రావడానికి సిగ్గుపడేవాళ్ళు వండిన పదార్థాలని ఇంటికి తెప్పించుకుంటారు. వాళ్ళలో కేబినేట్ మంత్రులు, రాజకీయ వేత్తలు వంటి ప్రముఖులూ ఉన్నారు.

రబ్బరు లాగా సాగే పాము మాంసం తినాలంటే చాలా సేపు నమలాలి. పాము నెత్తురు కలసిన మద్యం తాగుతూ తింటారు ఆ మాంసాన్ని. పాము లివర్, గుండెకాయ మొదలయిన భాగాలని ప్రత్యేకంగా వండుతారు. ఓ పాము ఇద్దరికి సరిపోతుందట.

## అడవుల్లో హనీమూన్

ప్రతీ వేసంకాలం అమెరికాలోని కొన్ని వందలమంది తమ శలవుల్ని కాకులు దూరని కారడవుల్లో, చీమలు దూరని చిట్టడవుల్లో, ఒంటి స్థంభంమేడలని తలపించే వాచ్‌టవర్స్‌లో గడుపుతారు.

అడవులని జాతీయ సంపదగా భావించే అమెరికన్ ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ వేసంకాలాల్లో అడవుల్లో చెలరేగే దావాగ్నిని అరికట్టడానికి అక్కడక్కడా మనుషులని కాపుంచుతుంది. వారు తమకి నిర్దేశించిన ప్రదేశాలని ప్రతీ 20 నిముషాలకోసారి ఎత్తయిన వాచ్‌టవర్‌ల నించి పరిశీలిస్తూ ఎక్కడయినా పొగని చూస్తే వైర్‌లెస్ ద్వారా దగ్గరలోవున్న అగ్నిమాపక దళానికి తెలియచేస్తారు.

వెంటనే ఆ ప్రదేశానికి విమానం పంపబడుతుంది. అగ్ని అడివినంతా నాశనం చేసే అవకాశం లేకుండా విమానం మీద నుంచి మంటలనార్పే కెమికల్స్ చల్లబడుతాయి.

అడవుల్లో నిప్పురాజుకుంటే, త్వరలో అది దశదిశలా పాకిపోతుంది గనుక అడవిలోని కలప, ఇతర ఆటవిక సంపద నాశనం కాకూడదని ఇన్ని ఏర్పాట్లు. ఆలస్యం అయిన కొద్దీ పరిస్థితి చేయి దాటి పోతుంది.



ఇందుకోసం నియమించబడేవారికి వారం రోజులపాటు నిప్పుని కనుక్కోవటం, ఆర్పటం మొదలయిన విషయాల్లో శిక్షణ ఇవ్వబడుతుంది. ప్రతీ 20 నిముషాలకి ఎత్తయిన వాచ్‌టవర్ నుంచి ఓ పద్ధతి ప్రకారం అడవినంతా కళ్ళతో గాలించాలి వీరు.

ఈ వాచ్‌టవర్‌కి వచ్చే వాళ్ళలో అధిక శాతం ఆడవాళ్ళు, తర్వాత కొత్తగా పెళ్ళయి హనీమూన్‌లో వున్న దంపతులు. వాళ్ళు చాలా ఇబ్బందులు ఎదుర్కోవల్సి వస్తుంది. కార్ల టైర్లని ముళ్ళ పందులు కొరుక్కు తినేస్తాయి. ఎలుగుబంట్లు, ఇతర క్రూర మృగాలు మెట్లెక్కి పైకి వస్తాయి. నీళ్ళకోసం ఒకోసారి ఓ కిలో మీటర్ దూరందాకా రోజూ వెళ్ళి రావాలి. ఏం తీసుకెళ్ళాలన్నా పైకి చేత్తోనే తీసుకువెళ్ళాలి. పురుగులు, పాముల భయం సదావుంటుంది. ఇక్కడికి చేరుకోడానికి సరయిన రోడ్లువుండవు. కొన్ని వాచ్‌టవర్‌లకి కేవలం హెలికాప్టర్‌లలో మాత్రమే వెళ్ళగలుగుతారు.

ఇన్ని ఇబ్బందులని ఎదుర్కొని వెళ్ళేవాళ్ళంతా పెద్దపెద్దనగరాలలో నివసించి విసుగుచెందిన వాళ్ళే. ఎంతో ప్రశాంతంగా వుండే అడవుల వాతావరణం ముందు ఇవన్నీ ఇబ్బందులుగా తోచవు వాళ్ళకి.

## నత్తలొస్తున్నాయ్ జాగ్రత్త

హవాయ్ ద్వీపం నుంచి అమెరికాకు వచ్చే ప్రయాణీకులని కస్టమ్స్ అధికారులు జాగ్రత్తగా తణిఖీ చేస్తారు. అయితే మాదక ద్రవ్యాల కోసం, వజ్రాలకోసం కాదు ఆ తణిఖీ. కేవలం నత్తల కోసం.

హవాయ్ నించి సరదాగా నత్తలు తెచ్చిన వాళ్ళు లోగడ అమెరికా దేశాన్ని అనేక ఇబ్బందులకు గురి చేసారు. ఆఫ్రికా ఖండానికి చెందిన ఈ నత్తలు మామూలు నత్తలు కావు. 6 నుంచి 9

అంగుళాల పొడవుండే వీటికి 80 వేల ఏళ్ళుంటాయి. వీటికి ఆకలి ఎక్కువ. చెట్లుగానీ, చేమలుగానీ, పంటలుగానీ తమ దారిలో ఏవి కనపడితే వాటిని భక్షిం చేస్తాయి.

పైగా వీటిలో మగా, ఆడా అంటూ ప్రత్యేకంగా వుండవు. రెండు జన నేంద్రియాలు ఒకే నత్తలో వుంటాయి. ఒక్కసారి 300 బఠాణీ సైజు గుడ్లు చొప్పున సంవత్సరానికి చాలాసార్లు పెడు తుంది ఒకో నత్త. ఆ లెక్కన ఒక నత్త




వల్ల అయిదు సంవత్సరాల్లో 11బిలియన్ల నత్తలు పుట్టుకొస్తాయి.

1953లో అమెరికాలో ఈ నత్తలు దేశంలోకి తేకూడదని చట్టం పాస్ చేశారు. తెచ్చినవారికి 500 డాలర్ల జరిమానా, ఒక సంవత్సరం జైలు శిక్ష విధించవచ్చు.

ఈ చట్టం పాస్ చేయటానికి కారణం వుంది. ఆఫ్రికాకి చెందిన ఇవి కాల క్రమేణా పసిఫిక్ దీవులుచేరి కొన్నికోట్ల డాలర్ల పంటని నాశనం చేసేయి. హోనలులూ, ఫార్మోజా, సిలన్, ఇండియా, చైనా, మలయా మొదలైన దేశాలలోకి ఇవి వ్యాపించాయి. సరదాగా పెంచుకుందామని ఎవరో కొన్ని తీసుకురావటం, అవి నమ్మ లేనంత త్వరగా అభివృద్ధి చెంది ఆ దేశంలోని పంటల్ని నాశనం చెయ్యడం జరిగింది. 1821 నుంచి 1930 దాకా సిలన్‌లోని కొబ్బరిచెట్లనన్నింటినీ పాడు చేసాయి ఈ రాక్షస నత్తలు. ఓసారి సింగపూర్లోని గోడలకుండే సున్నాన్ని కూడా ఇవి తినేశాయి.

నత్తమాంసం రుచించే జపాన్‌లో వీటిని ఆహారంగా పెంచాలని 1940లో తెచ్చేరు. తర్వాత నాలుగైదు సంవత్సరాల్లో పంటలు నాశనమవడంతో జపాన్ దేశ ఆర్థిక పరి స్థితే స్థంబించిపోయింది. వేలకొద్దీ నత్తలు ఆహారాన్ని తింటుంటే కట్టెలు కాలితే వచ్చే శబ్దం వచ్చేదట.

వీటికి సహజ శత్రువులని ప్రయోగిస్తే కాని విముక్తి లభించదని ఆఫ్రికాలోని ఓ రకం నత్త 'డూ-డూ' లని అమెరికాకి 1951లో దిగుమతి చేసేరు. ఈ 'డూ - డూ' జాతి నత్తలు, రాక్షస జాతి నత్తలని తినేయటం ప్రారంభించగా 1955కల్లా అవి 60 శాతం నాశనం అయ్యేయి. 2,000 డూ-డూ నత్తల్ని దిగుమతి చేస్తే ఇప్పటికి అవి 5,000 అయ్యేయంతే.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402

# మదిలో 'ప్రియ' మెదిలేదెప్పుడు?

## ఎల్ల వేళలా...

ఉదాహరణకు ప్రయాణాల్లో...

చవులూరించే 'ప్రియ' అల్లం, టొమాటో పచ్చళ్ళు ప్రయాణ సమయాల్లో ఆదుకొనే నేస్తాలు. ఇడ్లీ, వడ, పూరీ, సాండ్‌విచ్... ఏదయినా సరే-'ప్రియ'తో జోడించండి. ఆ రుచి అద్భుతం!

మామిడికాయ, నిమ్మకాయ, గోంగూర, అల్లం, టొమాటో... అన్నీ మీకు నచ్చే పచ్చళ్ళే. తెలుగు నేల నాలుగు చెరగులా గాలించి తెచ్చిన పళ్ళూ, కాయలకు తగుపాళ్ళలో నాణ్యమయిన మసాలాలు మేళవించి, అధునాతన కర్మాగారంలో, అత్యంత పరిశుభ్రమయిన వాతావరణంలో తయారుచేసిన పచ్చళ్ళివి.

మీకిష్టమయిన 'ప్రియ' పచ్చడిని ఈరోజే కొనండి. మీరు వెచ్చించే ప్రతిరూపాయికీ మించిన కమ్మదనాన్ని రుచి చూడండి.

ప్రియ పచ్చళ్లు **300** మరియు **650** గ్రాముల సీసాలలో లభిస్తాయి

తయారుచేయువారు:
**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.



Marketed by
**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Somajiguda
Hyderabad-500 004




KIRON/PF/ 8012 TEL